# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



అగస్టు 1970



సంపుటము : 47 : సంచిక : 8 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1970





# వారాశి

## శ్రీ వజ్ఝల జగన్నాథము

జలనిధి తీరమం దొంటి నెదచారిగ సంధ్యలఁ బోవుచుంటి. నీ
తలమగు మందమారుతము తెన్నువయిన్ నటియింపు చుండగా,
నలఘుతరంగమాలికలనంతములై మధురస్వనంబులన్
జెలియలికట్టపైఁబడి విశీర్ణములయ్యె మనోహరాకృతిన్

దల్లనిపిల్ల తెమ్మెరలు సైకతభూమిని వీచుచుండగా
వెల్లువపారు నల్లు వినిపించితి నీచికలందుఁ దెప్పలన్
జెల్లని నాదముల్ వెదకు చేపల వాండ్రకు రమ్యమైన నా
వల్లవి రామరామ యను పాటఁ దదీయ మనోగతంబు గాన్

తరగల్ భంగములైన దంభమున వేదాంతప్రచారంబు నే
పరికింపం జనఁబోదు, ద్రవ్యములు నిల్వంబోవుఁ బ్రాసాదముల్
స్థిరముల్ గావు ప్రకంపితంబులయి పృథ్విం జేరుఁ భూఖండముల్
శిరముల్ నిష్ఫలముల్ ప్రభుత్వవశముల్ సర్వంబనిత్యంబుగాన్

చీకటు లొక్కకప్పు విరజిమ్మ పయోనిధి వక్షమెల్లె[illegible]
ప్రాకుచు నాక్రమించఁగఁ గరంబుగ దీపగృహాలను[illegible]
లోకన రేఖ దీర్ఘముగ లోనికిఁ బోఁ గనుచో దరిద్రద[illegible]
సోకినయంత శ్రీయుఁడు వసుంధర నిచ్చిన చొప్పు దోచెడిన్

భూరినిశాలసీధి పరిపూర్ణపయోనిధివక్షమందు నోం
కారమువంటి నిస్వనము నశ్వరమై జనియించుచుండ, శా
రీరక దుఃఖమెల్ల దలక్రిందు లొనర్చెడు బ్రహ్మమంచు సం
సారగభీరతావమున జారకయుండఁ దలంతు నెమ్మదిన్.

# భారతి

పరగును మేఘమాలికలు సాగరవక్షమునందు వర్షముల్
గురియుచు భూమి నొక్కపుడు గోష్పదమంతయు వానలేమిచోఁ,
గరముగ నిచ్చుచుంద్రు గద గల్గినవారలు గల్గువారికిన్
బరులుగ నెంచుచుంద్రు తనవారల నంచుఁ దలంతు నెమ్మదిన్

అమితపదార్థభారభరమై జనవర్గముతోడ నాశ్రయా
భిముఖములై గరంబుఁ బొంగవీడుచు నబ్ధిని నౌకలుండగా,
శ్రమము దమంబునుం గలిగి సంస్కృతి లోతులఁ గొల్చుచున్ నిరా
శ్రమమున నూపిరాడక కలంగెడు బీదలఁ గంటఁ జూచెదన్.

---



# కందూరి చోడుల నాలుగు శిలాశాసనములు

శ్రీ బి. ఎన్. శాస్త్రి

కందూరి చోడుల శాసనములలో ముఖ్యమైనవి ఇదివరలో ప్రకటింపబడినవి. ప్రకటింపబడిన శాసనములలోని విషయము ననుసరించి, ఆంధ్రపత్రిక సౌమ్య ఉగాది సంచికలో రాచూరు శిలాశాసనముల ప్రకటించు సమయమున కందూరి చోడరాజుల చరిత్ర దిఙ్మాత్రముగా సూచింపబడినది.

ఇప్పుడు ప్రకటింపబడుచున్న కందూరి చోడుల శాసనములలో 1. మల్లేపల్లి 2. ఇదంపల్లి 3. పడమటిపల్లి శాసనములు శ. సం. 1157 లో వేయింపబడినవి. ఆగా మోతుకూరు శాసనము శ. సం. 1204 లో వేయించినట్టిది. ఇదంపల్లి శాసన శిల మూడు నాలుగు వైపుల చెఱకు బొలిరెడ్డి వేయించిన శాసన మీ శాసనములతోపాటు ప్రచు రింపబడుచున్నది. ఇదివరలో కందూరి చోడుల శాసనములు సిరికొండ, మల్లేపల్లి శాసనములతో కలిపి సౌమ్య సంవత్సరాది సంచికలో 21 పేర్కొన బడినవి. ఇప్పుడు ఇదంపల్లి, ఆగామోతుకూరు శాస నములు క్రొత్తగా కందూరిచోడుల శాసనములకు చేర్చబడుచున్నవి. కొండయ చోళ మహారాజు కొప్పోలు శాసనము ఇంకను ప్రకటితము కాలేదు. వీటితో కందూరి చోడుల శాసనముల సంఖ్య 24 అగు చున్నది.

కందూరి చోడవంశీయులు పశ్చిమ చాళుక్యుడైన ఆరవ విక్రమాదిత్యుని కాలమున కొలనుపాక ఏడు వేలు పాలించు అధికారమును పొంది ఉదయనచోడుని కాలమున కందూరు మండలమున స్థిరపడి కందూరి చోడులుగా ప్రసిద్ధి గాంచుటయేగాక, సువిశాలమైన కందూరిచోడరాజ్యమును మహామండలేశ్వరులుగా పాలించినారు. కాకతి రుద్రదేవుని కాలమునుండి కందూరిచోడరాజ్యము క్షీణింప మొదలిడి రెండవ ప్రతాపరుద్రుని పాలనము నాటికి పతనమైనది.

## 1. మల్లేపల్లి శిలాశాసనము

**శాసనము :**

ఈ శాసనము నల్లగొండమండలము లోని దేవరకొండతాలూకా మల్లేపల్లి చౌరస్తా ప్రక్కన గల కుంట క్రింది చేనిలో పాతబడియున్నది. శాసన శిలకు చేరువలో శిథిల దేవాలయ చిహ్నములు కనిపించుచున్నవి. పార్వతీదేవి విగ్రహము, నాగములు చెక్కబడినశిలాఫలకములు, భిన్నమైనసోపానపట్టము, నంది శిథిలప్రాంతమున కనిపించుచున్నవి. దేవా లయము శిథిలముకాగా, శాసనశిల చెక్కుచెదరక నిలిచియున్నది.

**అకారాదికములు :**

శాసనము నల్లసరపు రాతిపై చెక్కబడినది. అక్షరములు నాలుగు వైపుల చెక్కబడినవి. శాసనశిల పొడవు 5'—4" లు. వెడల్పు 1'.7" లు. శాసనము నాలుగవప్రక్క చెక్కిన అక్షరములు దగ్గరదగ్గరగాను, అక్షరములు చిన్నవిగను ఉన్నవి. శాసనాక్షరములు లోతుగా చెక్కబడినవి. అక్షరముల వరుసలు చూచుట కందముగ నున్నవి. శాసనము చెక్కిన

## కందూరి చోడుల వంశవృక్షము



శిల్పి జాగరూకత వహించినట్లు కనిపించదు. శాసనమున తప్పులు కనిపించుచున్నవి.

శాసనము మొదటిప్రక్క సూర్యచంద్రుల చిహ్నములు, పానవట్టముతోకూడిన శివలింగము, స్వస్తిక చిహ్నము, గోవు, లేగ, శంఖము చిత్రింపబడినవి. ఇవి యన్నియు శైవమత సంప్రదాయ చిహ్నములు. ఈ శాసనమున మొదటిప్రక్క 16 పంక్తులు, రెండవ ప్రక్క 15 పంక్తులు, మూడవ ప్రక్క 15 పంక్తులు, నాలుగవప్రక్క 21 పంక్తులు, మొత్తము 67 పంక్తులున్నవి. ఈ శాసనము Govt. of A. P. Archaeologial Series No. 22 లో 307 వ శాసనముగా నమోదు చేయుబడినది.

**లిపి :**

ఈ శాసనమును కందూరి భీమదేవచోడ మహారాజు శక సంవత్సరము 1157 లో వేయించెను. శాసనము తెలుగుభాషలో వేయింపబడినది. శాసనాక్షరములు క్రీ. శ. పదమూడవ శతాబ్ది పూర్వార్థమున తెలుగు దేశమున వెలసిన శాసనాక్షరములను పోలియున్నవి. శాసనలిపి కాకతీయ శాసన లిపికిని, కందూరి చోడుల ఇతర శాసన లిపికిని సన్నిహితముగా నున్నది. శాసనాక్షరములు ముఖ్యముగా ఉదయనచోడుని పేర్కొను జడ్చర్ల[1] రాచూరు[2] సిరికొండ[3] శాసనాక్షరములవలెను, పానుగల్లు[4], మామిళ్లపల్లి[5] గట్టుతుమ్మెన[6] శాసనములలోని అక్షరములను పోలియున్నవి. శిల్పి అజ్ఞత వలన శాసనము చెక్కునపుడు కొన్ని తప్పులు దొరలినవి.

**భాష :**

ఈ శాసనము తెలుగు భాషలో వేయింపబడినది: శాసనారంభమున ఒక శ్లోకమును, శాసనము రెండవప్రక్క పండ్రెండవపంక్తినుండి మూడవ ప్రక్క పదమూడవ పంక్తివరకు మూడు సంస్కృత శ్లోకములున్నవి. తరువాత స్థానాపతి బిరుదములు, వర్ణన వచనములో నున్నవి. శాసనమున తప్పులు కనిపించుచున్నవి. సాధారణముగ శాసనములందు 'నమస్తుంగ శిరశ్చుంబి చంద్రచామర చారవే'' అని యుండును. కాని ఈ శాసనమున 'నమస్తుంగ శిర చంద్ర చంద్రచామర తారవే' అని చెక్కబడినది.

| | | |
|---|---|---|
| నగరారంభ | బదులు | నకరారంభా |
| మూల | — | ముల |
| జయాభ్యుదయాశ్చశ్శక | బదులు | జయాభ్యుదశ్చశ్శక |
| సమధిగత | — | శమధిగత |
| కరికాలాన్వయ | — | కరికాలాంన్వయ |
| ప్రశస్తి | — | ప్రసస్తి |
| సహిత | — | శహిత |
| శ్రీమన్మహా | — | శ్రీమన్మాహా |
| పుణ్యార్థంబుగా | — | పుణ్యాత్థంబుగా |
| శ్రేష్ఠ | — | శ్రేష్ట |
| ఆచంద్రార్క | — | ఆచంద్రాక |
| పరదత్తాను | — | పరదత్తాంను |
| స్వదత్త | — | శ్వదత్త |
| నిష్ఫలం | — | నిఝ్ఫలం |

ఇందు నాలుగవప్రక్క స్థానాపతి గుణశీలాదులు వర్ణించునపుడు, ' 'స్వస్తియమనియమ ... శీలగుణ సంపంన్నరుం—విబుధజనచింతామణిగళుం బుధజన సేవ్యరుం, అంనదానవినోదిగళుం...'' అది కన్నడ భాషా సంప్రదాయవర్ణన మున్నది.

---

1. Hyderabad Archaeological Series; No. 19. Mn. 12 & 13.

2. 'సౌమ్య' ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక. March 1969.

3. 'భారతి' ఫిబ్రవరి 1970.

4. Hyderabad Archaeological Series; No. 13-2: P. 96 & 105-109.

5. Hyderabad Archaeological Series; No. 19. Mn. 27.

6. Hyderabad Archaeological Series; No. 19. Mn. 11.

### శాసన విషయము :

శాసనారంభమున శివుని స్తుతించు శ్లోక మున్నది. ఈ శాసనమును కందూరి భీమదేవచోడ మహారాజు శ. సం. 1157 జయ సంవత్సర కార్తిక బహుళ దశమి గురువారమునాడు వేయించెను. కందూరి చోడరాజుల ప్రశస్తి ఈ భీమదేవచోడ మహారాజునకు చేర్చబడినది. భీమదేవచోడమహారాజు తనకు పుణ్యము సంప్రాప్తించుటకు శ్రీపర్వతోత్తర ద్వారశేష శ్రీ మహేశ్వరదేవరకు "ఆకం మల్లేపల్లి" గ్రామమ్మును అంగరంగభోగధూపదీపనైవేద్యాల కా చంద్రార్కస్థాయిగా దానమిచ్చెను. తరువాత వ్యాస గీతా శ్లోకము లున్నవి.శ్లోకముల తరువాత 'యమని యమ స్వాధ్యాయస్నాన జప తప శీలగుణ సంపన్నుడును, విబుధజనచింతామణియు, బుధజనసేవ్యుండును, అన్నదానవినోదుండును,కూసుమాత్ర వివర్జితుండును, పంచాదీక్ష ప్రతిష్ఠకరుండును, అనాథనాథుండును, శరణాగతవజ్రపంజరుండును, మణిరత్న ఖచిత యుత్తుంగ శ్రీశైలశిఖర సింహాసనారూఢ శ్రీ మాహేశ్వర దేవర స్థానాపతి ఓంకార రాసిదేవుని' వర్ణన కలదు.

### కాల నిర్ణయము :

ఈ శాసనము కందూరి భీమదేవ చోడ మహారాజుచేత శ్రీశైలోత్తరద్వారశేష మాహేశ్వర దేవరకు ఆకంమల్లేపల్లి గ్రామము దానమిచ్చు సందర్భమున వేయింపబడినది. శాసనము శ. సం. 1157 జయసంవత్సర కార్తిక బహుళ దశమి గురువారమునా డీయబడినది. శక. సం. 1157 క్రీ. శ. 1235కు సమానము. క్రీ. శ. 1235 నాటికి కాకతి గణపతి దేవ మహారాజు తెలుగుదేశమంతటిని ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించుచుండెను. అతని సామంతులలో గోనవంశీయులగు రెడ్లు కందూరు, వర్ధమాన పుర ప్రాంతముల నేలుచుండిరి. కందూరి చోడులు నల్లగొండమండలములోని పానుగల్లు పట్టణమును రాజధానిగా నల్లగొండ, దేవరకొండ, సూర్యాపేట ప్రాంతములను కాకతీయుల సామంతులుగా పాలించు చున్నట్లు శాసనములవలన తెలియుచున్నది. కందూరి నాడు—ఈ రాజుల ఏలుబడిలో లేకున్నను ప్రశస్తి మాత్రము కందూరిచోడు లనియే యున్నది.

## శాసనము - మూలము

### మొదటిప్రక్క

1. ఓం నమస్తుంగ శిర చం
2. ద్ర చంద్ర చామర తార
3. వే త్రైలోక్యనకరారంభా[7]
4. మూలె స్తంభాయ శంభ
5. వే॥ స్వస్తిశ్రీ జయాభ్యుద
6. శ్చ శ్యకవర్షంబులు॥[8] 1157
7. జయ సంవత్సర కార్తిక బ
8. హుళ దశమియు గురువా
9. రమునాండు॥ స్వస్తిశమధి[9]
10. గత పంచమహాశబ్ద మ
11. హా మండలేశ్వర వీరమ
12. హేశ్వర కోడూప్పుకార వరా
13. ధీశ్వర సూర్య్యా వంశోద్భవ
14. కులతిలక కాస్యపగో
15. త్ర కరికాలాంన్వయ నామా
16. ది సమస్త ప్రసస్తిశహిత[10]

### రెండవ ప్రక్క

1. శ్రీమన్మాహా[11]మండ
2. లేశ్వర కందూరి భీమ
3. దేవచోడ మహారా

---

7. నగరారంభా.
8. జయాభ్యుదయాశ్చశ్శకవర్షంబులు
9. సమధిగత.
10. సహిత.
11. శ్రీమన్మహా.

4. జాలు తమకుం పుణ్యా
5. త్థ౯ంబుగా[12] స్వస్తి శ్రీ ప
6. వ్వ౯తోత్తర ద్వారశ్రేష్ఠ శ్రీ
7. మాహేశ్వర దేవరకు
8. ఆకం మల్లేపల్లి అంగరా
9. గ భోగ ధూప దీప వివే
10. ద్యాలకు ఇచ్చిన దత్తి
11. ఆచంద్రాకస్థాయి
12. గా॥[13] స్వదత్తం పర
13. దత్తం వా యోహరే
14. తి వసుంధరా శష్టి
15. వష౯శహస్రాణి.[14]

మూఁడవప్రక్క

1. విష్టాయం జాయతే క్రి
2. మి॥ స్వదత్తం ద్విగుణం
3. పుణ్యం పరదత్తా
4. ను[15] పాలనం పర
5. దత్తం హరతే పా
6. పం శ్వదత్త నిష్ఫల
7. ంభవేత్॥[16] ఆదిత్య
8. చంద్రావనిలోనలశ్చ
9. ద్ బుమిరాపోహృద
10 యం యయాశ్చహశ్చ
11. రాత్రశ్చ యుభయ
12. తి సంధ్య ధమ్మా౯శ్చ
13. జానాతి నరశ్చ విత్తం
14. స్వస్తి యమనియ్యు
15. మ మన స్వాధ్య స

నాలుగవ ప్రక్క

1. ధ్యానధారణయానా
2. యనుష్ఠాన జప శ
3. మాది శీల గుణ వ
4. ంపంన్నరుం విబుధ జ
5. వ చింతామణి గ
6. ణుం బుధజన సేవ్య
7. రుం అంనదాన వి
8. నోదిగళుం కుసుమా
9. స్త్ర వివజి౯తరుం అకు
10. ళి సిద్ధాంతకుటింబిని నా
11. దరుం. నయనాయాక
12. నటి నాట్యరంగ విభూ
13. షణరుం పంచాదీక్ష
14. ప్రతిష్టకరుం అనాత
15. నాత[17]రుం షరణాగత
16. వజ్రరుం[18] మణిరత్న క
17. చిత[19] యుత్తుంగ శ్రీశైల సిక
18. ర[20] సింహాశనారుఢ[21] శ్రీ మా
19. హేశ్వర దేవరు స్తానాపతి[22]
20. ఓంకార రాసిదేవరు యోక
21. ...............శ్రీ

## 2. పడమటిపల్లి శిలాశాసనము

ఈ శాసనము దేవరకొండ తాలూకాలోని పడమటిపల్లి గ్రామమువెలుపల నున్న శిథిల దేవాలయ ప్రాంతమున పడియుండ గ్రామీణు లచ్చటినుండి కొలది దూరములోనున్న బావి దగ్గరికి చేర్చినారు. ఈ శాసనము తెల్లరాతిపై రెండువైపుల వ్రాయ

---

13. పుణ్యాత్థ౯ంబుగా.
13. ఆచంద్రాక౯ స్థాయిగా.
14. షష్టింవష౯సహస్రాణి.
15. దత్తాను.
16. స్వదత్త నిష్ఫలం భవేత్
17. అనాథనాథ.
18. శరణాగత వజ్ర పంజరుం.
19. మణిరత్నఖచిత
20. శ్రీశైల శిఖర
21. సింహాసనారూఢ
22. స్థానాపతి.

బడినది. పడమటిపల్లి దేవరకొండనుండి ఎనిమిది మైళ్ల దూరముననున్న గ్రామము.

శాసనము తెల్లరాతిపై చెక్కబడినది. శాసనారంభమున సూర్యచంద్రుల ప్రతిబింబములు, పానవట్టముతో గూడిన శివలింగము చెక్కబడినవి. శాసనమున మొదటిప్రక్క 18 పంక్తులు, రెండవప్రక్క 7 పంక్తులు, మొత్తము 25 పంక్తులున్నవి.

శాసనాక్షరములు పదమూడవ శతాబ్ది పూర్వార్ధమున వెలసిన తెలుగు శాసనములలోని అక్షరములను పోలియున్నవి. శాసనాక్షరములు కొన్ని పెద్దవిగను మరికొన్ని చిన్నవిగను చెక్కబడినవి. శాసనారంభమున శ్లోకములేదు. ఇది తెలుగు శాసనము. శాసనాంతమున వ్యాసగీతాశ్లోకమున్నది. ఇందు ద్విత్వాక్షరములు సంయుక్తాక్షరములు 'ఋ' పొల్లునకు పూర్వాక్షరము ద్విత్వముగను వ్రాయబడినవి.

కందూరి భీమదేవ చోడమహారాజు శ్రీపర్వతం శ్రీ మల్లినాథ దేవరకు పడ్మటిపల్లిలో ఆకుతోంటను దానమిచ్చు సందర్భమున ఈ శాసనము వేయించెను. కందూరి చోడవంశ ప్రశస్తికల శాసనమిది. శాసనము శ. సం. 1157 లో అనగా, క్రీ. శ. 1235 లో వేయించినట్టిది.

## పడమటిపల్లి శాసనము

### శాసనము—మూలము

#### మొదటిప్రక్క

1. స్వస్తిశ్రీ జయశ్చా
2. భ్యుదయాశ్చ శక
3. వర్షంబులు 1157 అ
4. గు మన్మథ సంవత్సర చై
5. త్ర శుద్ధ 1 గు॥ స్వస్తి సమ
6. ధి గత పంచమహా
7. శబ్ద మహామండలేశ్వ
8. ర వీరమాహేశ్వర కోడూ
9. పురవరాధీశ్వర సూ
10. ర్యవంశోద్భవకులతిలక
11. కాశ్యపగోత్ర కరికాలాన్వ
12. య నామాది సమస్త ప్రశస్తి
13. సహితం శ్రీమన్మహామండ
14. లేశ్వర కందూరి భీమదేవ
15. చోడమహారాజులు శ్రీ
16. పర్వతం శ్రీమల్లినాథ
17. దేవరకు శ్రీ పడ్మటి
18. పల్లిరమోన ఆకు తోంటను

#### రెండవప్రక్క

1. ఆచంద్రార్కస్థాయిగా
2. ఇచ్చిన దత్తి నడుపున
3. ది॥ స్వదత్తాం పరదత్తాం
4. వా యో హరేతి వసుం
5. ధరా షష్టి వర్షసహస
6. హ్రాణి విష్టాయాం
7. జాయతే క్రిమి॥

## 3. ఇదంపల్లి శిలాశాసనములు

శాసనము :

నల్లగొండ మండలములోని దేవరకొండ తాలూకా కేంద్రమునకు పదిమైళ్లదూరమున ఇదంపల్లి గ్రామమున్నది. గ్రామమునకు నాలుగు ఫర్లాంగుల దూరమున వాగు దగ్గరి చేనిలో రెండు శాసనములు చెక్కబడిన శిల యున్నది. ఇందు కందూరి ఉదయాదిత్యచోడ మహారాజు వేయించినశాసనము ఒకటి, రెండువైపులను; మూడు నాలుగు వైపుల చెఱకు బొల్లయరెడ్డి వేయించిన శాసనమును చెక్కబడినవి.

ఆకారాదికములు :

ఈ శాసనశిల ఇదంపల్లి గ్రామమునకు నాలుగు ఫర్లాంగుల దూరముననున్న వాగుఒడ్డున చేనిలో పడి యున్నది. ఇది నల్లనరవు రాతిపై చెక్కబడినది. ఈ శాసనశిల మొదటిప్రక్క పానవట్టముతో గూడిన శివలింగము, రెండవప్రక్క వంది చెక్కబడినవి. శాసన

శిల నాలుగవ ప్రక్క సూర్యచంద్రుల ప్రతిబింబములు కలవు. శాసనశిల పొడవు 4'—4"లు; వెడల్పు 1'.2."5 లు; శాసనశిఖరము పొడవు 6" లు.

| | | | |
|---|---|---|---|
| శాసనశిల | మొదటిప్రక్క | 19 | పంక్తులు |
| ,, | రెండవ ప్రక్క | 21 | ,, |
| ,, | మూడవప్రక్క | 20 | ,, |
| ,, | నాలుగవప్రక్క | 20 | ,, |

మొత్తము 80 పంక్తులుకల రెండు శాసనములివి. ఇందొక్కొక్క శాసనము నలుబది పంక్తులతో కూడియున్నది.

**లిపి :**

ఈ శాసనములం దాంధ్రదేశమున పదుమూడవ పదునాలుగవ శతాబ్దములందు వాడుకలోనున్న తెలుగు లిపి వాడబడినది. లిపి చక్కగాను, అందముగాను కనిపించుచున్నది. ఈ శాసనముల మొదట శివుని స్తుతించు శ్లోకము లున్నవి. కందూరి ఉదయాదిత్య దేవ చోడమహారాజు వేయించిన శాసనము శ. సం. 1157 నాటిది. రెండవ శాసనము చెఱకు బొలిరెడ్డి వేయించినది. ఈ శాసనమున సంవత్సరము తిథి వార నక్షత్రాదులు పేర్కొనబడలేదు. కాని చెఱకు వంశీయులకు సంబంధించిన శాసనములు ఈ ప్రాంతమున కనిపించుచున్నవి. ఈ శాసనమున పేర్కొనబడిన బొలిరెడ్డి వంశీయుల శాసనములు అమరాబాదు కల్వకుర్తి ప్రాంతమున నున్నవి. ఈ శాసనశిలపై చెక్కబడిన రెండు శాసనముల లిపులలో వ్యత్యాసము కనిపించుచున్నది. బొలిరెడ్డి శాసనము ఉదయాదిత్య దేవచోడ మహారాజు వేయించిన శాసనము తరువాతది.

**భాష :**

ఈ రెండు శాసనములందు తెలుగుభాష వాడబడినవి. ఇందు ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, పొల్లు 'ణ', పూర్ణానుస్వారము వాడబడినవి. మొదటి శాసనము చివర రెండు శ్లోకములను, రెండవ శాసనాంతమున ఒక శ్లోకమును ఉన్నవి. ఈ శాసనములందు

'గోడూప్పుకార గోడూర్పుర

| | | |
|---|---|---|
| సూయ్యకా | — | సూర్య |
| సవ్వ్వనమస్యంబుగా | — | సర్వనమస్యంబుగా |
| గంగకఱుతం | — | గంగకఱుత |

ఇత్యాదులున్నవి.

**శాసనముల విషయము :**

శ. సం. 1157 లో కందూరి ఉదయాదిత్యదేవ చోడ మహారాజు వేయించిన శాసనమున ఉదయాదిత్యదేవ చోడ మహారాజుకు కందూరి చోడుల ప్రశస్తి చేర్చబడినది. శ. సం. 1157 మన్మథ సంవత్సరా భాద్రపద బహుళ ఏకాదశి ఆదివారమునాడు, ఉదయాదిత్యదేవ చోడ మహారాజు తమతండ్రి సోమనాథ దేవరకు పుణ్యముగా నల్లదామపల్లిని మహేశ్వరదేవరకు అంగరంగభోగములకు ధూపదీప నైవేద్య తాంబూలాదులకు సర్వనమస్యంబుగా ధారవోసి ఇచ్చెను. ఈ ధర్మమునకు విఘ్నము కల్గించినవారు గంగ దగ్గఱ పశువులను బ్రాహ్మణులను చంపిన పాపమును పొందుదురు—అనియు శాసనమున చెప్పబడినది. శాసనాంతమున 'స్వదత్తం' ఆది రెండు శ్లోకము లున్నవి.

చెఱకు బొలిరెడ్డి వేయించిన శాసనమున మొదట శివుని స్తుతించు శ్లోకమును, తరువాత శాసనము వేయించిన బొలిరెడ్డి బిరుదములు వున్నవి. బొలిరెడ్డి ఈ శాసనమున 'సమస్త గుణగణాభరణ, పతిహితచరణ, రణరంగభైరవ, వైరిభకంఠీరవ, శరణాగతవజ్రపంజర, వీరావతార, చాములూరి పురవరాధీశ్వర.........సుజనైకమిత్ర, పరాంగనాపుత్ర'—అని వర్ణింపబడినాడు. చెఱకు బొలిరెడ్డి మహేశ్వర దేవరకు అంగరంగభోగములకు, నైవేద్యంబునకు ఇచ్చిన దత్తిని తెలుపు శాసనమిది.

**కాల నిర్ణయము :**

ఈ శాసనములలో చెఱకు బొలిరెడ్డి వేయించిన శాసనమున శకసంవత్సరముగాని, ప్రభవాది సంవత్సరముల పేర్లుగాని మాస తిథి వారములుగాని

లేవు. చెఱకు వంశీయుల శాసనములనుబట్టి ఈ శాసనము శ. సం. 1175 ప్రాంతమున వేయింపబడినట్లు భావింపవచ్చును. ఇక కందూరి ఉదయాదిత్యదేవ చోడ మహారాజు వేయించిన శాసనము శ. సం. 1157 నాటిది. అనగా క్రీ. శ. 1235 లో వేయించినట్టిది. మల్లేపల్లి శిలాశాసనముకూడా క్రీ. శ. 1235 నాటిదే. ఒకే కాలమున కందూరి చోడులలోని ఇద్దరు రాజులు ఒకే సంవత్సరమున వేర్వేరు శాసనములు వేర్వేరు ప్రాంతములందు వేయించినట్లు తెలియుచున్నది. మల్లేపల్లి శాసనము వేయించిన భీమదేవ చోడమహారాజు ఇదంపల్లి శాసనము వేయించిన ఉదయాదిత్యదేవ చోడ మహారాజు—భీమగోకర్ణులవలె అన్నదమ్ములై ఇద్దరు కలిసి పరిపాలనావ్యవహారములు చూచుచుండిరని భావింపవచ్చును. భీమదేవచోడమహారాజు శాసనమున తండ్రిపేరు పేర్కొనబడలేదు. కాని ఇదంపల్లి శాసనమున ఉదయాదిత్యదేవచోడమహారాజు తండ్రిపేరు సోమనాథదేవచోడమహారాజు. ఇదంపల్లి శాసనము ననుసరించి కందూరి చోడవంశీయులలో ఇద్దరు ఉదయాదిత్యచోడు లున్నట్లు తెలిసినది. ఇదంపల్లికి దగ్గరలోనున్న పడమటిపల్లి గ్రామము వెలుపల దేవాలయము దగ్గరలో బావివద్దఉన్న కందూరి చోడులకు సంబంధించిన శాసనము శ. సం. 1157లో వేయింప బడినట్టిదే. భీమగోకర్ణులు మొదటి ఉదయన చోడమహారాజుపుత్రులు కలిసి రాజ్యము చేసినట్లు మామిళ్లపల్లి శాసనమువలన[23] తెలియుచున్నది. అట్లే భీమ, ఉదయాదిత్యదేవచోడులు కలిసి కందూరి చోడరాజ్యమును పాలించియుందురు. ఇట్లు అన్నదమ్ములు కలిసి ఏకకాలమున రాజ్యము పాలించుట కందూరిచోడులలోనే కనిపించును.

## ఇదంపల్లి శిలాశాసనములు

### కందూరి ఉదయాదిత్యదేవచోడుని శాసనము మూలము

మొదటిప్రక్క

1. ఓం నమస్తుంగశిర
2. శ్చుంబి చంద్రచామ
3. ర చారవే త్రైలోక్యనగ
4. రారంభ మూలస్తం
5. భాయ శంభవే స్వస్తి స
6. మధిగత పంచమహా
7. శబ్ద మహామండలే
8. శ్వర వీరమాహేశ్వర
9. గోడూప్పురవరా
10. ధీశ్వర సూర్య్యాన్వం
11. శోద్భవకులతిలక
12. కాశ్యపగోత్ర కరి
13. కాల్వాన్వయ నామాది
14. సమస్త ప్రశస్తిసహితం శ్రీమ
15. న్మహామండలేశ్వర కం
16. దూరి ఉదయాది
17. త్య దేవచోడ మహా
18. రాజులు 1157 గు. మ
19. న్మథ సంవత్సర భాద్రప

రెండవప్రక్క

1. ద బహుల 11 ఆదివారం
2. నం దమతండ్రి సోమనాథ
3. దేవరకుం బుణ్యంముగా
4. నల్లదామపల్లిప్రోలు శ్రీ మా
5. హేశ్వర దేవరకు నంగ
6. భోగ రంగభోగ ధూపదీప
7. నైవేద్య తాంబూలాదుల
8. కు సర్వాన్నమస్యంబుగా
9. ధారవోసి ఇచ్చిరి దీ
10. ని ఎవ్వరేనిం దప్పం చింతి
11. చినవారు గంగ్గ కఱితం బ
12. సులం బ్రాహ్మలా జంపిన పాపా
13. నం బోయిన వారు॥ స్వదత్తాంప
14. రదత్తాం వా యోహరేతి వసు
15. ంధరా షష్టిర్వ్వర్షసహస్రాణి
16. విష్టాయాం జాయతే క్రిమి.

23. Hyderabad Archaeological Serie No. 19. Mn. 27:

17. స్వదత్తాం పరదత్తాం వా
18. హరథూమం నరా
19. ధిప ప్రపద్యం తు య
20. శాలం నరకేదుకమే
21. ణ సం॥ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## చెఱకు బొలిరెడ్డి శాసనము

### మూడవప్రక్క

1. ఓం నమస్తుంగ శిర
2. శ్చుంబి చంద్ర చామ
3. ర చారవే త్రైలోక్య
4. నగరారంభ మూల
5. స్తంభాయ శంభవే
6. స్వస్తి సమస్త గుణ
7. గణాచరణ పతి
8. హితచరణ ర
9. ణరంగభైరవ
10. వైరిభకంఠీరవ
11. శరణాగతవజ్రపంజర
12. వీరావతారపి చాము
13. లూరి పురవరాధీ
14. స్వర[24] పరమ మహేశ్వ
15. ర సకల హరుద
16. ప్ర—డ్లరేక రేవది
17. త విజయలక్ష్మీ త
18. కమ నిమల్ల భ
19. య లోభ మల్లభ
20. సుజనైక మిత్ర

### నాలుగవప్రక్క

1. పరాంగనాపు
2. త్ర పరమ గాంగే
3. య నామాది సమ
4. స్త ప్రశస్తి సహితం
5. శ్రీమతు సామం
6. త చెఱకు బొలిరె
7. డ్డి శ్రీ మహేశ్వర దేవ
8. రకు అంగరంగభోగము
9. కు నివేద్యతంబు
10. సర్వబాధాపరిహారముగా ధారవో
11. సి యిచ్చిన దత్తి దీ నె
12. వారేనిం జెఱ్చినవారు
13. గంగ కఱ్ఱ కవిల జ
14. ంపినందు పసుల బ్రా
15. హ్మల్లం జంపినందు త
16. న యిరుసురులవారు
17. సినవందు॥ స్వదత్తాం
18. పరదత్తాం వా యోహరేతి
19. వసుంధర షష్టి వ. షణ సహస్రాణి
20. విష్ఠాయాంజాయతే క్రిమి॥

## 4. ఆగామోతుకూరు శిలాశాసనం

### శాసనము :

ఈ శిలాశాసనము నల్లగొండమండలములోని మిర్యాలగూడతాలూకా ఆగామోతుకూరు గ్రామమున శివాలయమున నున్నది. కందూరిచోడవంశమునకు చెందిన రామనాథదేవచోడమహారాజు వేయించిన శాసన మిది. నునుపుగా చెక్కబడిన శిలాస్తంభము నాలుగు వైపుల ఈ శాసనము చెక్కబడినది. ఆగామోతు కూరు గ్రామము మిర్యాలగూడ—నల్లగొండ రోడ్డులో మాడ్గులపల్లి గ్రామమునుండి ఆరుమైళ్ల దూర మున నున్నది. గ్రామమువరకు జిల్లా పరిషత్తు రోడ్డు కలదు.

### ఆకారాదికములు :

ఈ శాసనము తెల్లరాతిపై నాలుగువైపుల చెక్కబడినది. శాసనశిల భూమిలో పాతబడినది. శాసన మున్న ఆలయమున శివలింగము, ఆంజనేయస్వామి విగ్రహము, అమ్మవారి విగ్రహము లున్నవి. శాసనము మొదటిప్రక్క గణపతివిగ్రహము, రెండవప్రక్క

---

24. పురవరాధీశ్వర

పానవట్టముతోగూడినశివలింగము, మూడవ(ప్రక్క ఆవు—లేగ, నాలుగవ(ప్రక్క సూర్యచం(ద్రుల (ప్రతి బింబములు చెక్కబడినవి. శాసనము మొదటి(ప్రక్క 25 పంక్తులు, రెండవ(ప్రక్క 30 పంక్తులు, మూాడవ(ప్రక్క 33 పంక్తులు నాలుగవ(ప్రక్క 16 పంక్తులు, మొత్తము 104 పంక్తులలో శాసన మున్నది. శాసనారంభమున శ్లోకములేదు. శాస నాంతమున దానఫలమును, దానమునకు వ్యతిరేకముగ నడిచినవారికి కలుగు పాపఫలము చెప్పు శ్లోకము లున్నవి.

**లి పి :**

తెలుగుదేశమున పదమూడవ శతాబ్ది ఉత్త రార్థమున వాడుకలోనున్న తెలుగు లిపి ఈ శాసన మున వాడబడినది. శాసనము కాకతీయుల శాసనముల పద్ధతిని చేయింపబడినది. ఈ శాసనలిపి పిల్లలమఱ్ఱి[25] బూరుగుగడ్డ[26] ఇర్విన్[27] బొల్లేపల్లి[28] శాసనముల లిపిని పోలియున్నది. శాసవమున ద్విత్వాక్షరములు, పూర్ణానుస్వారము, 'ఱ' వాడబడినవి. శాసనాక్షరములు కొన్నివరుసలతో పెద్దవిగను, మరికొన్ని వరుసలలో చిన్నవిగను చెక్కబడినవి. శాసనారంభమున పెద్ద అక్షరములతోను, శాసనాంతమున చిన్నఅక్షరముల తోను వరుసలు కనిపించును. ఒకటి, రెండు, మూాడు (ప్రక్కల చివరి పంక్తులలోని అక్షరములు చిన్నవిగా చెక్కబడినవి.

**భా ష :**

శాసనము తెలుగు భాషలో వేయింపబడినది. శాసనముచివర శాసనముపాటించినవారికి కల్గు పుణ్యము పాటింపనివారికికలుగు పాపము మూాడు శ్లోకములలో చెప్పబడినవి. శాసనమున మొదటి (ప్రక్క ఐదవపంక్తితో "సమధిగత" బదులు "సమధి గజ" అని చెక్కబడినది.

పంచమహాశబ్ద బదులు పంచ్చమహాశబుద
కాకతీయ — కాకెతియ్య
సేయుచుండగాను— సేయుచుండ్దంగాను
సిధ్యర్థము — సిద్యత్తఱము-
చిన్నాలు — చింన్నాలు.
సర్వమాన్యము — సవ్వఱమాన్యము.

ఇందు కొన్ని తెలుగుభాషలో నేడు వాడుకలో లేని పదము లున్నవి. ముయ్యడ పెరుగు, సిన్నాలు ముయ్యడనేమి—ఇత్యాదులు ముఖ్యమైనవి. తెలుగు భాషకు సంబంధించిన విశేషము తెక్కువ లేకున్నను ఈ శాసనమువలన ఆ నాటి ఆం(ధ్రుల సాంఘిక విషయములను కొంతవరకు తెలిసికొనుట కవకాశ మున్నది. దేవాలయములకు రాజులుకాని, భక్తులుగాని దానమిచ్చు నపుడు కట్టడిగా అనేక వస్తువులను, దేవర అంగరంగ ధూప దీప నైవేద్యాదులకు చెందు నట్లు శాసనబద్ధము గావించి—చక్కని ఏర్పాట్లు చేయుచుండిరి. ఈ శాసనమునగల ఏర్పాట్లు అట్టివే యని తెలిసికొనవచ్చును.

**శాసన విషయము :**

ఈ శాసనమును కందూరి రామనాథ దేవ చోడ మహారాజా శకవర్షము 1204 చి(త్రభాను వైశాఖ శుద్ధ సప్తమీ గురువారమునాడు తవతం(డ్రి పేర వీరమల్నాథ దేవరను (ప్రతిష్ఠచేసి తనకు ధర్మా ర్థముగా దేవర అంగరంగ భోగాది సమస్త (ప్రయోజనములు కలుగునట్లు అనేక (ప్రత్తులను పెట్టు సందర్భమున వేయించెను. శాసనారంభమున కాకతి రు(ద్రమదేవి (ప్రశంస కలదు. కందూరి రామ నాథ దేవచోడ మహారాజునకు కందూరి చోడవంశీయుల (ప్రశస్తి చేర్చబడినది. కందూరి చోడవంశీయులకు సంబంధించిన శాసనములలో మొదటి శాసనము తొండరస చోళమహారాజా వేయించిన కొలనుపాక

25. తెలంగాణా శాసనములు. Vol. I. కాక తీయ శాసనములు.

26. తెలంగాణా శాసనములు Vol. I. కాకతీయ శాసనములు.

27. 'భారతి' జూన్ 1969.

28. 'భారతి' మార్చి 1969.

శాసనము[29]. ఈ వంశీయులకు సంబంధించిన శాసన ములలో చివరి శాసన మిప్పటికి ఈ ఆగామోతుకూరు శాసనమే యని భావింపవచ్చును.

## కాల నిర్ణయము :

ఈ శాసనమును కందూరి రామనాథదేవచోడ మహారాజు శ. సం. 1204 చిత్రభాను సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమీ గురువారము నాడు వేయించెను. శ. సం. 1204 క్రీ. శ. 1282 వ సంవత్సర మునకు సమానము. మల్లేపల్లి, ఇదంపల్లి, పడ్మటి పల్లి శాసనములు శ. సం. 1157 లో వేయింప బడినవి. తరువాత ఈ శాసనమే కందూరి చోడులకు సంబంధించినది లభించినది. పరిశోధనలవలన మరికొన్ని శాసనములు లభించిన కందూరి చోడుల సమగ్ర చరిత్ర తెలిసికొనుట కవకాశమేర్పడును. ఈ శాసన కాలము నాటికి ఆంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యముగా కాకతి రుద్రమ పాలించుచుండెనని భావింపవచ్చును. కాకతిరుద్రమ రుద్రమహాదేవులుగా ఈ శాసనమున పేర్కొనబడినది. ఈ శాసనకాలమునాటికి కందూరి చోడులు పానుగల్లుమండలప్రాంతమును మాత్రమే కాకతీయుల సామంతులుగా పాలించుచుండిరని భావింప వీలగుచున్నది. ఈ శాసనమున పేర్కొనబడిన కొన్ని పదములు ఆ నాటి ప్రజాజీవనమును తెలుపును.

**మఋతురు** -

నివర్తనము=ఇరువదిదండముల ప్రమాణము గల భూమి=లేక రెండువందల హస్తముల పరిమితిగల భూమి.

**నిత్యపడ్లు** -

ప్రతిరోజు దేవాలయమునకు సమర్పించు కట్టడి వస్తువులు—నైవేద్యాదులు.

**ముయ్యేడ** -

మూడు అర్దలు—లేక ఒకటిన్నర.

**మేలోగిరాలు** -

మేలైన ఆహార పదార్థములు —లేక భోజనము(నైవేద్యముగ నిర్ణయించినవి.)

**మాడ** -

అర్థదీనారము లేక పదిరూపాయలు

**వ్రిత్తులు** -

వృత్తులు - దేవుని సేవకు ఇచ్చు భూములు.

**అంగరంగ భోగములు** -

మూలస్థాన దేవరకు, ఉత్సవవిగ్రహములకు స్నానవసనాభరణగంధపుష్ప ధూపదీపనైవేద్యాది వైభవములు— మరియు గీతవాద్యనృత్యాది వైభవములు.

## ఆగామోతుకూరు శిలాశాసనము

### శాసనము — మూలము

### మొదటిప్రక్క

1. స్వస్తి శ్రీ మన్మహామండ్డలే
2. శ్వర కాకెతియ్య రుద్ర మహా
3. దేవులు సుఖసంకథావినో
4. దంబులం బ్రిథివిరాజ్యంబు సే
5. యు చుండ్డంగాను స్వస్తిసమధిగజ[30]
6. పంచ్చ మహాశబుద మహా మం
7. డ్డలేశ్వర వీరమాహేశ్వర కోడూరి
8. పురవరాధీశ్వర సూర్య్యవంశోద్భవ
9. కులతిలక కాస్యపగోత్ర కరికాలా
10. న్వయ నామాది ప్రశస్తి సహితం
11. శ్రీమన్మహా మండ్డలేశ్వర కందూరి రా
12. మనాథదేవచోడ్డమహారాజులు

---

29. A. P. Govt. Arch. Series No 3—Ng. 48.

30. సమధిగత

13. శక వరుషములు 1204 అగు చిత్ర
14. భాను సంవత్సర వైశాఖ శుద్ధ 7 గు।
15. నాండు తమతండ్రిపేరటను వీరమల్లా
16. థ దేవరం బ్రతిష్ఠసేసి తమకు ధర్మా
17. ర్థముగాను అంగరంగ భో
18. గాది సమస్త ప్రయోజన సి
19. ద్ధ్యర్థముకై ఆచంద్రార్క్క తా
20. రకముగాను సర్వ్వమాన్యముగా
21. నుం. బెట్టిన వ్రిత్తులు నీరునేల పొల
22. ము బ్రోంతుకూరను ముంక నాయి
23. ని చెఱ్వు వెనకను ఊటపొలముచ
24. ను కుంట్ట చేనురె॥ ఆ కత్తువను క్రిం
25. ది కాల్వను రె॥ మీంది కాల్వను రెౘ

## రెండవప్రక్క

1. కొఱనిలును లోక సముద్రానను
2. తిప్పకాల్వను రె॥ వెలివొలము
3. చంద్రు తిప్పను రెౘ॥ బొంమకం
4. ట్టను కొమరి నాయని చెఱ్వు వె
5. నకను రక్కసల పాయును రె॥ జదా
6. లకు సుంకమందు దేవరాయం
7. మాడను వీసామున్ను ఇంతవట్టు
8. న్నుడిగిరాలకూన్ను దీపాల
9. కూను। రంగ్గబోగానకు నూంక
10. నాఇని చెఱ్వు వెనకను ఏపూరి
11. బ్రాహ్మనిచేత క్రయము గొం
12. నది రె॥ బొంమ్మకంట్టను సూ
13. దెడిలోకసముద్రానను క్రింద్ది
14. కాల్వను రె॥ ప్రమాదీచ సంవత్సర మా
15. ఘ బ 14 గు నాండు శ్రీపర్వ్వతం మీం
16. దను పాతాళగంగ్గలోను ధారవోసిం
17. ద్ది నూంకనేని చెఱ్వు వెనక ఊటపొలము
18. నను। బొంమకంటను మూరెడ్డిలోకస
19. ముద్రం వెనకను రె॥ రుద్రమకాల్వను
రె॥ బ్రోం
20. తుకూరను నీరునేల పొలముచు దేవరాయ
21. ము మఱుతురు చింనాలును వెలివొలము
22. సేను పుట్టిచింన్నాలూను। తాడూరి
23. పొలకు మాడను రెండు వీసాలూను
24. రంగభోగానకు బొంమకంటను
25. నీరు నేల పడివరాయము మఱు
26. తురు నీరు .నేలాను వెలివొలానను
27. పుట్టి చింన్నాలూను। దీపాలకు దో
28. సపాడన పెద కాలువను సర్వ్వ
29. మాన్యముగాను రెండు మఱు
30. తురుఉన్ను నీరునేలాను। గుగ్గి

## మూడవప్రక్క

1. లాకునం ద్రానకూ విడము మంచి పో
2. ంకలకుంను మంచాకులకూ కర్పూ
3. రానకూను కస్తూరికిని యింగువు మిరి
4. యాలకూను పువుతోంటవాని జీ
5. తమూను పిండివంటకూను
6. ముప్పవురాన సర్వ్వ మాన్యము
7. గాను రెండు మ
8. ఱుతురు సేను నీరునేలాను,
9. దీపాలకు బ్రోంతు
10. కూరను ఆకుం దొంటరికి దేవ
11. రాయము మాడ రెండు వీసాలు
12. ంను। బ్రోంతుకూరి పడుమటి
13. పొనుంగంటి తెరు వుత్తరానను
14. తాంబట్టింపిన మామిండి
15. తోంట అంగరంగ భోగాన
16. కుంను। అంగభోగానకు చలి
17. వందిరికుంట తూర్పుఁనను వెలి
18. వొలము రెండుపుట్లుసేనున్ను
19. యింతవట్టు వ్రిత్తులుంను యి
20. చ్చిరి॥ ఆ స్థానపతులు దేవర
21. కు నడిపి నిత్యపడ్లు। రాజనపు
22. బియ్యము ముత్తుమ్ము పె

---

31. సిద్ధ్యర్థ్థము.

23. సలు ముయ్యడ। వేయి మూ
24. ండు తవ్వలు। రెండు పిండివంట
25. లున్ను। పొసముంను। పది మేలో
26. గిరాలుంను। ముయ్యడ పెరుగు
27. ంను। మిరియాలు—రెరడుం
28. ను। యింగువు మూడు సిన్నాల ఎ
29. త్తున్ను। మంచిపోంకలు పదేనుం
30. ంను। మంచాకులు నలుపదేను
31. గంధము ఎండాదికి యిరువయి
32. తులములుంను। కస్తూరికిని కప్పు
33. రమూను ఈ ధర్మ దప్పక నడిపేది॥

నాలుగవప్రక్క

1. ఈ ధమ్మ౯వు ప్రతిపాలించినవారి
2. కి ననంత పుణ్యమవును। ఈధమ్మ౯
3. వునకు బాధసేయు వార్కి- పంచమ
4. హా పాతకము లవును॥ అది
5. అట్టిదకదా పెద్దల వచనములు।
6. స్వదత్తాం పరదత్తాం వా యోహ
7. రేతి వసుంధ్వరాం। షష్ఠివర్ష రుష స
8. హస్రాణి విష్టాయాం జాయతే క్రిమి
9. శత్రుణోపికృతో దమ్మ౯ పాలనియ్య(ప్ర)యు
10. త్నతః। శ్శత్రుంవభవే శ్శత్రుధమ్మ౯ శత్రుం న్నకస్య
11. చిత్॥ సామాన్యోయం ధమ్మ౯ సేతుం
12. నృపాణం కాలేకాలే పాలనియో భవ
13. ద్భిః। సర్వా౯ నేతా న్భావినః పార్థివేం
14. ద్రా న్భూయోభూయో యాచతే రా
15. మచంద్రః॥ మంగళమహా శ్రీ శ్రీ
16. శ్రీ

---



# ప్రాచీన సంప్రదాయం - డేవిడ్ రికార్డో

డా. ఏ. ఆర్. కె. మూర్తి

ప్రాచీన సంప్రదాయములో ఆడమ్‌స్మిత్, మాల్థస్‌ల తరవాత పేర్కొనదగినవాడు డేవిడ్ రికార్డో. డేవిడ్ రికార్డో ఖ్యాతి అతను చేసిన భాటక సిద్ధాంతం, (Theory of Rent), పన్నుల భారం (Incidence of Tax) మూలంగా లభించిందని ప్రతీతి. పన్నులభారం చివరికి ఆర్థికవ్యవస్థలో ఉండే పంపిణీ విధానంమీద ఆధారపడి ఉంటుందని చెప్పినవారిలో ఇతడే మొదటివాడు. పంపిణీ విధానం రాజకీయ ఆర్థికవ్యవస్థకు కీలకమైన సమస్యగా భావించి ప్రచారం చేసినవాడు రికార్డోయే.

డేవిడ్ రికార్డో 1760 లో హాలెండ్‌లో యూదుల కుటుంబంలో జన్మించినాడు. తన 11 వ ఏట చదువు ప్రారంభించి 3 సంవత్సరాలకే తండ్రికి తోడుగా ఉండడానికి లండన్ తిరిగి వచ్చినాడు. అతని తండ్రి స్టాక్ ఎక్స్ఛేంజ్ (Stock Exchange) లో పనిచేస్తూ ఉండేవాడు. 1814 లో, అంటే తన 42 వ ఏట ఉద్యోగంనుంచి విరమించుకొని తన సొంత ఎస్టేటు (Estate) లో స్థిరపడిపోయినాడు. అప్పటినుంచే ఆర్థికశాస్త్రంలో కొంత కృషిచెయ్యడం మొదలుపెట్టినాడు. జీవితంలో ఆలస్యంగా ప్రారంభించినా త్వరలోనే తన ప్రజ్ఞావిశేషాలను ప్రదర్శించి ఆర్థికవేత్తలలో ఒక ప్రముఖస్థానాన్ని సంపాదించుకొన్నాడు. 1799 లోనే ఆడమ్ స్మిత్ వ్రాసిన 'దేశసంపద' (Wealth of Nations) చదవడం తటస్థించింది. పది సంవత్సరాల తరవాత బులియన్ విధానాన్ని గురించి ఒక వ్యాసాన్ని వ్రాసి ఆర్థికశాస్త్రంలో అతనికున్న అభినివేశాన్ని, అభిరుచిని ఆనాటి సమస్యలకు తగిన పరిష్కారమార్గాన్ని సూచించడంలో అతనికున్న ఉత్సాహాన్ని ప్రదర్శించినాడు. అతను చేసిన సూచనలు బులియన్ సంఘానికి ఆమోదయోగ్యంగాను, ఆచరణయోగ్యంగాను తోచినాయి. ఆనాడు ఇంగ్లండులో ఏర్పడిన ద్రవ్యోల్బణానికి ఇంగ్లండుబాంకు కరెన్సీ విషయంలో విధించవలసిన నిబంధనలను కట్టుదిట్టం చెయ్యకపోవడమే ప్రధాన కారణమని రికార్డో సూచించినాడు. ఇది యథార్థమని అందురూ అంగీకరించడంతో అతని ఖ్యాతి ఇనుమడించింది. 1814 లో ప్రభుత్వం అనుసరిస్తున్న వాణిజ్య విధానాన్నిగురించి కొంత పరిశీలన జరిపినాడు. ఆ సందర్భంలో వ్రాసిందే "Essay on the influence of low price of corn on the profits of stock."

క్రమక్షీణప్రతిఫలసిద్ధాంతాన్ని గురించి తన పూర్వులు...ముఖ్యంగా మాల్థస్, రాబర్ట్ టారిన్స్, ఎడ్వర్డ్‌వెస్ట్‌లు ప్రస్తావించినా రికార్డో చేసిన పరిశీలనే విశిష్టమైంది. ఆ సిద్ధాంతాన్ని అతడు చర్చించినంత సమగ్రంగా వారు చెయ్యలేదు. 1817 నుంచి 1822 వరకు ప్రచురించిన రచనల్లో ముఖ్యమైంది (Principles) మూడో ముద్రణం. ఇందులో యంత్రాలను ప్రవేశపెట్టడం... అంటే యాంత్రీకరణ శ్రామికవర్గానికి గొడ్డలిపెట్టు వంటిదని నిరూపించినాడు. దీనితో ఆర్థిక పరిశీలనలో ఒక నూతనాంశాన్ని ప్రవేశపెట్టినట్టు అయింది.

రికార్డో తన రచనలను ప్రచురించిన కొద్ది కాలానికే విజ్ఞుల మన్ననలను పొందినాడు. అతని ఖ్యాతి ఇనుమడించింది. అతని ప్రతిపాదనలనుగురించి తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగినాయి. పార్లమెంటులో వాటిని ఎన్నోసార్లు చర్చించడం జరిగింది. అతనిలో ఒక విశేషమైన గుణం ఉంది... ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న సమస్యలను చర్చించి వాటికి పరిష్కారమార్గాలను సూచించడం. ఇట్లా చెయ్యడంవల్ల కొద్దికాలంలోనే పలుకుబడిని సంపాదించుకోగలిగినాడు. దీన్ని చక్కగా నిర్వహించిన వాడు కీన్సు. అతనితో రికార్డోను కూడా సరిపోల్చవచ్చు.

రికార్డో తన...రాజకీయ అర్థికశాస్త్రం; పన్నుల సూత్రాలు...అనే రచనలో, ఆడమ్ స్మిత్‌తో పోలిస్తే, పరిమితమైన అంశాలనే పరిశీలించినా వాటిని కూలంకషంగా చర్చించినాడు. ఇట్లా చెప్పినప్పుడు, నిజజీవితంలోని సంఘటనలకోసం ప్రయత్నించకుండా కేవలం సిద్ధాంతపరమైన చర్చలనే చేసినట్లు అగపడుతుంది. అతని రచనల్లో అమూర్త భావాలు (Abstract Ideas) ఊహాజనితమైన సంఘటనలు మాత్రమే గోచరిస్తాయికానీ, వాస్తవిక భావాలు, చారిత్రక సంఘటనలు ఏమాత్రం అగపడవు. అతడు నిగమనపద్ధతిని అవలంబించినాడు. వీటన్నిటిదృష్ట్యా ఆయన తన రచనల్లో అన్ని అంశాలను సంఘటితం చెయ్యలేదని కొందరి అభిప్రాయం. ఒక్కటిమాత్రం నిజం: అతను పరిశీలించిన మూల్యం, ధర, పంపిణీ, దీర్ఘకాలిక మూలధన సేకరణలకు సంబంధించిన సిద్ధాంతాలు భావస్ఫోరకాలుగానూ ముందుతరాలవారికి...ఇటు ప్రాచీన సంప్రదాయులకూ, అటు సామ్యవాదులకు ఉత్తేజకాలుగాను—ఉన్నాయనే చెప్పవచ్చు. అతని విశ్లేషణా సౌష్టవం, నర్మగర్భంగాఉన్నకొన్నిభావాలు వాటిని గురించి తెలుసుకొంటే అర్థికశాస్త్ర చారిత్రక వికాసంలో అతని స్థాన మేమిటో తెలుసుకోవడం సులభం.

## పంపిణీ సిద్ధాంతం :
## (Theory of Distribution)

రికార్డో పరిశీలనలో విశిష్టమైంది అతను చేసిన పంపిణీ సిద్ధాంతమేనేమో అనిపిస్తుంది. ఈ సిద్ధాంతానికీ విలువసిద్ధాంతానికీ చక్కటి సంబంధాన్ని కల్పించి అర్థికశాస్త్ర పరిశీలనకు మెరుగు పెట్టినాడనే. అనిపిస్తుంది. అతని పూర్వులైన ప్రకృతిధర్మవాదులు (Physiocrats) ఈ విషయికమైన చర్చ జరపనేలేదు. అది వారి ఊహకు అందని విషయమే అనుకోవచ్చు. ఆడమ్ స్మిత్ ఈ విషయంలో కొంత ముందడుగు వేసినా, విలువను గురించి మూల్యం గురించి అతనికి అంత స్పష్టమైన నిర్దిష్టమైన భావాలు ఉన్నట్లు అగపడదు. రికార్డో ఈ రెంటిని క్షుణ్ణంగా పరిశీలించి వానికున్న పరస్పర సంబంధాన్ని స్పష్టంగా చూపినాడు. రికార్డో తన పరిశీలనలలో వివిధ ఉత్పత్తి కారకాలకు జాతీయాదాయంలో లభించే వాటాలు ఎంతెంత ఉంటాయో, అవి ఎట్లా నిర్ణయమవుతాయో, వాటి మధ్య ఉండే సంబంధం ఎటువంటిదో చూపించాడు. వీటిని గురించి జరిపిన పరిశీలన కొంత చక్రీయంగా ఉన్నా, విడమరిచి చెప్పగలిగినవాడు రికార్డోయే అని చెప్పవచ్చు. పంపిణీసిద్ధాంతాన్ని అంతటినీ క్లుప్తంగా కింది విధంగా చెప్పవచ్చు.

లాభాలు, వేతనాల ఎక్కువతక్కువల మీద ఆధారపడి ఉంటాయి. వేతనాలు జీవితావసర వస్తువుల ధరలమీద, వీటిధరలు ఆహారధాన్యాల ధరలపైన ఆధారపడతాయి. అహారధాన్యాల మారకం విలువ వినిమయపువిలువ లేదా ఉపాంతస్థభూమి (Marginal land) ని సాగుచెయ్యడానికి అవసరమైన శ్రమపరిమాణంమీద ఆధారపడుతుంది. అందుకే దీర్ఘకాలంలో వేతనాలు కనిష్ఠజీవన స్థాయి చేరుకొంటాయి (Subsisteuce level). ఈ విధమైన మారకపువిలువే కనిష్ఠజీవనస్థాయిని నిర్ణయిస్తుంది. వివిధ ఉత్పత్తిరంగాలలో ఉండే వేతనాలరేట్లు వాటి మధ్య ఉండే స్పర్థవల్ల (competition) సమాన

మవుతాయి. లాభాలు, ఉపాంతవుఉత్పత్తిలో మిగిలే శేషణం వల్ల ఏర్పడతాయి. లాభాలు ఉత్పత్తి రంగాలమధ్య ఏర్పడే స్పర్థవల్ల సమానంగా ఉంటాయి. దిగుబడి ఎక్కువగా ఉన్న భూములకు సంబంధించిన అద్దె—భాటకం—పెరుగుతూ ఉంటుంది. ఈ విధంగా వ్యవస్థలో ఉత్పత్తిఅయినదంతా పైన వివరించిన విధంగా వివిధఉత్పత్తికారకాలమధ్య పంపిణీ అవుతూ ఉంటుంది.

## మూల్య నిర్ణయ సిద్ధాంతం:
## (Theory of Value)

రికార్డో తన మూల్యనిర్ణయ సిద్ధాంతాన్ని ప్రయోజనపు విలువ (Value in Use), వినిమయపు విలువ (Value in Exchange) అనే వాటి మధ్య ఉండే తారతమ్యాలను తెలియజెయ్యడంతో మొదలు పెట్టినాడు. వినిమయపువిలువే ఆర్థికశాస్త్ర పరిశీలనలో అత్యంతప్రధానమైందని అతనంటాడు. ప్రయోజనం అనేది వస్తువులకున్న సహజమైన లక్షణం అయినా, వినిమయపువిలువను నిర్దేశించేది కాదని అతని వాదం. ఇట్లానే సహజమైన విలువ (Natural Value) పరిస్థితులనుబట్టి మారుతూ ఉంటుండేదికాదనీ, తాత్కాలికమైందికాదనీ, మార్కెటు విలువ అట్లా కాకుండా మార్కెటుకువచ్చే మార్పులకు అనుగుణంగా మారుతూ ఉండేదనీ పేర్కొన్నాడు. పైన చూసిన రెండింటిలోనూ అతని పరిశీలన అంతటిలో మనకు అగుపించేది సహజమైన విలువను గురించిన చర్చే ఈ విషయంలో రికార్డో ఆడమ్‌స్మిత్‌ను అనుసరించినాడనే చెప్పవచ్చు.

వస్తువులకు ప్రయోజనం అనే లక్షణం ఉండన్నవాడు రికార్డోయే. అవి, కొరతగా ఉండడంవల్ల విలువైనవి, వాటిని ఉత్పత్తిచెయ్యడానికి అవసరమైన శ్రమ పరిమాణాన్నిబట్టి విలువ ఉన్నవి. ఇందులో మొదటిరకం వస్తువులే ఆర్థికశాస్త్రచర్చల్లో ఆర్థిక జీవనంలో పనికివచ్చేవనీ వివరించినాడు. మొదటిరకం వస్తువులకు, అపురూపమైన కళాఖండాలూ, చిత్రాలు మొదలైనవాటిని ఉదాహరణలుగా తీసుకొన్నాడు. వానికుండే విలువ వాటి ప్రయోజనంవల్లకాక అవి దొరకడం దుర్లభం కావడంవల్లనే అని అతని వాదం. రెండోరకం వస్తువులు అట్లాకాదు. అవి శ్రమ నిర్మితాలు. మన అవసరాలనుబట్టి వాటి సంఖ్యను పెంచే అవకాశం ఉంది.

సంఘం, మూలధనసంచితాన్ని ఒనకూర్చుకొనే దానికి ముందు, వివిధ వస్తువుల విలువలు వాటిని ఉత్పత్తి చెయ్యడానికి అవసరమైన శ్రమను బట్టి నిర్ణయమయ్యేవని ఆడమ్ స్మిత్ అనిన విషయం మనకు తెలిసిందే. ఈ విషయంలో రికార్డోకూ, ఆడమ్ స్మిత్‌కూ ఏకాభిప్రాయం ఉండడం మనం గమనించవలసిన ముఖ్యాంశం. కాని ఈ విషయాన్ని పరిశ్రమలకు—అంటే పారిశ్రామికోత్పత్తికి కూడా అన్వయించి,తన సిద్ధాంతాన్ని రికార్డో విస్తృతం చేశాడు.పారిశ్రామికోత్పత్తిలోకూడా, వస్తూత్పత్తికి అవసరమైన శ్రమే, వస్తువులధరలు లేదా విలువకు ప్రధానమైన ఆధారం. ప్రస్తుతం సంఘం సాధించిన ప్రగతి దృష్ట్యా చూస్తే వివిధ వస్తువుల విలువను నిర్ణయించేది కేవలం శ్రమమాత్రమే కాదని, వేతనాలూ, లాభాలు, భాటకంఅనే అంశాలుకూడా అని స్మిత్ వాదించినాడు. కానీ రికార్డో దృష్టిలో ఒక్కశ్రమే వస్తువులవిలువకు ఆధారభూతమైన అంశం. ఈ విషయంలో అతనికి కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఉన్నట్లు అర్థమవుతుంది. కొంచెం వివరిస్తే, స్మిత్ ఊహించినట్లు, లాభాలకు కానీ, వేతనాలకు కానీ వస్తువుల విలువను మార్చగలిగే శక్తిలేదని నిక్కచ్చిగా చెప్పినాడు.

రికార్డోచేసిన పరిశీలననుబట్టి ఆయన ఆడమ్‌స్మిత్ భావాలను కొన్నింటిని విశదీకరించి, సులభగ్రాహ్యం చేసినాడనవచ్చు. వస్తువుల విలువకు శ్రమే మూలమని కాకుండా, వస్తూత్పత్తికి అయిన శ్రమ, ఆ వస్తువులు ఎంతశ్రమను సంపాదించవచ్చో అనేవి రెండూ ఒకటే అని రికార్డో చెప్పినట్లు మక్‌లచ్ పేర్కొన్నాడు. ఇది నిజంగా అంతవరకూ ఉంటున్న

మూల్య నిర్ణయ సిద్ధాంతాలకంటే విశిష్టమైనదని చెప్పవచ్చు.

వేతనాల రేట్లు, లాభాల మాదిరిగానే వివిధ పరిశ్రమల్లో వేరువేరుగా ఉంటాయి. పరిశ్రమల మధ్య పరిపూర్ణమైన స్పర్ధ ఉంటుందని రికార్డో భావించినాడు. దీన్ని ఆధారంచేసుకొని ఒకేరకమైన శ్రమకు వివిధ ఉత్పత్తి వ్యవస్థల్లో ఒకేరకమైన వేతనాల రేటు ఉంటుంది అన్నాడు.

## వేతన నిర్ణయ సిద్ధాంతం:

వేతన నిర్ణయ సిద్ధాంతం విషయంలో రికార్డో ఆడమ్ స్మిత్‌ను అనుకరించినాడు. కాదంటే, శ్రమకు ఉండే స్వల్పకాలిక, దీర్ఘకాలిక మార్కెట్ ధరల మధ్య ఉండే విభేదాన్ని ఎత్తిచూపినాడు. ఇట్లాంటి మార్కెట్ ధరల నిర్ణయంలో కొరత (Scarcity), బేరమాడే శక్తి (Bargaining Power) అనేవి ఎట్లాంటి పాత్రను నిర్వహిస్తాయో తెలిపినాడు. ఇట్లా ఏర్పడిన ధర (వేతనం) సాధారణమైన ధర (Normal Price) అన్నాడు. ఇది దీర్ఘకాలిక మార్కెట్‌ధర అని అతని భావం. సహజమైనధరఅంటే దీర్ఘకాలంలో శ్రామికులు తమను తాము పోషించుకొంటూ, తమ జాతిని పెంపొందించుకోడానికి ఎంత వేతనం అవసరమో అదే సహజమైన ధర లేదా వేతనం అన్నాడు.

వేతనాలు పెరగడంవల్ల, పెట్టుబడి మూలధనంరేటు, శ్రామికవర్గపు పెరుగుదల రేటుకన్నా అధికంగా ఉంటున్న, అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో మార్కెటుధర, సహజమైన ధరను మించి ఉండవచ్చు. అతని ఉద్దేశంలో దీర్ఘకాలికమైన సహజమైన ధర (Long-run Natural Price) ఒక చర విషయమేకాని (Variable), స్థిరవిషయం (Constant) కాదు. ఇట్లాంటిది దేశకాలపరిస్థితులను అనుసరించి మారతూ ఉంటుంది. అందుకే అది చర విషయమని అతడు భావించి నాడనవచ్చు. ఒక ప్రాంతంలో వేతనాలు తక్కువ స్థాయిలో ఉంటే, అది దేశంలో ఇతరత్రా వేతనాలలో విభేదాలకు దారతీయవచ్చు. కాని వీటిని రికార్డో కొన్ని ప్రత్యేకమైన అంశాలుగానే భావించినాడన్న దాన్ని గుర్తించుకోవలె. రాను రాను వేతనాలు కనిష్టజీవనస్థాయిని పడిపోవడం, వేతనాలు మెరుగయ్యే అవకాశం లేకపోవడం జరుగుతుంది అనేదే అతని విశ్వాసం. ఈ విషయంలో అతడు తన నిరాశావాదాన్ని (Pessimism) బయలుపరిచినాడు. ఒకవేళ వేతనాలు పెరిగితే అది అధికజనాభాకు దారితీస్తుందనీ, అందువల్ల ఏర్పడిన మిగులు హరించుకుపోతుందనీ అతనివాదం. అందుకే భాటకం, లాభాలు, వేతనాలు ఒక నియమబద్ధమైన మార్గంలో ఉంటాయనీ రికార్డో అంటాడు. అంటే అవన్నీ కనిష్టస్థాయి వైపుగా మారడం సాధారణంగా జరుగుతుంది. ఈ కారణంగానే వేతనాలు మీద విధించే పన్నులు లాభాలపైనబడతాయని అన్నాడు. ఇట్లా జరగడానికి వేతనాలు సరళంగా (Inflexible) లేకపోవడమే కారణమని అతని అభిప్రాయం. జనాభా పెరుగుదలకు, వేతనాలు స్థాయికి ఉన్న పరస్పర సంబంధం విషయంలో రికార్డో వాదానికి, మాల్థస్ వాదానికి సారూప్యం ఉండడాన్ని మనం గుర్తించవచ్చు.

రికార్డో వాదాన్ని చక్కగా అర్థం చేసుకోవాలంటే ఆ నాడు ఇంగ్లండులోని పరిస్థితులను తెలుసుకోవడం అవసరం. అనుశ్రుతంగా వస్తున్న ఆస్తిపాస్తులున్నవారి సంఖ్య అధికంగా ఉండేది. అట్లాంటివారు సంపన్నులైన భూఖామందులకే తమ భూములను కౌలు కిచ్చేవారు. ఆ ఖామందులు స్వయంగా కృషిచెయ్యకుండా పేదరైతులకు తిరిగి కౌలుకిచ్చేవారు. అప్పట్లో శ్రామికవర్గం అంత సంఘటితంగానూ, శక్తివంతంగానూ లేదు. ఇది శ్రామికవర్గాన్ని పీడించడానికి భూస్వాములకు అవకాశాన్ని ఇచ్చింది. దీని ఫలితంగా వేతనాలు కనిష్టజీవన స్థాయిలోనే ఉండిపోయినాయి. పరిపాలనా విధానంవల్ల— ముఖ్యంగా Enclosure Acts ఫలితంగా—రైతులకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు పోయినాయి. పారిశ్రామిక

రంగంలో వచ్చిన సాంకేతికమైన మార్పులు ఫలితంగా చేతిపనులు చేసుకొని జీవించేవారికి జీవనాధారం పోయింది. భూముల్లో పండే పంటవల్లే పెద్దపెద్ద కుటుంబాలను పోషించాల్సిన అవసరం ఏర్పడింది. ఆడవాళ్ళు పిల్లలు కూడా పనిచేస్తేనేకాని భుక్తి గడిచేదికాదు. జీవితం దుర్భరమైంది. జనాభా పెరుగుదలను అరికట్టే ఆలోచనే చేసేవాడుకాదు, ఆనాటి శ్రామికుడు. జనాభా పెరగడంవల్ల తలసరి వినియోగం (Per Capita Consumption) కనిష్ట స్థాయికి పడిపోయింది. జీవన ప్రమాణం (Standard of Living) బాగా దిగజారిపోయింది. జనాభా పెరగడంవల్ల ముందున్నవేతనాలు కూడా తగ్గిపోవడం ఆరంభమైంది. ఇదీ ఆనాటి పరిస్థితి. ఇట్లాంటి పరిస్థితుల్లో చేసిందే రికార్డో పరిశీలన. అందువల్లే అతని వాదం నిరాశావాదం అయింది.

యంత్రీకరణవల్ల శ్రామికుల ఉత్పాదకశక్తి పెరుగుతుందనీ, అందువల్ల వస్తు, సేవలను (Goods and Services) పెంచవచ్చుననేదాన్ని రికార్డో ఒప్పుకోలేదు. కానీ ఆనాడు అనేక పశ్చిమ దేశాల్లో ఏర్పడిన పరిశ్రమలవల్ల అధికోత్పత్తి ఏర్పడడం, జనాభా పెరుగుదల తగ్గడంవల్ల జీవన ప్రమాణం మెరుగుపడడం జరిగింది. ఇది రికార్డో ఊహించినదానికి భిన్నంగా ఉన్నది. కానీ రికార్డో చెప్పినదానిలో కొంత సత్యం లేకపోలేదు. మిగతా విషయాలలో మార్పులేకుండా, జనాభా పెరగడంవల్ల సాధారణంగా ఎట్లాంటి పరిస్థితులు ఏర్పడడానికి అవకాశం ఉంటుందో దాన్ని ఆయన సూచించినాడని అర్థం చేసుకోవలె.

### భాటక నిర్ణయ సిద్ధాంతం :

రికార్డో పూర్వులు—ముఖ్యంగా స్మిత్, మాల్థస్, పెట్టీ, టర్‌గాట్‌లు కూడా ఈ సమస్యను కొద్దిగానో గొప్పగానో చర్చించినారన్న విషయం ఇదివరకే తెలుసుకొన్నాం. కానీ అన్నింటిలోను రికార్డో చేసిన సిద్ధాంతమే విశిష్టమైంది. అసలు ఆయనకు పేరు ప్రతిష్ఠలన్నీ ఈ సిద్ధాంతంవల్లనే లభించినాయంటే ఆశ్చర్యం లేదు.

రికార్డో చేసిన పంపిణీ సిద్ధాంతం—భూమి, దానినుంచి వచ్చే ఉత్పాదనానితో ముడిపడి ఉంది. భూసార విభేదాన్ని (Differential Fertility)బట్టి భాటకం ఏర్పడుతుందని చెప్పిన వారిలో రికార్డోయే మొదటివాడు కాకపోవచ్చు. వ్యవసాయరంగంలో క్రమ క్షీణ ప్రతిఫలాలు ఏర్పడతాయని చెప్పిన వారిలో కూడా రికార్డోయే ప్రథముడు కాకపోవచ్చు. కాని వీటన్నిటికి ఆర్థికసిద్ధాంతాలన్నిటితో చక్కటి సంబంధం ఉందని నిరూపించిన వారిలో రికార్డో యే ప్రథముడని చెప్పక తప్పదు.

1. తక్కువరకం భూములను సేద్యయోగ్యం చెయ్యడంవల్ల వ్యవసాయరంగాన్ని విస్తృతం చెయ్యడం.

2. సాంద్ర వ్యవసాయ పద్ధతులను (Intensive Methods of Cultivation) అవలంబించడం వల్ల క్రమక్షీణ ప్రతిఫలాలు ఏర్పడడం.

జేమ్స్ అండర్‌సన్ 1801 లో మొదటి దశకు సంబంధించి కొంత చర్చచేసినట్లు చరిత్ర రుజువు చేస్తోంది. కానీ రెండోదశను గురించి అతడు ప్రస్తావించలేదనేది గూడా ఆ చరిత్రవల్లనే స్పష్టమవుతుంది. ఈ విషయంలో రికార్డోయే కొంత పరిశీలన జరిపినాడు. మాల్థస్ క్రమక్షీణప్రతిఫలాల (Diminishing Returns) విషయం ప్రస్తావించినా, దానిని ఆయన తన జనాభా సిద్ధాంతాలను సహేతుకంగా నిరూపించుకోడానికి ఒక ప్రాతిపదికగా మాత్రమే ఉపయోగించుకొన్నాడుకాని, దాన్ని ప్రత్యేక సిద్ధాంతంగా భావించి చర్చించినట్లు చారిత్రక ఆధారాలు లేవు. అందువల్ల రికార్డోయే ఈ విషయాన్ని ప్రథమంగా అట్లా చర్చించినాడని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ప్రకృతి ధర్మవాదులూ, ఆడమ్ స్మిత్—భాటకం అన్నది, ప్రకృతి మానవునికి ఇచ్చే బహుమతివంటిదని భావించినారు. అంటే వారి వాదన అంత శాస్త్రీయంగా లేదని అనవచ్చు. తన పూర్వులు చేసిన చర్చను ఆధా

రంగా చేసుకొని తన సిద్ధాంతానికి ఒక నిర్దిష్ట స్వరూపాన్ని రికార్డో ఇచ్చినాడనేది నిర్వివాదాంశం.

అతని సిద్ధాంతానికి మూలాధారమైన కొన్ని ఊహాలను ఇక్కడ తెలుసుకోవడం ఎంతైన అవసరం.

స్థిరనివాసంఏర్పరుచుకొన్నప్పుడుభూములుఉంటాయనీ, ఆరంభంలో ఆ భూములను సాగుచేసినప్పుడు భాటకం ఇవ్వవలసిన అవసరం ఉండదనీ భావించినాడు. జనాభా పెరిగేకొద్దీ, సేద్యయోగ్యమైన, సారవంతమైనభూమి తక్కువ అవుతూవస్తుంది. అందువల్ల అంత సారవంతంగా లేని భూములను (Less Fertile Lands) సాగుచెయ్యవలసిన అవసరం ఏర్పడుతుంది. భూమిపైన జనాభా ఒత్తిడి ఎక్కువ అయ్యేకొద్దీ భాటకంలేని భూములు (No-rent Lands), భాటకం అవసరమున్న భూములుగా మారతాయి. అప్పుడు, భూసార విభేదాలనిబట్టి భాటకం ఏర్పడుతుంది. భాటకం, సాంద్రవ్యవసాయం (Intensive Cultivation) వల్లకూడా ఏర్పడుతుందని భావించినాడు. అంటే మూలధనం, శ్రమలను వివిధపాళ్లలో మిశ్రమంచేసి ఉత్పత్తిని నిర్వహిస్తే ఫలితాలు వేరుగా ఉంటాయనీ, అందులో మిగులుబాటు ఉంటుందనీ, అదే భాటకమవుతుందని అతని వాదం. అత్యధిక ఉత్పత్తి వ్యయం ఉన్న ధాన్యం ధరే, సప్లై అయిన మొత్తం ధాన్యం ధరను నిర్ణయిస్తుంది. (The price of grain was set by cost of Production of the highest cost portion of the total supply of grain.) అత్యధిక ఉత్పత్తి వ్యయం ఉండేదాన్ని పండించే భూములు, అటు విస్తృత వ్యవసాయం చేసే భూములలోగానీ, ఇటు సాంద్ర వ్యవసాయం జరిగే భూములలోగానీ ఉంటాయి. ఈ విధంగా నిర్ణయమైన ధరల వ్యవస్థలో అసలు వ్యయం (Actual cost) ఎంత ఉంటుందో అదే భాటకమవుతుందని రికార్డో అంటాడు. భాటకం అనేది తగ్గురకం భూములకూ మేలురకం భూములకూ ఉన్న తేడావల్ల ఏర్పడుతుందనేది రికార్డో వాదం. ఎందుకంటే మేలురకం భూముల్లో తక్కువ వ్యయంతో ఎక్కువ దిగుబడీ, తగ్గురకం భూముల్లో ఎక్కువ వ్యయంతో తక్కువ దిగుబడి ఉంటుంది కాబటి భాటకమనేది ఏర్పడడానికి అవకాశం ఉందని అతని నమ్మకం. జనాభా పెరిగేకొద్దీ ధాన్యం ధరలూ, భాటకం పెరుగుతాయని భావించినాడు. ఇట్లా అనుకోడానికి ఆ నాడు ఇంగ్లండులోని పరిస్థితులే కారణం అనవచ్చు. జీవితావసర వస్తువుల—ముఖ్యంగా ఆహార ధాన్యాల—ధరలు పెరుగుతున్నపుడు, శ్రామికుల వేతనాలు నిలకడగా ఉంటే వాటిని తగ్గించడం అసంభవం. ఈ విషయాన్ని అతని వేతననిర్ణయసిద్ధాంతం ధృవపరుస్తుంది. అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో భాటకం, వేతనాలు నిలకడగా ఉంటున్నప్పుడు పెట్టుబడిమీదవచ్చే లాభాలు తక్కువగా ఉంటాయని అతని వాదం.

రికార్డో భాటకానికి సంబంధించి చేసిన సిద్ధాంతాన్ని పలువురు నిశితంగా విమర్శించినారు. ఎందుకంటే రికార్డో దృష్టిలో భాటకం అంటే భూమిని ఉత్పత్తికోసం ఉపయోగించుకోవడానికి చెల్లించే సొమ్ముకాదు; అది కేవలం ఆర్థికమైన మిగులు మాత్రమే. అంటే ఉత్పత్తికి అవసరంకానిదన్నమాట. రికార్డో ఇచ్చిన నిర్వచనాన్ని పరిశీలిస్తాం...సహజమైన, నాశనంచెయ్యడానికి వీలులేనటువంటి భూసారాన్ని వినియోగించుకొన్నందుకు, భూస్వామికి చెల్లించే సొమ్మ భాటకం...అని నిర్వచించినాడు. (That portion of the produce o the earth which is paid to the landlord for the original and indestructable powers of the soil.) భూమిని పండించుకోడానికి ఉపయోగించుకోడం,దానికిచేసే అభివృద్ధి(Improvements)కి చెల్లించే ధనం అని మామూలుగా అనుకోడం పరిపాటికానీ రికార్డో దృష్టిలో భూమిని బాగుచెయ్యడానికి వెచ్చించే ధనం పెట్టుబడిధనం. భూమికి ఉండే సహజమైన శక్తివల్ల పంటలు పండుతాయి. పంటలు పండడానికీ, భాటకానికీ ఏవిధమైన

సంబంధంలేదు. అందుకే భాటకాన్ని మిగులుగా భావించినాడు రికార్డో.

అతని విశ్లేషణకు పోటీఉండే సాంఘిక వ్యవస్థ, గమనశీలంగల ఉత్పత్తి సాధనాలు (Mobility of the Factors of Production) అనే ప్రమేయాలు ఆధారాలు. ఆ నాడు లండన్ ద్రవ్యం మార్కెటులోఉన్న పరిస్థితులేఇందుకు కారణమనవచ్చు. విదేశమారకద్రవ్యాన్ని త్వరగా కొనడం, అమ్మడం సులభమైనందువల్ల మూలధనాన్ని, ఆశించినంత రాబడిని సంపాదించడానికి వీలైన విధంగా విని యోగించగల అవకాశం ఉండేది. ఇట్లాంటిది వ్యవసాయరంగంలో సాధ్యంకాదు. భ రీ ఉత్పత్తి పరిశ్రమల్లోకూడా ఇది సాధ్యపడదని అతడు విశ్వ సించినాడు. రైతు ఒకసారి భూమిని కౌలుకు తీసుకొంటే నష్టంవచ్చినా భరించాల్సి ఉంటుంది. కారణం, ఎక్కువ మొత్తం చెల్లించకపోతే భూస్వామి అతన్ని తొలిగిస్తానని భయపెట్టవచ్చు. నష్టం భయం అతన్ని ఎప్పుడూ వెన్నంటే ఉంటుంది.

పై చర్చనంతా పరిశీలిస్తే రికార్డోకూడా ఆడమ్ స్మిత్ ఎచ్చిన నిర్ణయానికే వచ్చినాడని తేలు తుంది. కాని ఇద్దరిపరిశీలనల్లో ఒక సూక్ష్మమైన భేదం ఉంది. రికార్డో భాటకం అంటే కేవలం భూస్వామి కౌలుదారునుంచి రాబట్టే విమోచన ధనం (Ransom) గా కాక ఉపాంతపుభూమిసాగు అనే భావనవల్ల తన విశ్లేషణను సునిశితమైందిగా మార్చినాడు. భూస్వామి ఉత్పత్తి కార్యక్రమంలో ఏ విధంగానూ సహాయపడేవాడుకాదనేదాన్ని ఇద్దరూ అంగీకరించినారు. అంటే భూస్వాములు భాటక రూపంగా సంపాదించేది అనార్జిత ఆదాయం (Unearned Income) అనే దాన్ని వారు స్పష్టంగా ఒప్పుకొన్నారు.

భాటకానికి సంబంధించి రికార్డో చేసిన వాదా నికి ఆ నాడు ఇంగ్లండులో ఉండిన పరిస్థితులే కారణం అనవచ్చు. నెపోలియన్ యుద్ధాలవల్ల భాటకం, ధరలు అత్యధికస్థాయినిఅందుకొన్నాయి. Enclosure Acts అమలులో ఉన్న రోజులు అవి. ఆ చట్టానికి ధరల పెరుగుదలకు గట్టి సంబంధం ఉందనేదాన్ని ఆచార్య కానన్ కూడా సహేతుకంగా నిరూపించి ధృవపరిచినాడు.

రికార్డో చేసిన భాటక నిర్ణయ సిద్ధాంతం అసంపూర్ణంగానూ, అసమగ్రంగాను ఉందని విజ్ఞుల అభిప్రాయం. అతనికి వ్యవసాయరంగంలోని లోతు పాతులు అంతగా తెలియవేమో అని వారి అభిప్రాయం. ధరలు పెరగడానికి, ఉత్పత్తికేంద్రాలకు విక్రయ కేంద్రాలకు ఉన్న దూరంకూడా ఒకకారణం కావచ్చుననే అంశాన్ని రికార్డో పూర్తిగా విస్మరించినాడు. ఇదే వారు ముఖ్యంగా పేర్కొనే అంశం. ఈ సిద్ధాంతా నికి మెరుగులు దిద్దే ప్రయత్నం 1826 లో జర్మన్ ఆర్థికవేత్త తన ప్రాంతీయాకరణసిద్ధాంతం (Location theory) ద్వారా ప్రయత్నించినాడు.

అన్నిటికంటే ముఖ్యమైన విమర్శ రికార్డో చేసిన భూసార విభేద భాటకం (Differential Rent) ను గురించి వచ్చింది. చరిత్ర నంతటిని జాగ్రత్తగా పరిశీలిస్తే భూఖామందు, భూముల నుండి వచ్చే మిగులును దృష్టిలో ఉంచుకొని భాట కాన్ని నిర్ణయించినట్లు ఒక్క నిదర్శనం కూడా అగపడదు. భాటకం ఎంత ఉండేదీ భూములు సాగు చెయ్యడానికి రైతుల మధ్య ఏర్పడే పోటీయే నిర్ణ యిస్తుంది. అంటే భూమిని సాగుచేసి పండించు కొంటేనేకాని భుక్తిజరగని పరిస్థితుల్లో అద్దె ఎంతైనా చెల్లించడానికి సిద్ధంగా ఉంటాడు రైతు. భూమి కొరతగా ఉండడం, దాన్ని కోరేవారు ఎక్కువ సంఖ్యలోఉండడం వల్లే చెల్లించవలసిన అద్దె ఎంతో నిర్ణయమవుతుంది. కానీ రికార్డో వాదనకు మూలం అతనికి మూల్యంపట్ల ఉన్న భావాలే కారణం అన్న విషయం గుర్తుంచుకోవలె. అతని మూల్యనిర్ణయ సిద్ధాంతాన్ని చక్కగా అర్థం చేసుకొంటేనేగానీ మిగిలిన పరిశీలనంతా సులభంగా అర్థంకాదు.

### లాభాలు—రికార్డో అభిప్రాయాలు:

రికార్డో దృష్టిలో లాభాలంటే విశిష్ట ఉత్పాదనం (Residual Product). అంటే మొత్తం ఉత్పత్తిలో భాటకం, వేతనాలు పోగా మిగిలిన ఉత్పాదనమే లాభమని అర్థం. తన వాదన నంతటినీ భాటకం లేని భూములకు అన్వయించి రికార్డో సూక్ష్మీకరించినాడు. భాటకంలేని భూములు (No-rent-Lands) అంటే ఉత్పత్తి అంతా లాభాలకూ వేతనాలకూ సరిపొయ్యేదిగా ఉండేదని అర్థం. ఆహారధాన్యాలధర పెరిగితే వేతనాలు, లాభాల పెరుగుదలకు సానుపాతంగా ఉంటాయని నమ్మినాడు: అతని భావాలను సంక్షిప్తంగా కింది విధంగా చెప్పవచ్చు.

లాభాలు, వేతనాల ఎక్కువతక్కువల పైన ఆధారపడి ఉంటాయి. వేతనాలు, జీవితావసర వస్తువుల—ముఖ్యంగా ఆహార ధాన్యాల ధరలమీద ఆధారపడతాయి. ఈ విధంగా భావించడంవల్ల లాభాలు పడిపోవడం అనేది వాటికి ఉన్న సహజలక్షణమని భావించినాడు. సంఘం పెరిగే కొద్దీ, ఆహారం ఎక్కువగా అవసరమవుతుంది; దీన్ని సంపాదించడానికి శ్రమను ఎక్కువగా వినియోగించవలసి ఉంటుంది. నూతన వ్యవసాయ పద్ధతులు—యాంత్రికమైన పనిముట్లను — ఉపయోగించడంవల్ల వ్యవసాయ రంగంలో ఇట్లా లాభాలు పడిపోవడాన్ని కొంతకాలం అరికట్టగలిగినా చివరికి అవి పడిపోవడంమాత్రం తప్పదు. ఇట్లాంటి ప్రమాదం కేవలం వ్యవసాయానికే పరిమితంకాక అన్ని ఉత్పత్తి రంగాలకూ వర్తిస్తుందని రికార్డో విశ్వసించినాడు. కొంతకాలం తరవాత లాభాలు వేతనాలుమధ్య అనులోమానుపాతం ఏర్పడుతుంది (Inverse relationship). మూలధనంకోసం, పరిశ్రమలూ ఉద్యోగావకాశాల మధ్య ఏర్పడే పోటీ ఫలితంగా, మూలధనంపైన వచ్చే రాబడి (Return to Capital)— దీన్నే లాభం అనవచ్చు— క్రమంగా తగ్గుతుంది. ఇట్లా లాభాలు పడిపోవడానికి, జనాభా పెరుగుదల రేటుకంటే మూలధనసేకరణ రేటు హెచ్చుగా ఉండవలసిన అవసరం ఉండదా అనే ప్రశ్న ఎదురౌతుంది. కానీ ఇట్లాంటి ప్రశ్న అతన్ని బాధపెట్టలేదు. ఎందుకంటే లాభాలకు సంబంధించిన అతని సిద్ధాంతం, భూసార విభేద సిద్ధాంతంతోనూ, క్షీణప్రతిఫలసిద్ధాంతంతోనూ ముడిపడి ఉండడం వల్లే. కాబట్టి పెరుగుతున్న జనాభాకు జీవితావసర వస్తువులను ఒనకూర్చడం సాధ్యంకాకపోవడం అనేదే వేతనాలస్థాయి పెరగడానికి బలమైన కారణం అని అతని వాదం. ఈ వాదమే అతని ఇతర సిద్ధాంతాలకు—వేతన నిర్ణయ సిద్ధాంతం, మూల్యనిర్ణయ సిద్ధాంతం, భాటకన్నిర్ణయసిద్ధాంతం—దారితీసింది.

### వర్గ సంఘర్షణ:

భూస్వాములకు శ్రామికులకు మధ్య ఎట్లాంటి వైరుధ్యంలేదు. కారణం, ఆహారధాన్యాల ధరల కనుగుణంగా మారే కనిష్ఠజీవనానికి తగిన వేతనాలు ఉంటాయి. అందువల్ల భూస్వాములకు హెచ్చు ధరలు లాభదాయకమైనా, శ్రామికులకు అవి నష్టదాయకాలు అవుతాయి. భూస్వాముల శ్రేయస్సు సంఘశ్రేయస్సుకు విరుద్ధం. ముఖ్యంగా భూస్వాములు విలాసాలకు అలవాటుపడిఉంటే ఈ వైరుధ్యం మరింత తీవ్రంగా ఉంటుంది. సంఘపు పురోగమనం పంచితధనం (Accumulation) పై ఆధారపడిఉంటే ఆ ధనాన్ని దుబారాచేసేవారంతా సంఘానికి శత్రువులే అవుతారు.

ఇట్లే ధనికవర్గానికి (Capitalists) భూస్వాముల వర్గానికిమధ్య గూఢమైన వైరుధ్యంలేదు. భాటకం శ్రామికులమధ్య ధనికవర్గంమధ్య పంపిణీ అవుతుంది. ఇందులో శ్రామికవర్గానికి దాని శ్రమకు తగినంత ఆదాయం లభించదు. ఎక్కువభాగం ఏ పనీ చేయని ధనికవర్గానికి లభిస్తుంది. ఇందువల్ల శ్రామికవర్గం పీడితవర్గంగానూ, ధనికవర్గం పీడించేవారి వర్గంగానూ మారుతాయి. ఈ రెంటి మధ్య సంఘర్షణ సహజం, అనివార్యం అవుతుంది. ఇట్లాంటి పోరాటం నిరంతరం జరుగుతూనే ఉంటుందని రికార్డో భావించినాడు. ఈ

విధంగా చెప్పడంవల్ల అప్రయత్నంగానే సామ్యవాదుల వాదానికి రికార్డో దోహదం చేసినాడని చెప్పవచ్చు. దీన్నిబట్టి రికార్డోకు శ్రామిక వర్గంపట్ల అపారమైన సానుభూతి ఉందని పొరబడకూడదు. అతడు ధనిక వర్గ పక్షపాతే. అతని వాదన సామ్యవాదులకు ఉపకరించింది. ఇది అతను అప్రయత్నంగా చేసిందనేదాన్ని మరిచిపోకూడదు:

## రికార్డో అంతర్జాతీయ వాణిజ్య సిద్ధాంతం: (Theory of International Trade)

అంతర్జాతీయ వాణిజ్య సిద్ధాంత వికాసంలో రికార్డో గణనీయమైన కృషిచేసినాడు. భాటకం పెరగడాన్ని అరికట్టి, ఆహారపు ధరలను తగ్గించడానికి స్వేచ్ఛా వ్యాపారమే ఏకైకమార్గమని సూచించి నాడు. ప్రతి ప్రాంతంలోను ప్రత్యేక పరిశ్రమలను స్థాపించడంవల్ల స్వేచ్ఛా వాణిజ్యం అన్నిదేశాల ఆర్థిక ప్రగతికి ఎంతగానో తోడ్పడుతుందని వాదించి నాడు. ఈ సందర్భంలో అతని తులనాత్మక ఉత్పత్తి వ్యయ సిద్ధాంతాన్నికూడా Compaiitive cost Theory) పేర్కొనడం సముచితం. వివిధ దేశాల మధ్య జరిగే వర్తక వాణిజ్యాలలో ఉత్పత్తి వ్యయం ఆధారంగా తమ తమ దేశాల ఎగుమతి దిగుమతులను నిర్ణయించుకోవాలని, ఏ ఏ వస్తువులను దిగుమతి చేసుకొని, ఏ ఏ వస్తువులు తమ దేశంలో ఉత్పత్తిచేసి విదేశాలకు ఎగుమతి చేయడం లాభసాటిగా ఉంటుందో అనే విషయాన్ని స్పష్టంగా సూచించినాడు. ఈ విధానానికి మూలమైంది ఉత్పత్తి వ్యయాల్లో ఉండే విభేదాలే అని అతని వాదం. కాని వివిధ దేశాలలో ఉన్న ఆదాయాల స్థాయి (Income Levels) లే ధరలలో ఉన్న విభేదాలకు ప్రధానమైన కారణమని నవీనులంటారు. ఏది ఎట్లావున్నా రికార్డో వాదన ఆనాటి పరిస్థితుల దృష్టితోచూస్తే ఎంతో సమంజసంగా తోస్తుంది.

ఆర్థికవృద్ధి విషయంలో తలఎత్తిన సమస్యలను పరిష్కరించడానికి విదేశవ్యాపారం ఎట్లా ఉపకరిస్తుందో రికార్డో స్పష్టంగా చూపించినాడు. ఈ సందర్భంలో ఆనాడు ఇంగ్లండులో అమలులో ఉన్న ధాన్యానికి సంబంధించిన - నిబంధనలను (Corn Laws) తీవ్రంగా ఖండించినాడు. అంటే ఇంగ్లండులో ఉత్పత్తిఅయ్యే గోధుమను ఇతర దేశాలకు ఎగుమతి చెయ్యడంలో విధించిన ఆంక్షలను తొలగించాలని అతను గట్టిగా కోరినాడు. ఇట్లాంటి ఆంక్షలవల్ల క్షామంరోజుల్లోనే దేశానికి లాభం ఉండవచ్చుగాని, మిగిలిన సమయాల్లో దేశానికి అపారమైన నష్టం వస్తుందని భావించినాడు. ఇంగ్లండు పారిశ్రామికోత్పత్తికి అధికప్రాధాన్యం ఇస్తూ, దేశానికి అవసరమైన ధాన్యాన్ని విదేశాలనుండి దిగుమతి చేసుకొంటేనే దేశశ్రేయస్సుకు మంచిదని భావించినాడు. ఈ సందర్భంలో తన తులనాత్మక ఉత్పత్తి వ్యయ సిద్ధాంతాన్ని (Compıritive Cost Theory) చేసి తన వాదనను సమర్థించుకొన్నాడు.

ఒకదేశం ఇతర దేశాలతో పోలిస్తే, కొన్ని వస్తువులను తక్కువ వ్యయంతో ఉత్పత్తి చెయ్యగలిగితే వాటినే ఉత్పత్తిచేసి మిగిలిన వస్తువులను ఇతరత్రా సంపాదించుకోవడం లాభసాటి అయినదని ఆడమ్ స్మిత్ సూచించినాడు. ఒక దేశం ఒక వస్తువును తక్కువ వ్యయంతో ఉత్పత్తి చేయగలిగితే దాన్ని విదేశాలకు ఎగుమతిచేసి, ఆ విధంగా వచ్చిన ఆదాయంతో తమకు కావలసిన వస్తువులను విదేశాల నుండి దిగుమతి చేసుకోవడం లాభకరమని పద్దెనిమిదో శతాబ్దం ఆరంభంలో ఎంతరో సూచించినారు. కాని వీటన్నింటినీ రికార్డో రూపొందించినంత స్పష్టంగా వారు చెయ్యలేదనే చెప్పవచ్చు.

ఈ సిద్ధాంతాన్ని ఒక ఉదాహరణద్వారా వివరించినాడు. ఇందులో రెండు దేశాలు—వాటి మధ్య జరిగే వ్యాపారాన్నిగురించి వివరించినాడు. ఇంగ్లాండులో బట్టలనుఉత్పత్తిచెయ్యడానికి అయ్యే వ్యయంకంటే తక్కువ అవుతుందనుకొందాం. పోర్చుగల్ సారానూ చాలా తక్కువ ఖర్చుతో ఉత్పత్తి చెయ్యగలిగిందనుకొందాం. ఆ దేశం, బట్టలనుకూడా ఉత్పత్తి చేయగలిగినా సారానే చౌకగా ఉత్పత్తిని

చెయ్యగలదు. అట్లాంటప్పుడు ఆ రెండు దేశాలూ లాభం పొందాలంటే, ఇంగ్లండు బట్టలనే ఎక్కువగా ఉత్పత్తిచేస్తూ, తనకు అవసరమైన సారాను పోర్చుగల్ నుండి దిగుమతి చేసుకోడం, పోర్చుగల్ సారానే ఉత్పత్తిచేస్తూ తనకు అవసరమైన బట్టలను ఇంగ్లండునుంచి దిగుమతి చేసుకోడం ఉభయులకు లాభదాయకం. ఈ విధంగా చేయడంవల్ల రెండు దేశాలలోను శ్రమ ప్రత్యేకీకరణ, అంతర్జాతీయంగా శ్రమవిభజన (Division of Labour) ఏర్పడ డానికి వీలుంటుంది. రెండుదేశాలు తమదేశంలోని వనరులను ప్రయోజనకరమైన మార్గంలో వినియోగించడానికి వీలుంటుంది. దీనివల్ల రెండుదేశాలూ శీఘ్రంగా పురోగమించడం సాధ్యమవుతుంది. ఈ వాదన ఫలితంగానే ప్రపంచంలోని దేశాలు స్వేచ్ఛా వ్యాపారంవైపు మొగ్గినాయని అంటే అతిశయోక్తి కాదు. రికార్డో ప్రతిపాదనలవల్ల ఆనాడు ఇంగ్లండు ధాన్యానికి సంబంధించి విధించిన ఆంక్షలను వెంటనే రద్దు చెయ్యకపోయినా, తరవాత తరవాత అవి రద్దయిపోవడం, అప్పటినుండి ఇంగ్లండు పారిశ్రామికంగా ముందడుగు వేయడం, చివరికి పారిశ్రామికంగా ఎంతో ప్రగతి సాధించి, ఆ రంగంలో అగ్రగామి అయింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఇంగ్లండు ప్రపంచ కర్మాగారం (Workshop of the world) అయింది.

### ఆర్థికవృద్ధి సిద్ధాంతం:

ఆర్థిక వనరులు కొరతగా ఉండడంవల్ల ఆర్థిక పురోభివృద్ధి కొంతకాలానికి అగిపోవలసివస్తుందనేదే అతని పరిశీలన అంతటిలోను మనకు అగపడే అంశం. తన వాదాన్ని అంతటినీ 1815 లో ప్రచురించిన వ్యాసంలో తెలిపినాడు మొత్తం ఆర్థికవ్యవస్థ నంతా ఒక పెద్దవ్యవసాయక్షేత్రమనీ, అందులో ఉత్పత్తిఅయ్యే ధాన్యం, భూస్వాముల, కౌలుదార్ల, కూలీలమధ్య పంపిణీ అవుతుంటుందని భావించినాడు. మాల్థస్ జనాభా పెరుగుదల విషయంలో ఊహించినట్లే రికార్డో గూడా ఇక్కడ ఊహించినాడు. జనాభా పెరుగుదలకు హద్దు జీవితావసారాలపెరుగుదలే అని దీన్ని బట్టి, కనిష్టవేతనం ఇస్తూ ఎంతమంది శ్రామికులనైనా వినియోగించవచ్చుననేదాన్ని ప్రతిపాదించినాడు. కనిష్టవేతనం ఇస్తూఉంటే శ్రమసప్లై అపరిమితంగా ఉంటుందని అతని భావం. ఇదే కాఠిన్య వేతనాల సూత్రం (Iron Law of wages). ఆర్థిక వ్యవస్థలో పనిచేసే ప్రతిశ్రామికుడు ఒకే రకమైన పనిముట్లను ఉపయోగిస్తాడు. ఇదే అతను ఉత్పత్తి కోసం ఉపయోగించే స్థిరమూలధనం (Fixed Capital). ఇట్లాంటి మూలధనం ఒకే అనుపాతంలో ఉంటుంది. అందువల్ల దీన్ని వారు పండించే ధాన్యంరూపంగా కూడా చెప్పవచ్చు. అంటే అతను ఊహించిన వ్యవస్థలో ఒకే వస్తువు ఉంటుంది. అది అటు ఉత్పత్తిలో మూలధనంగానూ, ఇటు వినియోగంలో వినియోగవస్తువుగాను ఉపకరిస్తుందని భావం. ఒక్కమాటలో చెప్పాలంటే రికార్డోచేసిన విశ్లేషణ అంతా ఒకేరంగానికి చెందింది. (Single good sector Economy). శ్రామికులు పండించే ధాన్యం ఉత్పాదకంగానూ, వినియోగవస్తువుగాను ఉపకరిస్తుంది.

జనాభా పెరిగినకొద్దీ ఉన్న ధాన్యం వారందరికీ సరిపడదు కాబట్టి, అంతవరకు సాగుచెయ్యని భూములను సాగుచెయ్యడంవల్లగాని, సాగులో ఉన్న భూముల్లో అధిక మూలధనము, శ్రమను ఉపయోగించి ఉత్పత్తిని పెంచడంగానీ చెయ్యడం తప్పనిసరి అవుతుంది. ఉన్న భూమిని అధికోత్పత్తికి ఉపయోగిస్తే సాంద్రవ్యవసాయపద్ధతులవల్ల క్రమక్షీణ ప్రతిఫలాలు ఏర్పడడం అనివార్యమవుతుంది. శ్రామికులు ఉత్పత్తిచేసే నికర ఉత్పాదనానికి (Net product) వారికిచ్చే వేతనాలకు (అవి నిలకడగా ఉంటాయి) ఉన్న భేదమే భాటకరూపంలో భూస్వామికి చెందుతుంది. సారవంతమైన భూములను సాగుచెయ్యడానికి రైతులు పోటీపడడంవల్ల భూస్వాములకు అద్దె ఎక్కువ లభిస్తుంది. తగ్గురకం భూములను కూడా సాగుచెయ్యడంలో శ్రామికుల తలసరి నికర ఉత్పత్తి

తగ్గిపోతుంది. కానీ శ్రామికులకు ఇచ్చే అసలు వేతనాలు (Real wages) అట్లాగే ఉంటాయి. అంటే దీనివల్ల శ్రామికుల తలసరి లాభాలు పడిపోతాయి. ఇది ఇట్లా ఉన్నప్పుడు ధాన్యాన్ని ఉత్పత్తి చెయ్యడానికి మూలధనం అధికంగా అవసరమవుతుంది. ధాన్యాన్ని పండించడానికి ఎక్కువ వ్యయం అవుతుందన్నమాట. శ్రామికుల తలసరి అసలు వేతనాలకూ, శ్రామికుల మూలధన నిష్పత్తికి ఉన్న తేడానుబట్టి చూస్తే, మూలధనం పైన వచ్చే రాబడి **(Return on capital)** తగ్గుతూ ఉంటుంది. ఇట్లాంటి పరిస్థితి కొనసాగడం అంటే మూలధన సేకరణ కొంత కాలానికి ఆగిపోతుందనే అర్థమవుతుంది. ఈ వాదనంతాను రికార్డో తరవాతి రచనల్లో మార్పుచేసినాడు. 1815 లో చేసిన పరిశీలన కేవలం ఒక రంగానికి సంబంధించినది మాత్రమే.

అతడు తన రచనలో పరిశీలనను ఒకే రంగానికి వర్తించేది కాకుండా మూడు రంగాలకు వర్తించేవిధంగా మార్చినాడు. రికార్డో రూపొందించిన ఆర్థికవృద్ధి నమూనాను కొంత పరిశీలిస్తాము.

రికార్డో రూపొందించిన నమూనాలో **(Model)** వృద్ధి, ఉత్పత్తి కారకాలలో ఒకటైన భూమివల్ల నిర్ణయమవుతుంది. ఆడమ్ స్మిత్ దేశసంపదను పెంచేదానికే ప్రాధాన్యంఇస్తే రికార్డో పెరుగుదలను గురించి అంత తీవ్రంగా ఆలోచించినట్టు అగపడదు. ఆదాయం ఎట్లా పంపిణీ అయిందో అనేదాన్ని గురించే ఎక్కువగా ఆలోచించినాడు. అంటే ఎక్కువ భూమిని సేద్యయోగ్యంచేస్తేనేగానీ, లేదా ఆహార ధాన్యాలను ఇతర చోట్లనుండి దిగుమతి చేసుకోగలిగితేనేగానీ ఆర్థికవృద్ధిని సాధించడం కష్టమనే అతని భావం.

స్మిత్ భావించినట్లే, రికార్డోకూడా మూలధనాన్ని పొదుపు చెయ్యడంవల్ల ఆర్థికవృద్ధి సాధ్యమవుతుందని భావించినాడు. అయితే ఇట్లా మూలధనాన్ని పోగుచెయ్యడమనేది లాభాలమీద ఆధారపడి ఉంటుంది. లాభాలను వేతనాలస్థాయి నిర్ణయిస్తుంది. వేతనాలు ఆహారధాన్యాల ధరలమీద ఆధారపడి ఉంటాయి. ఆహారధాన్యాల ధర సేద్యయోగ్యమైన భూవిస్తీర్ణంమీద ఆధారపడి ఉంటుంది, లేదా ఆహారధాన్యాల దిగుమతిమీద ఆధారపడి ఉంటుందని భావించినాడు.

లాభాలు శ్రమసప్లైమీద, అనుసరిస్తున్న ఉత్పత్తి పద్ధతులమీద ఆధారపడి ఉంటాయన్నది మరొకవాదం. అంటే నికరమైన పెట్టుబడి **(Net Investment)** పెరుగుతున్న మూలధన రాశికి సమానంగా ఉంటుంది. జనాభా పెరిగేకొద్దీ వ్యవసాయరంగంలో ఉత్పత్తి క్షీణిస్తుంది. కానీ సాంకేతిక రంగంలో వచ్చేమార్పుల ఫలితంగా పారిశ్రామిక ఉత్పత్తిరంగంలో ఉత్పత్తి పెరుగుతుంది. అంటే జనాభా పెరుగుదల, సాంకేతిక విజ్ఞానంపెరుగుదలమధ్య జరిగే పరుగుపందెంలో మొదట్లో సాంకేతిక రంగందే పైచెయ్యి అయినా చివరికి జనాభా పెరుగుదలే అధిగమిస్తుంది. ఇట్లాంటి వాదనే నిరాశాజనకమైన స్థితి ఏర్పడుతుందన్న భయాందోళనలకు దారితీసింది. లాభాలు, సాంకేతికస్థాయి, శ్రామికవర్గపు పరిమాణంమీద ఆధారపడి ఉంటాయన్నదాన్ని సంకేతాలలో కింది విధంగా చూపవచ్చు.

$$R = R(T, L)$$

ఆర్థిక వ్యవస్థ పెరుగుదల విషయంలో ఆంతరంగికంగా ఏర్పడిన చిక్కులను పరిష్కరించడానికి అంతర్జాతీయ వ్యాపారంలో దేశం అనుసరిస్తున్న విధానాలలో మార్పులను సూచించినాడు. స్వేచ్ఛా వ్యాపారంవల్ల ఈ సమస్యలను పరిష్కరించవచ్చని అతని వాదం. ఈ సందర్భంలో అతను సూచించిన తారతమ్య ఉత్పత్తి వ్యయ సిద్ధాంతం ముఖ్యంగా చెప్పవచ్చు.

**విమర్శ :**

పరిమిత అనువర్తనం (Application) ఉన్న విషయాలనుకూడా అన్నింటికి వర్తించే సూత్రాలుగా ప్రతిపాదించడం రికార్డో విశ్లేషణలోని ప్రధానమైన

లోపం. అట్లాంటి సూత్రాలకు కొన్ని ప్రాతిపదిక సిద్ధాంతాలు (Postulates) ఆధారం. అతని భూసార విభేద సిద్ధాంతాన్ని తీసుకొందాం. ఆ సిద్ధాంతానికి మూలమైన ప్రమేయాలు కేవలం, భూమి పరిమితంగా ఉండడం, దాని సారంలో తరతమభేదాలు ఉండడం, సారవంతమైన భూమి కొరతగా ఉండడం. కానీ అతని సిద్ధాంతం వాస్తవమైంది కావడానికి మరి కొన్ని మూలసిద్ధాంతాల (Postulates)ను అంగీకరించడం అవసరం. అవి: భూమిలో పండే పంట జీవిత కనీస అవసరాలకు మించి వస్తుందనీ, వ్యవసాయ రంగంతో క్రమక్షీణ ప్రతిఫలాలు ఏర్పడతాయనీ, శ్రమ ఉత్పాదకత ఒకే రకంగా ఉంటుందనీ, ఆస్తి హక్కులకు సంబంధించి ఇంగ్లండులో ఉన్న పద్ధతులే సర్వత్రా ఉంటాయనేవి. ఇవి అన్నిచోట్ల ఒకేవిధంగా ఉంటాయనేది సంశయాస్పదమైన విషయం. ఆనాడు ఇంగ్లండులోఉన్న అర్థిక సాంఘిక వ్యవస్థ, పారిశ్రామిక ఉత్పత్తి విధానాలు, మానవుల స్వభావాలు ప్రపంచం అంతటా అదేవిధంగా ఉంటాయని నమ్మినాడు. జనాభా ఎప్పుడూ పెరుగుతూ ఉంటుందనీ, ఇట్లా పెరుగుతున్న జనాభా, పరిమితంగా ఉన్న సహజమైన వనరులపైన—ముఖ్యంగా భూమిపైన—ఒత్తిడి అధికమై, జనాభాకు అవసరమైన ఆహారధాన్యాలలో కొరత ఏర్పడుతుందని భావించినాడు. కానీ, జనాభా పెరుగుదల తగ్గవచ్చనీ, ప్రజల ఆహారపు అలవాట్లలో మార్పు రావచ్చనీ, వ్యవసాయరంగాన్ని విస్తృతపరచడం సాధ్యమని, వ్యవసాయరంగంలో సాంకేతిక పద్ధతులను అనుసరించడంవల్ల అధికోత్పత్తిని సాధించవచ్చని ఊహించలేక పోయినాడు. భూమికిఉన్నశక్తి మౌలికమైనటువంటిది; నాశనం చెయ్యడానికి వీలు లేనటువంటిది అని అనడం అతనికి వ్యవసాయం విషయంతో ఏమీ తెలియదనే అని కొందరు అంటారు. భూమి కోతవల్ల (Soil erosion) దెబ్బతింటుందనీ; కొంతకాలానికి భూమి నిస్సారమయ్యే అవకాశం ఉంటుందనీ అతను ఊహించ లేకపోయినాడు. శ్రమ, మూలధనాలను భూసారాన్ని ఎక్కువ చెయ్యడానికి ఉపయోగిస్తారనే దాన్ని గుర్తించలేక పోయినాడు.

అంతేకాదు; ఉన్న భూముల్లో ఎక్కువ దిగుబడిని ఇచ్చేపంటలను పండించి, ఆ పంటను ఇతరదేశాలకు ఎగుమతి చేయడంవల్ల వచ్చిన ధనంతో తమ దేశ ప్రజలకు కావలసిన జీవితావసరాలను సంపాదించుకోవచ్చు ననేదాన్నిగూడ రికార్డో గ్రహించలేదు. ప్యూర్టరికో (Puerto Rico) దేశాన్ని ఈ సందర్భంలో ఉదాహరణంగా సూచించవచ్చు. ఆ దేశంలో పండిన చెరకు పంటలో కొంతభాగాన్ని అమ్మితేచాలు ఆ దేశవాసులకు అవసరమైన వస్తువులను కొనడానికి అవసరమైన ధనం సంపాదించవచ్చు. అంతేకాదు; ఎగుమతి చెయ్యడంలో ఈనాడు ప్రవేశపెట్టబడిన కొత్తకొత్త పద్ధతులవల్ల నశ్వర వస్తువులైన (Perishable goods) మాంసం చేపలు మొదలైనవానిని నిలవ చేసి, ఎగుమతి చెయ్యడానికి Refrigerated నౌకల్లో ప్రపంచంలో ఏ మూలకైనా తీసుకుపోవడానికి వీలుపడుతోంది. ఇది సాధ్యమయినందువల్ల ఏ దేశం కూడా బాధలకు గురికానవసరం ఉండదు. ఈ సందర్భంలో న్యూజిలాండును చూపవచ్చు. ఆ దేశం, మాంసం, వెన్న చెడిపోకుండాఉండడానికి Refrigerated నౌకల్లో ఇంగ్లండుకు సులభంగా సరుకును ఎగుమతి చెయ్యగలుగుతోంది. ఈ విదేశీవ్యాపారంవల్ల ఎంతో ధనాన్ని సంపాదించుకో గలుగుతోంది.

వర్గ సంఘర్షణ అనివార్యమని రికార్డో వాదించినాడు. వ్యక్తిగత ఆస్తి హక్కులవల్లే దేశం పురోగమించగలదని అతని విశ్వాసం. కానీ ఈ నాడు ఇందుకు భిన్నంగా ఉన్న ఎన్నో ఆర్థిక వ్యవస్థలను చూస్తున్నాము.

ప్రాచీన సంప్రదాయత్రయంలో రికార్డోయే ప్రముఖుడని చెప్పవచ్చు. ఆర్థిక శాస్త్రానికి ఒక ప్రత్యేక గౌరవాన్ని సంపాదించినవాడు రికార్డోయే. అంతవరకు అర్థిక రాజకీయ శాస్త్రంగానే వ్యవహరిస్తూవచ్చిన శాస్త్రాన్ని స్వచ్ఛమైన అర్థశాస్త్రంగా రూపొందించిన ఖ్యాతి రికార్డోకే దక్కుతుంది. అతని విశ్లేషణ భావితరాలవారికి ఉత్తేజాన్ని కలిగించిందంటే అతిశయోక్తి కాదు. వర్గ సంఘర్షణకు సంబంధించి రికార్డో చేసిన వాదన సామ్యవాదులకు ఎంతగానో ఉపకరించింది. క్రమంగా లాభాలు 'పడిపోతాయనే (Falling profits) వాదనను సామ్యవాదులు చక్కగా ఉపయోగించుకొన్నారు.

# గుర్తు

శ్రీమతి ఆర్. వసుంధర

మంచి ఖరీదైనది ఎరుపురంగు వెంకటగిరి జరీ చీరె, అదేరంగు లిప్‌స్టిక్ గోళ్లరంగూ, కెంపులూ ముత్యాలూ కలిసిన సొమ్ములూ, మాక్స్ ఫాక్టర్ మేకప్—ఆడంబరం లేకుండా ప్రత్యేకంగా కనిపిస్తోంది కళావతి. అప్పటికంటె బహుకొద్దిగా లావైనా, అప్పటి 'బాపూ బొమ్మ' రూపం మారలేదు. పదిహేనేళ్లక్రితం తామిద్దరూ కలసి చదువుకున్నప్పటికంటే కొద్దిగా తెల్లబడటం, మొహం కొంచెం కోలగా తీరటం తప్పించి కళావతిలో మార్పు కనిపించలేదు నళినికి. అప్పటిలాగే ప్రతి చిన్న విషయం గురించి శ్రద్ధ తీసుకుని తనకు ముఖ్యమైన అభిరుచుల్ని అలాగే నిలుపుకున్నదన్న మాట!

విశాఖలో చదువుకొంటున్నప్పుడు కాలెజ్‌కి బస్సువెళ్లే దోవ చాలా అందంగా ఉండేది. నీలమైన ఆకాశంక్రింద ఈ ప్రక్కా ఆ ప్రక్కా పల్లటి కొండలు. కొండలమధ్యన ఎగుడు దిగుడుగా మెలికలు తిరుగుతూపోయే రోడ్డు. చల్లని సముద్రపు ఉప్పు గాలికి ఒళ్లంతా బంకా, తడీ. ఎంత దూరం పోయినా అదే అందం. ప్రకృతిలోని ఆనందంలోకి ప్రయాణం అది.

ఈ కొండమీదొకటీ ఆ కొండమీదొకటీ బంగళాలుండేవి.........కొండ ఒంపుల్లో ఒదిగి, ఎత్తుమీద ఒంటరిగా, విశిష్టంగా, అందంగా,ఆనందంగా. ఒక దానిపేరు డవ్స్‌నెస్ట్. ఇంకో దానిపేరు పిజన్స్‌నెస్ట్.

బస్సులోని రణగొణ ధ్వనితో సంబంధంలేకుండా బయటకు చూస్తూ ప్రక్కప్రక్కనే కూర్చునే వాళ్ళు తామిద్దరూ సాధారణంగా.

'పెళ్లయ్యాక నేను ఆ డవ్స్‌నెస్ట్‌లోవుండే మేనేజరుగారి భార్యలా ఉంటాను నళినీ' అన్నది కళావతి ఒకసారి.

ఆ మేనేజరుగారి భార్య చాల అందంగా ఉండేది. అందమైన ఎంబ్రాయిడరీలు, పెయింటింగ్ చేసేది. ఒకసారి మాకు అందమైన డిన్నర్ యిచ్చింది. ముచ్చటైన పిల్లలిద్దరున్నారు ఆమెకు.

కళావతి మాటలతో యీ లోకంలోకి వచ్చింది నళిని.

'ఇంతసేపట్నుంచీ ఇదా నీవు ఆలోచిస్తున్నది! ఎప్పుడూ నీకు ఎలా వుంటే బాగుంటుందన్న ఆలోచనే' అన్నది నవ్వుతూ కించిత్తు విసుగుతో.

కళావతి యిదే విషయాన్ని రెండు మూడు సార్లు చెప్పింది తరువాత. తాను ఎలా ఉండాలో, ఎలా కన్పించాలో, ఎలా డ్రెస్ చేసుకుని ఎలామాట్లాడి ఎలా మాట్లాడి ఎలాంటి అభిప్రాయం ఎదుటి వాళ్లలో కలిగించాలో కళావతికి స్పష్టంగా తెలుసు. సినిమాకు వెళ్లాలన్నా షికారు వెళ్లాలన్నా రోజూవెళ్లే కాలేజికి వెళ్లాలన్నా ఏ విధంగా ముస్తాబుకావాలో నిశ్చయించుకొని ఆ ముస్తాబులోని అన్నిభాగాలూ అనుకున్నట్లుగా పూర్తి చేసుకోవడానికి గంటపట్టేది కళావతికి. నళినికి అలాంటి శ్రద్ధలేదు. ఫలానావిధంగా కన్పించాలన్నా నిర్దిష్టమైన అభిప్రాయం ఉండేదికాదు. అలాంటి ఊహాచిత్రం కలిగి ఉండటం హాస్యాస్పదం అనుకునేది. అది మనసులోని శూన్యతకు పరిమితత్వానికి చిహ్నం అనిపించేది...కాని చిత్రమేమిటంటే కళావతి కాలగమనంతో మారకుండా విరుగు తరుగులు లేకుండా చెక్కుచెదరకుండా ఉండిపోయింది. అనుకున్న దాన్ని సాధించగలిగింది. డబ్బుగల భర్త, ఇద్దరు ముచ్చట

గోలీపేపిల్లలూ, కారూ, మేడా, ఆల్సేషియన్ కుక్కా... చిత్రంలోని భాగాలన్నీ యథార్థాలై నిలిచాయి.

నళిని భర్తకు ట్రాన్స్‌ఫర్అయి వారం రోజుల క్రితం ఆ పట్టణానికి వచ్చారు. ఒక పెద్దమేడలో ఒక భాగం అద్దెకు తీసుకున్నారు. మిగతా ఇంట్లో సొంత దారులే ఉంటున్నారు. ఇంటి వెనుక భాగంలో పని మనిషి పనిచేసే కొళాయీ, వెనుక తోటా రెండు భాగాలకూ కలిసి వున్నవి. ఆ ఇంట్లో చేరిన మూడో రోజు సాయంత్రం వెనుక భాగంలో నిలుచున్న నళినిని చూచి గుర్తించి ఆనందంతో పలకరించింది కళావతి. ఆమే ఇంటి యజమానురాలు. ఏమీ తోచనప్పుడు 'తోడు'కోసరం అద్దెకిచ్చారట మా భాగం ఇల్లు. 'అద్దెకివ్వటం'కూడా కళాత్మకంగా ఉండొచ్చు!

పదిహేనేళ్ళక్రితం ఇద్దరూ మంచి స్నేహి తులు. సాహిత్యంలోని అభిరుచివలన దగ్గరై, చదువు కున్న మూడేళ్ళూ కలిసి ఉన్నారు.

ఇన్నేళ్ల తర్వాత కళావతితో పోల్చి చూసుకున్న నళినికి కించిత్తు న్యూనతా భావం కలిగింది. తనకీ కళావతికీ ఎంత భేదం! నాజూకైన తన శరీరం లావై ఆకృతిని కోల్పోయింది. తనకూ డబ్బూ కారూ కావలసినవన్నీ ఉన్నాయి. కాని అవి కళావతికిలాగా తనకు తృప్తినివ్వలేక పోతున్నాయి. ఉండీ లేనివైపోతున్నాయి. ప్రతివిషయాన్నీ అల్పమని త్రోసిపుచ్చే మనసు ఏ పనినీ సరిగా చేయనివ్వదు. ఇల్లు శుభ్రంగాసర్దుతూ 'శుభ్రతలో ఏమున్న'దనుకొంటుంది. వంటచేస్తూనే 'ఆ, పాడు తిండి' అనుకొంటుంది. ఫలితంగా ఇల్లు వంట రూపము — ఏదైనాగాని అను కున్నట్లుగా కళాత్మకంగా దిద్దుకోలేని నిస్సత్తువ ఆవరించింది. ప్రాణసములనుకున్న భర్తా పిల్లలూ దగ్గరఉండీ దూరంగా ఉన్నట్లు కన్పిస్తున్నారు. భార్యగా తల్లిగా నిర్వర్తించవలసిన బాధ్యతలు ఒక మూసలో కట్టివేసి ఇరుకున పెడుతున్నట్లున్నాయి. కాలం అంతా గడచిపోయినట్లు, భవిష్యత్తు అనేది లేనట్లు, తాను చెయ్యవలసినపని ఏమీ మిగలనట్లు మనసులో శూన్యత నిండిపోయింది. తాను ఏమి సాధించింది? దేన్ని నిలుపుకున్నది? దేన్ని నమ్మింది? ఎటుచూసినా సమాధానంలేని ప్రశ్నలు. కారణం తెలియని నిర్వేదం.

కొమ్మ చివర్న విచ్చిన ఎర్రగులాబీ పుష్పంలాగా అందంగా నిలుచుని ఉన్నది కళావతి.

'నిన్నుగురించి నేను ఎన్నోసార్లు అనుకున్నాను నళినీ...అప్పటిలాగే ఉన్నావో, ఏమైనా మారి పోయావోనని...కొద్దిగా, చాలా కొద్దిగా లావయ్యావు...' కళావతి కళ్ళు నళినిని ఆప్యాయంగా తడిమాయి.

నళినికి చీకాకు కలిగింది.

'కొద్దిగా ఏమిటీ...చాలా లావయ్యాను' అన్నది.

కళావతి నవ్వింది, చిన్న వెండిగంట మ్రోగి నట్లుగా.

ఆ నవ్వుచూచి నళినికి మరింత చీకాకు వేసింది. అంతలోనే తమాయించుకొని 'కళావతిని చూసి నేను అసూయ పడుతున్నానా? ఎందుకు?' అనుకుంది. పదిహేనేళ్ల క్రితం ఎలా ఉన్నదో యిప్పుడూ అలానేఉన్నది కళావతి. అప్పుడు కళావతిని చూచి అసూయ చెందకపోగా విసుక్కున్నది. అల్ప మైన విషయాలకు అతిముఖ్యమైనట్లు విలువ నిస్తుందని లోతులేనివ్యక్తి అనీ అనుకున్నది. ఇప్పుడు ఆ అల్పమైన విలువలుకూడా తనకు లేనందుకు నిస్పృహ కలుగుతోంది. ఆమార్పు కళావతిలో వచ్చిందికాదు. తనలో కలిగినదే! అప్పుడు తనకు నిండుదనాన్నీ సంతృప్తినీ విశిష్టతనూ ప్రసాదించిన కారణం యిప్పుడు లుప్తమై కనుమరుగై పోయిన కారణం...అదేమిటి?

కొంచెంసేపు అలానే నిల్చుండిపోయింది నళిని: మనసు గతంలోనికి వెళ్లిపోయింది. క్రమంగా ఆనాటి రూపం ధరించింది.. నాన్నగారు, అమ్మ, చెల్లెళ్ళు— ముఖ్యంగా నాన్నగారు—తప్పొప్పులకూ మంచి చెడ్డ లకూ అతీతంగా, ఒకానొక దివ్యమైన ప్రేమ భావంలో, అది ప్రసాదించే ఆనందంలో, అందరు ఒకటిగా...ఆ తృప్తిలో తనొక విశిష్టమైనదాన్నన్న అహంకారం, మిగతా అన్నివిషయాలూ అల్పమైన వన్న నిరసన...ఏదైనా చెయ్యాలి, సాధించాలన్న అవ సరంలేదు. ఏ బాధ్యతాలేదు...'నేను' ఉండటమే ఆనందం... జీవితం అనేదీ దానికి సంబంధించిన విలువలూ అన్నీ నిస్సారంగా, పరిమితమైనవిగా తోచాయి. ఆ ఆనందం, ఏకత్వం అనేవి సత్యమూ శాశ్వతమూ అవునా? అన్న ప్రశ్న తోచలేదు. అసలు ఏ సందేహానికీ అవసరం కలుగలేదు అప్పుడు...

ఇద్దరూ అలా నిలుచునిఉండగానే పనిమనిషి వచ్చింది. రెండు స్టీలుగిన్నెలు ఒకే ఆకారంలో ఉండేవి పట్టుకొచ్చింది. ఒకటి రెండోదానికంటే కొద్దిగా పెద్దది.

'అమ్మా, వీటిలో ఒక గిన్నె మనదీ, యింకోటి మూడోయింటివాళ్ళదీను. అన్నం తీసుకుపొయ్యాను. రెండూ కలిసిపోయినై, గుర్తుల్లేవు. మనదేదో తీసుకోండి' అన్నది.

నళిని రెండు గిన్నెల్నీ చూచింది. రెండూ ఒకటిగానే కనిపించాయి. తనదేదో గుర్తించలేక పోయింది.

'మావి పదేళ్ళక్రిందటకొన్న బరువుగిన్నెలు,' అంటూ రెంటినీ చేతిలోకి తీసుకుని చూచింది. రెండూ బరువుగానే వున్నై. కొంచెం ఎక్కువ బరువుగావున్న పెద్దగిన్నెను చేతబట్టుకొని 'ఇదే ఉండొచ్చు' అన్నది.

'నిన్న పనిమనిషి కడుగుతూంటే మీ గిన్నెలు చూశాను, నళినీ. ఆ చిన్నది మీది...నీ చేతిలో ఉండేది కాదు' అన్నది కళావతి మెల్లగా, నాజూగ్గా.

నళిని మరోమాటు గిన్నెల్ని చూచింది. ఆ చిన్నగిన్నె మరీ చిన్నదిగా తమది కానట్లుగా కనిపించింది.

'మాది అంత చిన్నగిన్నెకాదే' అన్నది.

'అవును, నళినీ' అన్నది కళావతి సుతారంగా.

నళినికి కోపం వచ్చింది. 'నా వస్తువుల సంగతి నాకంటే తనకే ఎక్కువ తెలుసు ననుకుంటుం దేవిటి! నేను బి. ఏ లో ఫస్ట్‌క్లాస్; తాను థర్డ్‌క్లాస్' అనుకుంది. ఎల్లాగైనా ఏది ఏ గిన్నో కనిపెట్టాలి, తన తెలివితేటల్ని తన అస్తిత్వాన్ని నిరూపించుకోవాలన్న ప్రయత్నంలో గిన్నెల్ని పరిశీలనగా చూసింది. రెండూ శుభ్రంగా తళతళా మెరుస్తూ కనిపించాయి

మరింత తీక్షణంగా చూసింది నళిని రెండూ మరింత తళతళా మెరిశాయి. చూచినకొద్దీ పరిమాణంలోని భేదంకూడా మరుగునపడిపోయి రెండూ విడివిడిగా కాకుండా ఒకటిగా ఒకే మెరుపుతో ధగధగలాడాయి...అంతా అపరిమితమైన అనంతమైన తళతళ్లాడే స్టీలు...

నళిని మనసు శూన్యం అయిపోయింది.

తళతళ...మిలమిల...మిలతళ...తళతళ...

ఏ గిన్నె అయితేనేం? అనిపించింది.

'మా గిన్నెలన్నీ ఒక సెట్టులోనివి. ఒకదానిలో ఒకటి సరిగ్గా ఇముడుతాయి'అంటూ రెండు గిన్నెల్నీ లోనికి తీసుకువెళ్ళి పరీక్షించింది! చిన్నగిన్నే తనది. కళావతి చెప్పిందే నిజం.

పెద్దగిన్నె తెచ్చి ఇచ్చివేసింది. వాళ్ళిద్దరి మొహాల్లోనూ నవ్వు కనిపించింది. 'సొంతగిన్నెను గుర్తించుకోలేని వెర్రితనం చూడు' అన్నట్లుంది ఆ నవ్వు.

కాని నళినికి అదేమీ పట్టలేదు. ఇందాకట్నుండీ మనసును ఆక్రమించుకొన్న ఆలోచన సాగి మళ్ళీ ఆ రోజు గుర్తుకొచ్చింది...దూరాన ఎక్కడో నాన్నగారు పోయారు. ఆయన ప్రాణవాయువులు అనంతవాయువులో కలసిపోతుంటే, అంతటి వాత్సల్యానికిమూలంగా తోచిన ఆ శరీరం అగ్నికాహుతియై నశించిపోతుంటే, అదేమీ ఎరక్కుండా హాయిగా స్నేహితులతో కాలం గడిపింది! దివ్యంగా భాసించిన ఆ ప్రేమ మండి బూడిదైపోతుంటే తన కెందుకు తెలియలేదు? తెలియకపోవడం ఎలా సంభవం? ఏ కొంచెంగానైనా తెలిసిందేమో, ఏ సూచనైనా అందిందేమోనని ఆనాటి సంఘటనల్ని ఎన్నోసార్లు తరచితరచి చూచుకున్నది.

ఎంతగా పరిశీలించినా ఏమీ కనిపించలేదు. 'ఆ ప్రేమకు అస్తిత్వంలేదు. ఉంటే యిలా జరుగదు! అశాశ్వతమైనదాన్ని శాశ్వతం అనుకున్నాను. పరిమితమైనదానికి అపరిమితత్వాన్ని ఆపాదించుకున్నాను. ఎందుకో వుత్తభ్రమలో పడిపోయాను' అనుకున్నది. ప్రపంచం శూన్యంగాతోచి నిస్పృహ కలిగింది...

...కాని, తన అనుభవం...అప్పుడు తనలో నిలిచిన నమ్మకం...అవి ఎక్కణ్నుంచీ వచ్చాయి? అవి నిజం కాదా?...అంతా అయోమయం అయిపోయింది నళినికి...

"ఈ సారి గిన్నెలన్నిటిమీదా పేరు వేయించాలి' అన్నది ప్రకాశంగా.

పేర్లతో ఏర్పడ్డ పేర్లు నిండిన ప్రపంచంలో పేరు లేనిది ఉంటుందా? ఉంటే గుర్తించటం సాధ్యమా?

# కవిత్వంలో అస్పష్టత

శ్రీ కాళూరి హనుమంతరావు

"గంగిగోవుపాలు గరిటెడైనను చాలు
కడివెడైననేమి ఖరముపాలు
భక్తిగల్గు కూడు పట్టెడైనను చాలు
విశ్వదాభిరామ వినురవేమ."

ఈ పద్యం స్పష్టంగా ఉంది.

'ఖనటత్ పయోఒబ్ధి వీక్ష్యరసాతలాన్వ్యస్య
పిండీకృతాంగ భీతాండజములు...'

ఈ పద్యం అంత స్పష్టంగాలేదు. కొంచం క్లిష్టంగా ఉంది. ప్రతిపదార్థాన్ని చూసుకొని ఆలోచించి సమన్వయం చేసుకొన్న తర్వాతగాని అర్థమవడంలేదు. ఈ పద్యం తెలుసుకొందుకి చాలా భాషాజ్ఞానం అవసరం.

"కొందరు పచా ద్యజంతం
బందురు మరికొంద రర్మఆద్యంతంబే
అందురు మే ముభయుంబని
అందుము నీ నామధేయ మానందనృపా!"

అన్న తిరుపతివేంకటకవుల పద్యం వ్యాకరణం తెలుస్తే తప్ప అర్థంకాదు.

"తస్మిన్కాలే జలద యది సా లబ్ధనిద్రాసుఖాస్యా
దన్వాస్యైనాం స్తనిత విముఖో యామమాత్రం సహస్వ"

అన్న మేఘసందేశ శ్లోకంలో "యామమాత్రంసహస్వ" అనడంలో కవి హృదయం మల్లినాథసూరి వ్యాఖ్య చదివాక తెలుస్తుంది. జ్యోతిషవేదాంతాది శాస్త్ర విషయా లెన్నో మన ప్రాచీనకావ్యాలలో ఉన్నాయి. మల్లినాథసూరి, వేదం వేంకటరాయశాస్త్రి ప్రభృతుల పండితోత్తముల వ్యాఖ్యానాలు మనకి ఆయా విషయాలను తేటతెల్లం చేస్తున్నాయి. వీరి వ్యాఖ్యానాలు లేకుంటే మన ప్రాచీనకావ్యాలలో ఎన్నో గంభీర విషయాలు మనకి తెలియకపోయేవి.

"అయిదు నైదు నైదు నైదింట జేకూడు
మూడు మూటజేరి మరియు నొకటి
మురిసిన సకలంబు మోహించి యుండురా
విశ్వదాభిరామ వినురవేమ."

అన్న పద్యం ఆ అయిదు, మూడు, ఒకటి ఏవో తెలుస్తేగాని అర్థంకాదు. ఇటువంటి పద్యాలకు తత్త్వసంకేతవివరణాత్మకమైన వ్యాఖ్య ఆవశ్యకం. ఆ సంకేతాలు బోధపడిన పిమ్మట కవి భావం మనకు నచ్చితే దానిని మంచికవిత్వంగా అంగీకరిస్తాము. ఇదే తీరున నేటి అభ్యుదయకవుల కవిత్వం తెలియడానికి మార్క్సు సిద్ధాంతాల జ్ఞానం అవసరం.

పై ఉదాహృతులలో అస్పష్టత కవి భావానికి చెందినదికాదు. కవి భావం స్పష్టంగానేఉంది. తద్వ్యక్తీకరణలో కొంత అస్పష్టతఉంది. వ్యక్తీకరణలోని అస్పష్టత తొలగగానే భావం స్పష్టంగా భాసిస్తున్నది. అనేక దశాబ్దులుగా ఆంధ్ర కవిత్వంలోనూ విశ్వకవిత్వమంతటానూ అస్పష్టత ఎక్కువగా ఉంటున్నది. ఆధునికయుగంలో మార్మిక కవిత్వం, ప్రతీకకవిత్వం ఎక్కువ కావడం; ఆ మార్మికతా, ప్రతీకలూ పఠితలకు సన్నిహితములుకాక దురూహములు కావడం ఈ అస్పష్టతకు కారణం.

కవిత్వంలో అస్పష్టత రెండు విధాలు. ఒకటి కవి భావం అస్పష్టం కావడం, రెండవది ఆ భావ వ్యక్తీకరణం అయోమయంగా ఉండడం.

"ఎర్ర శాలువ కప్పుకొని మా
ఇంటి కొచ్చిం దొక రివాల్వర్

బాధలో బెంగైను సీసా
ప్రేమలో గ్రైమాను రాణి?"

అన్న శ్రీశ్రీ గారి పద్యంలో వ్యక్తీకరణ స్పష్టం గానే ఉన్నా అసలు అభిప్రాయ మేమిటో తెలియడం లేదు.

"ఎవరోహో! ఈ నిశిథి నెగసి నీడవోలె నిలిచి
పిలుతు రెవరొ, మూగకనులు మోయలేని చూపులతో
ఎవరోహో! ఎవరోహో!
ఇప్పుడా నను పలుకరింతురు;
మోయలేని సిరవగళమున జరించు కోరికతో
ఇపుడా నను బలుకరింతురు:
ఎవరని ఈ రేయి నిదుర హృదయముదర,
వేయి చేయి
చాయలాడ పెనుచీకటి సైగలతో నా కన్నుల
రక్తమురల లాగికొందురు:
ఎవరో, నా హృదయనాళమేలా తునియలుగా నా
నిర్జీవపు జీవితమ్ము నిట వదులుదురా!
ఎవరోహో! ఎవరోహో!
ఇపుడా నను బలుకరింతురు?'

అన్న కృష్ణశాస్త్రిగారి గేయంలోనూ భావమే అస్పష్టంగా ఉంది. కవి తాను చెప్పవలసింది చెప్పక దాస్తున్నట్లు మనకి మొదటినుంచి చివరవరకు తోచక మానదు. కృష్ణశాస్త్రిగారి ఇతర పద్యాలలోని విషాదం మనకు పరిచితమైనదికనుకా, 'నిర్జీవపు జీవితము, హృదయనాళము తునియలు, కన్నుల రక్తమురల' మొదలైన మాటలవలనా ఈ గేయం మనలో విషాదం కలిగిస్తున్నది. కాని కవి దుఃఖానికి కారణం ఏమిటో, ఆ 'ఎవరు' ఎవరో గేయంఅంతా చదివినా తెలియడంలేదు. కవి ఎందుకో దుఃఖి స్తున్నాడుఅని మాత్రమే మనకు తోస్తోంది. కవి తాను చెప్పవలసిందేదో తానే నిశ్చయించుకొనకపోవడం వలన పద్యం అస్పష్టమయింది. Dylon Thomas రచించిన ఈ పద్యఖండం చూద్దాం:

"Because the pleasure-bird whistles
after the hot wires,
Shall the blind horse sing sweeter?
Convenient bird and beast lie lodged
to suffer
The supper and knives of a mood."

Henry Treece అన్న విమర్శకుడు ఈ పద్య భావాన్ని ఇలా ఊహించాడు: "Because a lark sings sweetly when it is blinded (a well-known practice), may we expect a horse to change its nature and to sing, if deprived of its eyes? This bird and this beast I take as examples, because they are convenient to my purpose; they are the food for thought on which I exercise the sharp knife of my present mood." ఈ భావాన్ని కవి స్పష్టంగానే చెప్పగలిగిఉండును; కాని పట్టుబట్టి వ్యక్తీకరణను అయోమయంచేసి పద్యం అస్పష్టం చేశాడు.

కవిత్వంలో అస్పష్టత వాంఛనీయమైన గుణమే అని కొందరి అభిప్రాయం.

'............ఏదియో అపూర్వ మధుర
రక్తి స్ఫురియించుగాని అర్థమ్ముకాని
భావగీతమ్ములవి............'

అని కృష్ణశాస్త్రిగారు భావకవిత్వలక్షణాన్ని సూచించారు. పద్యంలో అర్థం అప్రధానమనీ, మంచి కవిత్వం అర్థం కాకుండానే శ్రోతచేత అనుభూత మవుతుందనీ ఆధునిక విమర్శకులు కొందరు అభిప్రాయపడుతున్నారు. అస్పష్టతకు అనిర్వచనీయత అన్న గంభీరమైనపేరు పెడుతున్నారు. T. S. Eliot కవిత్వంలో అర్థానికి అప్రాధాన్యాన్ని సూచిస్తూ ఇలా అన్నాడు: "The chief use of the 'meaning' of a poem, in the ordinary sense, may be to satisfy one habit of the reader, to keep his mind diverted and quiet, while the poem does its work upon him; much as the imaginary burglar is always provided with a bit of nice meat for the house-dog." అని. ఇంకొకచోట ఆయన "If as we are aware, only a part of the meaning can be conveyed

by paraphrase, that is because the poet is occupied with frontiers of cousciousness beyond which words fail, though meanings still exist." అనీ, కవిత్వం "A continual raid on the inarticulate." అనీ అన్నాడు. ఈ అభిప్రాయాలు చర్చనీయాలు.

కవి తన ఉద్విగ్నతని పఠితకూడా ఆ ఉద్విగ్నతకు లోనయేటట్లు మాటలలో తెలియజేసే వ్యాపారం కవిత్వం. అర్థం అప్రధానమూ, అస్పష్టమూ అయితే ఇంక కవి భావాన్ని పఠిత దేనిద్వారా గ్రహించగలుగుతాడు? బుద్ధిఅనే కావలికుక్కకి పడవేసే మాంసం ముక్కవంటిది అర్థమైతే, కవిత్వమనే దోపిడిదొంగ ఇంక దేనిని చక్కబెడతాడు? రామాయణ భారత కావ్యాలలో చాలా శ్లోకాలకు తాత్పర్యాలు వ్రాసి చదువుకొని అందరి కవిత్వాన్ని కొంతవరకైనా అనుభవించగలం. కవిత్వంలో అర్థం అప్రధానమయితే, ఏ కవిత్వాన్నీ ఎవరూ ఎప్పుడూ భాషాంతరీకరణ చెయ్యలేరు. కాని చెప్పుకోదగినన్ని కావ్యాలు అన్యభాషలలో సమర్థంగానో, మూలంకన్నా ఈషద్భిన్నంగానో భాషాంతరీకరింపబడుతున్నాయి.

కాగా, 'కవిత్వం అంతా మాటలలో చెప్పడానికి వీలులేని అనుభూతిని మాటలమధ్య ఇమడ్చడానికి చేసే ప్రయత్నమే అనవచ్చు' అన్న ఎలియట్ అభిప్రాయం క్షోదక్షమమైనదికాదు. అనుభూతి మాటలలో చెప్పడానికి వీలయినది కాకపోతే, ఇంక దానిని గురించి కవిత్వం చెప్పడం అనవసరం. చిత్రలేఖనంలోనో సంగీతంలోనో ఇంక దేనిలోనో భావం ప్రకటింపబడాలి. మాటలలో చెప్పజాలినదికాకపోతే మాటలలో చెప్పడం ఎందుకు ప్రారంభించినట్లు? అనుభూతిని మాటలలో విజయవంతంగా చెప్పగలుగుతేనే కవిత్వ మవుతుంది. ఎంతవరకూ మాటలలో చెప్పగలుగుతే అంతవరకే కవిత్వ మవుతుంది.

మానవుడు తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసే అత్యుత్తమ వాహకం భాష. కనుక మాటలలో చెప్పజాలని అనుభూతిఅంటూ ఉండదు.

'ద్రవ్యం గుణ స్తథా కర్మ సామాన్యం సవిశేషకం
సమవాయ స్తథాఽభావః పదార్థాః సప్త కీర్తితాః.'

(ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, అవయువావయవిసంబంధము, వీటి అభావము—ఇవన్నీ పదముల అర్థములచేత చెప్పవచ్చును) అనీ, ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాంతావయవ తర్క నిర్ణయ వాద జల్ప వితండా హేత్వాభాస చ్ఛల జాతి నిగ్రహస్థానములను షోడశ పదార్థములూ వీటిలోనే అంతర్భవిస్తాయనీ మన ప్రాచీన తార్కికులంటారు.

పదానికీ పదముయొక్క అర్థానికీగల సంబంధం శక్తి. శబ్దం అర్థాన్ని బోధించే ఈ శక్తి బహువిధమైనది.

'శక్తిగ్రహం వ్యాకర ణోపమాన కోశాప్తవాక్యాద్ వ్యవహారతశ్చ
వాక్యస్యశేషా ద్వివృతే ర్వదంతి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః.'

(వ్యాకరణము, ఉపమానము, కోశము, ఆప్త వాక్యము, వ్యవహారము, వాక్యశేషము, వివరణము, విశ్రుతశక్తికపదసాన్నిధ్యము అను ఈ ఎనిమిది ఉపాయములచేతనూ ఈ శక్తి గ్రహింపబడుతున్నదని పెద్దలు చెబుతారు). కనుక శబ్దానికి అర్థాన్ని బోధించే శక్తి అపారమైనది.

'సైంధవాన్ని తీసుకురా' అని రాజుగారు సేవకునికి ఆజ్ఞాపిస్తే వాడు గుర్రాన్ని తెస్తాడు; వైశ్యుడు తన పనివాడితో చెబుతే వాడు ఉప్పు తెస్తాడు. రాజభటుడు ఉప్పునీ, వైశ్యసేవకుడు గుర్రాన్నీ తీసుకువెళ్లరు. రాజుగారైనా భోజనందగ్గర అంటే ఉప్పే తేబడుతుంది. వాచ్యార్థమేదైనా ప్రకరణాన్ని బట్టి విజ్ఞానవంతుడైన శ్రోత వక్త అభిప్రాయాన్ని గ్రహించజాలుతాడు. 'అతడు సత్యహరిశ్చంద్రుడు' అంటే సందర్భాన్నిబట్టి 'అతడు హరిశ్చంద్ర నృపతి' అనో, 'అతడు సత్యసంధతలో హరిశ్చంద్రునంతటి వాడు'అనో, 'వాడు ఒట్టిబూటకం మనిషి'అనో

శ్రోత సులభంగానే గ్రహించజాలుతాడు. 'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి', 'రోజులు దొర్లి పోయాయి', 'వాడు కోపంతో అగ్నిహోత్రమై పోయాడు'—ఇటువంటి ప్రయోగాలు కూడా వ్యవహారాన్నిబట్టి అందరూ తెలుసుకొంటున్నారు. కనుక అభివృద్ధిచెంది సంపన్నమైన భాషద్వారా చెప్పజాలని భావం ఏదీ ఉండదు. ఒకవేళ అంత చెప్పరాని భావ మేదైనాఉంటే, దానినిగురించి కవిత్వం వ్రాయడం తగదు. మాటలలో చెప్పడానికి ప్రారంభిస్తూ ఇది మాటలలో చెప్పరానిది అనడం చల్లకువచ్చి ముంత దాచడంవంటిది.

అయితే, సాధారణంగా కవిత్వం అర్థాన్ని మించిన అనుభూతిని మనలో కలిగించుతున్నట్లు మనం అనుకొంటూఉంటాం. ఉదాహరణకు—

'తత నితంబాభోగ ధవళాంశుకములోని
అంగదట్టపు కావిరంగువలన
శశికాంత మణిపీఠి జాజువారగ కాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్ల
తరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప
ఆలాపగతిజొక్కి అరమోడ్పు గనుదోయి
రతిపారవశ్య విభ్రమము దెలుప......"

పాలగుమ్మి పద్మరాజుగారు 'కవిత్వము—వైచిత్రి' అన్న వ్యాసంలో ఈ పద్యస్ఫురణని ఇట్లా విమర్శించారు.

'నాకు మొదటినుంచీ నోట్లో ఆడేపాదం 'ఆలాపగతి జొక్కి...' అన్నది. ఈ పాదాన్ని ఇప్పు డిప్పుడు విమర్శించుకోగా నాకు తోచిన విశేషం: నేను పాడుకొనేటప్పుడు ప్రతిఇంద్రగణంలోనూ ఆఖరి లఘువుకి ముందున్న గురువు—ఈ పాదంలో ఇంద్ర గణాలన్నీ అయిదు మాత్రల పరిమితిగలవి—ఎంతో దీర్ఘంగా పాడుకోవా లనిపిస్తుంది. అందులో 'రతిపా... రవశ్య'లో 'పా' అంతులేనంత పొడుగ్గా అగు పిస్తుంది. అంటే పాడుకొనేటప్పుడు ఈ పాదం కేవలం సీసపద్యపాదమే కానంతగా పెరిగిపోగల స్వేచ్ఛను ఇముడ్చుకొంది. ఇక్కడ గణాల నిర్బంధాన్ని మించిన స్వేచ్ఛ ఛందస్సులో కవి తీసుకోగలిగాడు. అయినా పాదానికి రాగయుక్తమయిన కొలత ఉంది. రాగతాళాల కలయికఅయిన సంగీతాన్ని, ఆ సంగీతానికి కారణమయిన 'ఇంపుదళుకొత్త వీణ వాయింపుచున్న' వరూధినిని బొమ్మ గీసినట్లు చూపించగల వైచిత్రి బాహ్యంగా ఇంద్రగణాల కూర్పులో ఉంది. వరూధినినీ, సంగీతాన్నీ నేను గుర్తించుకోలేకపోయినా, రాగంయొక్క స్వేచ్ఛనూ, తాళంయొక్క గతినీ ఇముడ్చుకొన్న ఈ పాదాన్ని అర్థం చేసుకోకుండానే ఎన్నోసార్లు చదువుకొన్నాను' అని.

కాని, జాగ్రత్తగా పరిశీలిస్తే చతుర్థపాదంలో కవి భావమే మనచేత 'పా'ని పొడిగింపజేస్తున్నదని అనిపిస్తుంది. 'పా'ని పొడిగింపజేసినశక్తి అర్థానిదే తప్ప ఛందస్సుదికాదు. శక్తి ఛందస్సుదే అయితే, ఈ సగణాలూ దీర్ఘాంతగణాలూ పై పాదాల లోనూ ఉన్నాయి. అక్కడెక్కడా ఏ అక్షరాన్నీ పొడిగించి చదవాలని మనకు అనిపించడంలేదు. 'తత నితం బాభోగ'లో 'బా' ని పొడిగించి చదివి ఆమె జఘనం విశాలమనికాని, 'అంగదట్టపు'లో 'ట్ట'ని నొక్కిపలికి ఆమె బిగువుగా వస్త్రధారణ చేసుకొన్నదనిగాని మనం ఊహించగంలేదు. కనుక ఛందస్సు స్వశక్తిచేత అర్థాన్ని అతిశయింప చేస్తున్న దనే కన్నా, అర్థమే స్వశక్తిచేత ఛందస్సును సరసం చేస్తున్నదనడం సముచితం.

'ఱపాఱడు కుఱుచ చేతులు
నొఱవ శరీరంబుగలిగి యొరులకు జూడం
గొఱగా కుండియు మన్మథు
నొఱపుల బడియెడు నితండు యువతిప్రియుడై'

అన్న మహాభారతపు పద్యంలో లఘ్వక్షరాలూ, శకటరేఫవికృతధ్వనులూ బాహుకుని ఖర్వ వికృతరూపాన్ని స్ఫురింపజేస్తున్నాయని పాటిబండ మాధవ శర్మగారు విమర్శించారు. ఈ స్ఫురణకూడా అర్థం మించి శబ్దంమీదకి ప్రసరిస్తున్నదే తప్ప శబ్దంమించి అర్థంమీదకి కాదు. స్ఫురణ శబ్దానిదే

అయితే, ఇటువంటి పద్యాలెన్నో వున్నాయి. ఉదాహరణకి:

'అతిముతి వ్రేసిన బలకం
గజచిన సైంధవుని యలుగు గని నరసుతు డే
డ్తెఅ ముతిసిన నదిరూపతి
విఱుగుటయును వెస నతండు వెనుకకు విఱిగెన్.

విఱిగినచో నిలువక వెఱ
న్మఱికెం దన రథముమీది కోడితి పోపో
పిఱికి యని పలికి నుఱుముగ
నఱికెం దన్నేన బార్థనందనుడు వడిన్'

(మహాభారతము, ద్రోణపర్వము)

ఈ పద్యాలలో ఖర్వత్వంగాని వికృతత్వంగాని స్ఫురించడంలేదు. అయితే ఈ పద్యాలలో తొందర స్ఫురిస్తున్నది. ఇందాకటి పద్యంలో అర్థాన్నిబట్టి అక్షరాలలో వికృతత్వం స్ఫురించినట్లే, ఈపద్యాలలో అర్థాన్నిబట్టి అవే అక్షరాలలో వేగిరపాటు స్ఫురిస్తున్నది.

'ఉఱక నరుడట్లు మైమఱు
వఱువుళ్ళగ జేసి లీల నంగములెల్లం
బఱియలుగ జేయ నాతం
డఱు మెడలక మఱియునేసె నధిక రయమునన్.'

(మహాభారతము, ద్రోణపర్వము)

అన్న పద్యంలోనూ అదే శకటరేఫప్రాచుర్యంఉన్నా దీనిలో ఏమంత తొందరపాటుకూడా స్ఫురించడం లేదు. దీనికి కారణం అర్థంలో విశిష్టస్ఫురణ ఏదీ లేకపోవడమే. కనుక శబ్దం అర్థాన్ని స్ఫురింపజేస్తుం దనడం యుక్తంకాదు. అర్థమే శబ్దాన్ని శక్తిమంతమూ, విశేషోచ్చారణసమన్వితమూ చేస్తుం దనడం హేతువాదయుక్తమైన ఆలోచన.

తిలక్ రచించిన 'ముసలివాడు'అన్న ఖండ కావ్యంనుంచి కొన్నిచరణాలు పరిశీలించుదాం—

'కనుగూడులు నల్లనయి
పెన్నెమోడులు చల్లనయి
కీలుకీలుగా బాధగా
నాడునాడులు లాగగా
చలిగాలి చూరులో కసరినటు
చలిచీమ మట్టిలో దొలిచినటు
వచ్చినది మూగినది ముసరినది
ముసలితనము
ముసలివాణ్ణి నాయనలారా
ముసలి వాణ్ణి.'

దీనిలో 'కీలుకీలుగా బాధగా నాడునాడులు లాగగా' అన్నచోట దీర్ఘాక్షరాలలో బాధ స్ఫురిస్తున్నది. వాటిని ఎంతో పొడిగించి చదువుకొంటాం. కవిభావనాశక్తి ఈ దీర్ఘాక్షరాల దైర్ఘ్యాన్ని పెంచుతోంది.

సుకవిప్రయుక్తశబ్దములు మన దైనందిన వ్యవహృతిలోని శబ్దాలకన్నా శక్తిమత్తరములు. అతని భావనాతీవ్రతచేత అవి ఉద్దీప్తములూ ప్రకాశవంతములూ అవుతాయి. కవి భావాన్ని ఆలోచిస్తూ తత్సమకాలంలోనే ఆ భావావిష్కృతికి సమర్థమైన, అర్థప్రసారానికి ఒప్పిన శబ్దాలను ఎన్నుకొంటాడు. ఉదాహరణకు—

'మెఱుగుమెఱచినట్లు మెఱయంగ నరదంబు
కర్ణికార కేతు కాంతివెలుగ...'

(మహాభారతము —ద్రోణపర్వము)

అన్న పద్యంలో ప్రథమ చరణంలో హ్రస్వాక్షరాలూ రేఫభూయిష్ఠరచనా రథం తటాలున వ్యూహంలో జొరపడిందన్న అర్థాన్ని సమర్థంగా ద్యోతితం చేస్తున్నాయి. ఇక్కడ 'మెఱుగు, మెఱయంగ, అరదము' అన్నమాటలకు బదులు 'శంప, విద్యోతించగ, తేరు' మొదలైనపదాలు ఉపయోగిస్తే అర్థస్ఫురణ కుంటుపడుతుంది. అలాగే ఇందాకటి పెద్దన పద్యంలో 'పారవశ్య'కి బదులు 'తన్మయత్వ' అని ప్రయోగిస్తే ఆ స్ఫురణపోతుంది. ప్రతిభాశాలి అయిన కవి తన భావ వ్యక్తీకరణకు తగిన శబ్దాలను ఎన్నుకొంటాడు. కవి భావనాశక్తిచే అవిష్టములైన ఆ సమర్థ శబ్ద

ములు తామే కవిత్వానుభూతిని మనకు కలిగిస్తున్న భ్రమ కలిగిస్తూ ఉంటాయి. కాని ఈశక్తి అర్థానిది తప్ప శబ్దానిదికాదు. శబ్దం అర్థానికి తగినట్లు ఉండడంతప్ప తనంతట తను పఠితలో ఏభావాన్నీ ఉత్పన్నం చెయ్యజాలదు. ఉదాహరణకి విశ్వనాథ సత్యనారాయణగారి ఈపద్యం చూడండి—

"ఓసి మనోజ్ఞ నీరద వహోదయ కాల
వియ ద్విలంబమా
నాసిత వారివాహ నివహానళ కైశిక!......"

కబరీ భారాన్ని దీర్ఘసమాసంలో వర్ణించడంలో కవిఉద్దేశం అది జడ దీర్ఘత్వాన్ని సూచిస్తుందని కావచ్చును. కాని ఇది చాలా కృత్రిమమైన శిల్పంఅని మనకి తోచకమానదు.

ఒక పదంచేసే చప్పుడుకీ దాని అర్థానికీ ఏమీ సంబంధంలేదు. 'పర్వతము' అన్నమాట చేసిన నాదంలో పర్వతత్వం ఏమీ స్ఫురించడంలేదు. కనుక కవిత్వంచేసే చప్పుడుకీ అర్థానికీ సంబంధం ఉండాలనిగాని, కవిత్వం పుట్టించే రావంవల్లనే అది అర్థం కాకమునుపే పఠిత దానిని అనుభవించాలనిగాని ఇటీవల కొందరు విమర్శకులు చేస్తున్న వాదం చాలా బలహీనమైనది.

'అటజని కాంచె భూమిసురు డంబరచుంబి
శిరస్సర ఝ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లుఠ దభంగతరంగ
మృదంగనిస్స్వన...

అన్న పెద్దన పద్యంలోనూ,

'ఏతే తే కుహరేషు గద్గద నద ద్గోదావరీ వారయః..

అన్న భవభూతి పద్యంలోనూ నాదార్థాల అవినాభావ సంబంధం కనిపిస్తున్నది. కాని ఇటువంటి కవిత్వమే అత్యుత్తమ కవిత్వమనిగాని, కవిత్వమంతా ఇలాగే ఉండాలనిగాని ఎవరూ శాసించలేరు. పై పద్యాలు గొప్పకవిత్వమని చెప్పలేం. నాదార్థాల తాదాత్మ్యం ఒక గొప్పకవితాగుణంకాదు, అదొక అలంకారం మాత్రమే.

కోపంతో మాటాడేవాడు అక్షరాలను కటువుగా పలుకుతాడు, విచారగ్రస్తుడు దీనంగా పలుకుతాడు. భావాన్నిబట్టి అక్షరాల ఉచ్చారణలో కటుత్వమో మృదుత్వమో ఏర్పడుతుందితప్ప, పరుషాక్షరాలు కోపాన్నీ సరళాక్షరాలు శోకాన్నీ స్ఫురింపజేస్తాయనడం తగదు.

'తం శోణిత పరీతాంగం చేష్టమానం మహీతలే
భార్యాతు నిహతం దృష్ట్వా రురావ కరుణాం గిరమ్.'

అన్న వాల్మీకి శ్లోకంలో ఎక్కువ అక్షరాలు కరుణరసానికి ఆలంకారికులు నిర్దేశించినవికావు. అసలు 'కరుణ', 'శోక', 'శృంగార', 'రతి'అన్న శబ్దాక్షరాలు చాలావరకు ఆ రెండు రసాలకూ ఆలంకారిక మతంలో తగవు.

ఇదే తీరున, ఫలాని ఛందస్సు ఫలాని భావానికి పరిపోషకమని; ఉదాహరణకు శార్దూలం పరాక్రమానికి, మందాక్రాంత విరహ దుఃఖానికి, స్రగ్ధర వీరుని భుజబలవర్ణనాదులకి, ఆక్షేపాదులకి పృథ్వీ తగునని క్షేమేంద్రుడు మున్నగు ప్రాచీనులేకాక ఆధునిక విమర్శకులుకూడా చేస్తున్న విమర్శ తీరుకూడా సమంజసం కాదు. అటూ ఇటూ దీర్ఘాక్షరాలూ మధ్యలో హ్రస్వాలూకల స్రగ్ధర వీరుని సునంహత వక్షో దీర్ఘ భుజద్వయ వర్ణనకి అనుకూలమన్న నాట్యశాస్త్ర కర్త అభిప్రాయం హాస్యాస్పదంగా ఉంది. ఈ పద్ధతిని సౌందర్యవతి నడుమును వర్ణించడానికి పద్యం వ్రాయకపోవడమే గొప్ప ఛందః శిల్పమని చెప్పవలసివస్తుంది. అయితే, మన ప్రాచీనాలంకారికులు ఈ భావాని కీ వృత్తం తగునని సూచించారుతప్ప, అదే ఉపయోగించాలని నియమించలేదు.

ఛందస్సు బహిరంగమైనది. దానికి అర్థాన్ని శాసించే శక్తిలేదు. రామాయణ భారత భాగవతాలు దాదాపు పూర్తిగా అనుష్టుప్పులోనే నడిచాయి. దుస్తుల ఫేషన్లు పెరిగినట్లుగా ఛందస్సులు పెరుగుతూ వచ్చాయి. ఇంకా ఎన్నివిధాల ఛందస్సులనైనా సృష్టించవచ్చును. అంతమాత్రాన కవిత్వానికి ఒరిగేదేం లేదు.

కాళిదాసు స్రగ్ధరలో వేటాడబడుతున్న లేడి భయ దైన్యాలను వర్ణించాడు. యక్షుని విరహాన్ని వర్ణించిన మందాక్రాంతలోనే దుష్యంతుని ప్రభావాన్నీ, మాళవిక నృత్యావసాన స్థితినీ వర్ణించాడు. మాళవిక ఏడుస్తూ నిలపడిందని కవి ఆశయం కాదుకదా! తిక్కన ఉత్సాహలో శోకాన్ని వర్ణించాడు. భావలక్షణాన్ని బట్టికాక భావపరిమితినిబట్టే కవులు అనుకూలచ్ఛందస్సులను ఎంచుకొంటారు, ఉదాహరణకు చిన్నభావానికి అనుష్టుప్పు, తేటగీతి; పెద్దభావానికి స్రగ్ధర, సీసం ఇత్యాది. అసలు ఛందస్సేలేని వచన పద్యాలలోకూడా మంచి కవిత్వం రచితమవుతున్నది. దీనినిబట్టి కవిత్వంలో ఛందస్సు ప్రయోజనం అత్యల్పమైనదని ఊహించవచ్చును. సమర్థుడైన కవి ఏ ఛందస్సులో ఏ రసాన్నైనా ఒప్పించగలడని మన ప్రాచీనాలంకారికులుకూడా చెప్పకపోలేదు.

కనుక ఛందస్సు, అక్షరాలు, పద్యం చేస్తున్న నాదం మొదలైన వాటిద్వారా పద్యం అర్థంకాకమునుపే కవిత్వం అనుభూత మవుతుందనే ఆధునిక విమర్శకుల అభిప్రాయం లెస్సకాదు. అర్థమే ప్రధానం. అదే కవిత్వానికి ప్రాణం. అర్థమే పద్యంలో ప్రయుక్తమైన శబ్దాలకూ ఛందస్సుకూ సార్థక్యం కలిగించి వాటిలో సరసత్వం నింపుతుంది. కనుక కవిత్వంలో అర్థం స్పష్టంగా ఉండాలి:

కాని ఏ కవిత్వమూ తేటతెలంగా ఉండదు. ప్రతి కవిత్వంలోనూ పఠిత ఊహించవలసినది కొంత ఉంటుంది. రెండురెళ్లు నాలుగు అనడానికి ఎవరూ కవిత్వం వ్రాయరు.

ఆనందవర్ధనుడు కవిత్వం ధ్వని ప్రధానం అన్నాడు. ఉదాహరణకు:

"ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ'

నారదు డీవిధముగా తన వివాహప్రసక్తి నిలేగా పితృపార్శ్వమున అధోముఖియై పార్వతి లీలాకమల పత్రములను లెఖించెను) అన్న పద్యంలో "పార్వతి సిగ్గుపడినది" అన్నభావం మనకి స్ఫురిస్తున్నది. ఇది పద్యంలో తేటతెల్లగాలేదు. కనుక ఈ పద్యంలో కూడా ఈషదస్పష్టత లేకపోలేదు.

ఐతే దీనిని అస్పష్టత అని చెప్పలేం. 'పార్వతి సిగ్గుపడినది' అని మనం తేలికగానే ఊహించుకోగలం. ధ్వని సిద్ధాంతాన్ని ఖండిస్తూ మహిమభట్టు వ్యక్తివివేకంలో, దీనికి 'ధ్వని' అని వేరే పేరు పెట్టనక్కరలేదనీ, ఇది అనుమానంలోనే అంతర్భవిస్తుందనీ అన్నాడు. పొగచేత నిప్పుని అనుమించినట్లుగా లీలాకమలపత్రగణనంచేత లజ్జని మనం అనుమించగలం. కవిత్వంలో తత్ప్రకరణాన్ని బట్టీ, పఠిత తన అనుభూతి విజ్ఞానాల నుపయోగించి కవిభావాన్ని ఊహించగలడు. పఠిత ఊహకి అందేవరకు కవిత్వంలో అస్పష్టత ఉండదగినదే. ఎంత ఊహించినా ఎవరికీ ఏమీ తెలియక పోయేటంత అస్పష్టతమాత్రం అభిలషణీయం కాదు.

'పార్వతి లీలాకమల పత్రములను లెఖించెను' అన్న వాచ్యార్థం అప్రధానమనీ, 'పార్వతి సిగ్గుపడినది'అన్న వ్యంగ్యార్థం ప్రధానమని ధ్వన్యాలోకకర్త ప్రతిపాదించాడు. రసనిష్పత్తి దృష్టిలో సిగ్గుపడడం ప్రధానమే, ఆయన చెప్పినది యుక్తమే. రచన దృష్టిలోమాత్రం లీలాకమలపత్రగణనమే ముఖ్యం. సిగ్గుపడడంఅన్న మనోవికారంవలన పార్వతిలో కలిగిన ముఖ్యమైన, అత్యంతరమణీయమైన వ్యాపారం లీలాకమలపత్రగణనం. కవిత్వంలో చెప్పదగిన ఆ ముఖ్యవిషయాన్ని మాత్రమే పేర్కొని, దానివలన పార్వతి సిగ్గుపడెను అన్న విషయాన్ని పఠిత ఊహించ గలడని కవి చెప్పకుండా వదిలిపెడుతున్నాడు. "When a man spends the least possible movements on some definite action: that is grace." అని చెకోవ్ అన్నాడు. ఈ నిర్వచనం కవిత్వ రచనకు చక్కగా సరిపడుతుంది. కవి తన భావనలోని ఉద్విగ్నతను, రమణీయతను, దుఃఖతమ విషయాలను క్లుప్తంగా, చిక్కగాచెప్పి; తదను బద్ధములైన అన్యభావములను పఠిత ఊహకు వది

లేస్తాడు. ఆమాత్రం అస్పష్టతను పఠిత ఊహించ గలడు.

"I wandered lonely as a cloud." అనగానే మేఘసాదృశ్యాన్నిబట్టి కవి మనస్థితిని మనం సులభంగా ఊహిస్తాం. 'I have measured out my life with coffee spoons,' అంటే ఇక్కడ Coffee spoons దేనిని సూచిస్తుందో మనం ఊహించుకోంటున్నాం. కృష్ణశాస్త్రిగారి

'ఊర్వశీ! ప్రేయసీ! నేడా యుష్మదీయ
చర్ణణ కరుణామధుకణమ్మె దొరకునేమొ...'

అన్న పద్యంలో 'చరణకరుణ' అంటే ఏమిటో మన ఊహకి అందడంలేదు. తిలక్ రచించిన 'శిఖ రారోహణ'లో

'లైట్లు వెలిగిన స్టేషన్‌లోకి రైలు వచ్చినట్లుగా
కొత్త సంవత్సరం హుషారుగా కొత్తగా రావాలి
మన మధ్యకి
కాని ఈసారి ప్లాట్‌ఫారమంతా చీకటిగాఉంది
పాతమాటలమూటలతో కవులూ
వట్టిమాటల సంచులతో రాజకీయవేత్తలూ
మొహమాటంలేకుండా ముందెక్కి కూర్చున్నారు.
రైలింగ్ అవతల టిక్కట్లు దొరక్క ప్రజలు
దిగాలుపడి నుంచున్నారు
రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని ఎవరో
తొలగించివేశారు

అన్న పద్యంలో ప్రతీకలూ వ్యంగ్యాలు మన ఊహకి అందుతున్నాయి. ఆరుద్రగారి—

'నీవు ఎక్కదలచుకొన్న రైలు
ఒక్కజీవితకాలం లేటు
పిళ్ళూపూళ్ళూ నిరీక్షించలేక
ఎక్కేస్తావేదో ఒక బండి
నీ ఆదర్శాల లగేజి
ఎక్సెసంటాడు టిటిసీ.'

అన్న పద్యంలో 'రైలు, జీవితకాలం, లేటు' మొద లైన మాటల స్ఫురణ మన ఊహకి చప్పున అందక కవిత్వం అస్పష్టమైంది. బహుశః కవి ఉద్దేశం ఇలా అయిఉండవచ్చును—'నీవు వాంఛిస్తున్న సాంఘిక రాజకీయవ్యవస్థ నువ్వు బ్రతికిఉండగా రాదు. నిరీక్షించలేక ఆదర్శాలను వదులుకొని ఉన్న వ్యవస్థలోనే జీవించడానికి సర్దుకుపోతావు'అని. ఈ అభిప్రాయాన్ని 'నువ్వు ఎక్కదలచుకొన్న రైలు'అని చెప్పడంలో అస్పష్టత ఎక్కువ కావడమే జరిగింది తప్ప స్ఫురణ గాఢంగాలేదు. నువ్వు బ్రతికిఉండగా ఆ పని జరగదు అనడంలో ఉన్న తీవ్రత, జరగవలసిన పని ఒక జీవితకాలం లేటు అనడంలో లేకపోవడమే కాక, ఇలా చెప్పడం చాలా వక్రంగాఉంది.

ఏ కవిత్వమూ పూర్తిగా స్పష్టంగాకాని, అంతా అస్పష్టంగాకాని ఉండదు. ఆంగ్ల కవిత్వం లోనూ, ఆధునికాంధ్రకవిత్వంలోనూ ఏ కవి కవిత్వాన్ని పరిశీలించినా అంతో ఇంతో అస్పష్టత ఉంటూనే ఉంటుంది. కవి తన వ్యక్తిగత భావా లను పూర్తిగా వ్యక్తం చెయ్యడానికి సంకోచించడం; శబ్దాడంబరం, ఊహావైచిత్రి మొదలైన చాపల్యాలకి లోనుకావడం దీనికి కారణం. ఉదాహరణకి "ముసలి వాడు"లో మొదటి పంక్తి స్పష్టంగా ఉంది, రెండవ పంక్తి అస్పష్టంగా ఉంది.

సాధారణంగా హెచ్చుమంది పఠితలు పద్యంలో అక్షరరమ్యతకీ పదప్రయోగవైచిత్రికీ కల్పనకీ ముగ్ధులవుతారు తప్ప ప్రతిపదార్థ విశ్లేషణచేసి భావాన్ని పరిపూర్ణంగా గ్రహించడానికి ఉత్సుకత చూపరు. అందుచేత ప్రజలు చాలా మంచికవిత్వ మని మెచ్చుకొంటున్న పద్యాలలోకూడా అస్పష్టత వుండవచ్చును. పద్యవైచిత్రిచే ఆకృష్టులైన విద్వాం సులుకూడా ఒక్కొక్కప్పుడు అస్పష్టతను గమనిం చక పోవచ్చును. ఉదాహరణకి ఈ సుపరిచిత శ్లోకాన్ని పరిశీలించుదాం:

'ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ
చంచలదృశాం
దృశాంకోణోబాణః సుహృదపి జడాత్మా హిమకరః
స్వయం చైకోఒనంగః సకల భువనం వ్యాకులయతి
క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే'.

(ధనువు పుష్పమయం. మౌర్వి మధుకరశ్రేణి. చంచలదృశలైన స్త్రీల దృక్కోణము బాణము. తోడు జగాత్ముడైన హిమకరుడు. తాను అనంగుడు. అయినా మన్మథుడు తానొక్కడే సకల లోకమునూ వ్యాకుల పరుస్తున్నాడు. మహానుభావులకు క్రియాసిద్ధి స్వసత్త్వముచేతనే అవుతుంది. ఉపకరణముల చేత కాదు.)

మహాత్ములకు కార్యసిద్ధి స్వశక్తి చేతనేగాని సాధనములచేకాదని ఈ పద్యంలో ప్రతిపాద్యం. మన్మథునినుండి ధనువును, నారిని, స్త్రీల వాలు చూపుల బాణాలను, చంద్ర కిరణాలను వీటన్నిటినీ తొలగిస్తే ఇంక ఆ మన్మథునికి స్వశక్తి ఏదీ మిగలదు. స్త్రీలు, వారి వాలు చూపులు, వెన్నెల—వీటిచేతనే లోకం వ్యాకుల మవుతున్నది. ఇవి లేకపోతే మన్మథుడు లోకాన్ని ఇంకెలా బాధించగలడు? లోకం అనుభవంలో ఈ ఉపకరణాలే చాలా బలమైనవి. వాస్తవమైనవి. మన్మథుడు ఊహ బలమైన ఉపకరణాలచే నిర్వహించబడుతూ, మన్మథుడనే ఊహాకల్పితునిపై కేవలం ఆరోపితమై ఉన్న మొదటి మూడు చరణాలలో వర్ణితమైన లోకప్రణయాకులత్వకార్యం చతుర్థపాదంలో తద్వ్యతిరిక్తమైన అర్థాంతరన్యాసని సమర్థించదు. ఈ పద్య భావం అస్పష్టంగా ఉంది. కాళిదాస విరచితమైన ఈ పద్యం చూడండి.

'తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి
సహాయమేకం మధుమే వలభ్య
కుర్యాం హరస్యాపి పినాకపాణే
ర్ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే.'

(నీ ప్రసాదంచేత కుసుమాయుధుడనైనా నేను వసంతుడినిమాత్రం సహాయునిగా తీసుకొని పినాకపాణిఅయిన హరుని ధైర్యముకూడా హరించగలను. అన్యధనుర్ధరుల మాట, చెప్పనక్కరలేదు). ఈ పద్యంలో సాధనముల బలం చక్కగా వ్యంగ్యమవుతూ ఆ సాధనములు కలిగిన మన్మథుని ప్రభావం నిరూపితమవుతున్నది. ఈ విధంగా పద్యంలో ప్రతి శబ్దార్థమూ కవి వివక్షితభావాన్ని స్పష్టంగా బలంగా చెప్పగలిగిఉండాలి.

---

**ఉపయుక్త రచనలు :**


కారికావళీ—ముక్తావళీ.
ధ్వన్యాలోకము.
వ్యక్తివివేకము.
సువృత్తతిలకము—క్షేమేంద్రుడు.
ఆంధ్రమహాభారతము—ఛందఃశిల్పము : పాటిబండ మాధవశర్మ.
కవిత్వంలో అనిర్వచనీయత : చిరుమామిళ్ళ సుబ్బారావు.
కవిత్వము—వైచిత్రి : పాలగుమ్మి పద్మరాజు.
Dylon Thomas : Henry Treece
Selected Prose : T. S. Eliot.




# మహాభినిష్క్రమణం

శ్రీ శివకుమార్

కోర్కెల వ్రణాలు కోసి
బాధల ఋణాలు తీర్చి
జీవనబంధాలు త్రెంచి
హృదయ ద్వారాలు తెరిచి
విశ్వమంతా హాయిగా
హంసలా విహరిస్తాను.
నక్షత్ర నివహ గగనాన తేలి
విశాల శాద్వల మైదానాల సోలి
అగాధ వినీల జలధి లోతులు త్రవ్వి
ఉభయ చరమునై చరిస్తాను.

నిశీథి నిశ్శబ్దంలో సన్నగా
నిరంతరంగా వినవచ్చే
మానవశోకసంగీత గీతం
వినిపిస్తాను.

నా కనుల స్రవించు నిరంతరాశ్రుధార
ఎండు బ్రతుకుల పన్నీరై ప్రవహించి
సంతోషపు వెలుతురు విత్తనాలు మొలకెత్తి
ఆశల పంటలు పండించి
ఎద ఎదలో చిరుగంటలు
మ్రోగించిన నాడు
నేను శాశ్వతంగా శాంతంగా
నిష్క్రమిస్తాను.

---

# "ఒక మహత్తరమైన మార్పుకోసం"- ఏ మార్గం?

'హేతువాది'

దిగంబర కవితావైశిష్ట్యాన్ని, లక్ష్యాన్ని గురించి వివరిస్తూ శ్రీ నిఖిలేశ్వర్ జూన్ '70 'భారతి'లో 'ఒక మహత్తరమైన మార్పుకోసం' అనే శీర్షికతో ఒకవ్యాసాన్ని వ్రాశారు. ఇది అందరూ హర్షించదగ్గ విషయమే. కానీ అందులోని కొన్ని విషయాలను గూర్చి చర్చించడం భావ్యమేమో!

ఒక మహత్తరమైన మార్పును—అదీ నేటి జీవన విర్జీవ వ్యవస్థలో—ఎవడు కోరడు? దుర్భర దారిద్ర్య జీవితంలో, నిర్దాక్షిణ్యమైన సామాజిక వ్యవస్థలో—ఎంతోకాలంనుండి దొర్లిపొర్లాడుతూ—దాన్నుండి బయటపడేందుకు మార్గం కానరాక—లేక తెలుసుకోలేక—బిత్తర చూపులతో దిక్కులు చూస్తున్న సామాన్యునికి — ఒక మహత్తరమైన మార్పుకోసం యిదీ దారి అని చూపుతుంటే—దాని కొఱకు ఎవడు తత్తర పడిపోడు?

శ్రీ నిఖిలేశ్వర్ నేటి సామాజిక వ్యవస్థ నిజస్వరూపాన్ని బాగా చిత్రీకరించారు. సామాన్యుని దైన్యజీవితం బాగా అవగతమయ్యేలా వ్రాశారు. దాన్ని రూపుమాపేందు కాయత్తమైన తమ కృషి ప్రణాళికను వివరించారు. అయితే వచ్చేచిక్కు, అభిప్రాయభేదాలెల్లా — వా రభిలషిస్తున్న యీ పవిత్రాశయంకోసం—వారు సూచిస్తున్న, వాదిస్తున్న మార్గంలోనే. 'ఇదీ మా వుద్దేశం' అంటూనే భుజా లెగరవేసే ప్రజల్లో—సామాన్యప్రజల్లో 'కానీ యిది సాయుధ విప్లవంద్వారానే సాధ్యం' అనడం వింటూనే ఎందరు చేతులు కలపటానికి ముందుకు వస్తారు? ఎంతమందిలో ఉత్సాహం వురకలు వేస్తుంది?— అనే విషయాన్ని కూడా ఆలోచించాలి. కానీ వాళ్లు ముందుకు రాలేకపోతున్నారు, రాను యిష్టపడ కున్నారు అంటే అది వారి భీరుత్వానికి నిదర్శనం కాదు. దీనికి కారణం వేరే వుండొచ్చు. తామాశిస్తున్న సదాశయాన్ని ఎంత ఉన్నతంగా వారు భావిస్తారో, తా మాచరించే విధానాలను కూడా దానికి తగ్గట్లు ఉన్నతంగానే వుంచాలని చాలామంది కోరుతారు. ఒక సదాశయానికి—దుర్వ్యవస్థను రూపుమాపి సువ్యవస్థను స్థాపించాలనే ప్రయత్నానికి—తాను నమ్మిన, తన నైజం ఒప్పుకొనే పద్ధతిద్వారానే పూనుకోవాలని ప్రతిమానవుడూ భావిస్తాడు. తను చేయబోయే పనికి తనఅంతరంగం కూడా అంగీకరించా లనుకొంటాడు. లక్ష్యం ఎంత ఉన్నతమైనా దాన్ని సాధించేవిధానం అనుచితం కాకూడదు అనుకొంటాడు — ఇదీ — మామూలుగా మానవుని మానసిక సంఘర్షణ స్వరూపం. అంతేకానీ ప్రతిఒకడూ యిలాగే అనుకొంటాడని దీని అర్థంకాదు. ఈ మానసిక సంఘర్షణకు లోబడే వాళ్లూ, దా న్నధిగమించి వర్తించేవాళ్లూ లేక పోలేదు. కానీ యిది మానవుని సహజ స్వభావం (Natural instinct) అని చెప్పక తప్పదు.

పోతే ఆ మహత్తరమైన మార్పుకోసం శ్రీ నిఖిలేశ్వర్ సూచించిన „మార్గం సాయుధ విప్లవం. దీనికి మార్గాంతరమే లేదని వారి వాదం. దీన్నిగూర్చి కొంత ఆలోచించాల్సివుంది. ఒక ఆశ

యాన్ని-అది ఎంతఉన్నతమైనదైనప్పటికీ సాధించడమే ముఖ్యంకాదు, దాన్ని సరియైన—అంతే ఉన్నతమైన మార్గంద్వారా సాధించడం అంతకంటే ముఖ్యం.

దిగంబరకవుల ఆలోచనా ధోరణి ప్రకారం—కొట్టి అయినా (సాయుధ విప్లవంద్వారా), తిట్టి అయినా (దిగంబర కవిత ద్వారా) మన మనుకొంటున్న సామాజిక విప్లవం, 'ఆ వినూత్న ప్రపంచం'ను సాధించాలి. ఈ విధానాలే చాలా మందికి నచ్చడంలేదు.

శ్రీ నిఖిలేశ్వర్ ప్రకారం సాయుధ విప్లవ మార్గం 'వర్గరహిత సమాజాన్ని ఏర్పరచి దోపిడీలేని వ్యవస్థకు విప్లవం మార్గాన్ని ప్రశస్తం చేస్తుంది. అలాంటి విప్లవానికి యీనాడు దేశంలో అన్నివిధాలా సంక్షోభం పరిపక్వ మవుతోంది. ప్రస్తుతం యీ మహత్తరమైన మార్పుకు సామాన్యజనం—యువకులు ముందుకు దూకుతున్నారు.' అయ నంటున్నట్లు 'అలాంటి విప్లవానికి యీనాడు దేశంలో అన్నివిధాలా సంక్షోభం పరిపక్వమవుతుం'టే 'ఈ మహత్తరమైన మార్పుకు సామాన్యజనం — యువకులు ముందుకు దూకుతుం'టే—సామాన్యజనానికీ, యువకులకూ అందరికీ నేటి 'దోపిడీవ్యవస్థ', 'కుష్ఠువ్యవస్థ'లోని లోటుపాటులు తెలిసిపోయినవనే గదా అర్థం! ఇది అపసవ్యపు అంచనా; పై విషయాలను కూలంకషంగా తెలుసుకొన్నవారు నేటికీ అరుదే! తెలుసుకొన్నా అవి వాస్తవికాలని నమ్మినవారు మరీ అరుదు!! "......మార్పుకు ముందుకు దూకుతున్న వారు' మరీ తక్కువ!!!

దీనికి కారణం లేకపోలేదు. ఇలాంటి చెడు వ్యవస్థలో యుగయుగాలనుండీ నలిగి తెలుతున్నా—అంతే కాలంనుండి వారిని పట్టి పీడిస్తున్న కర్మ సిద్ధాంతం వాస్తవిక దృష్టినుండి వారి మేధస్సును మరల్చివేస్తున్నది. దాంతో వారి ఆలోచన వక్రపథాన పయనిస్తున్నది. వారికి తమ దురవస్థలోని, నేటి సామాజిక వ్యవస్థలోని 'కుష్ఠు'యొక్క లోటుపాటులు తెలిసినా, దానికి కారణభూతమైన వాటి విశ్లేషణ (Analysis of the responsible factors) నిజమైన రూపంలో తెలియడంలేదు. అలాంటప్పుడు వారిలో రావలసిన మార్పు—భావ సంచలనం—తద్వారా భావవిప్లవం. సాయుధవిప్లవం ఏమాత్రం కాదు. గుడ్డిగా ఆయుధాలిచ్చి పురికొల్పేకన్నా ముందు వారికొక నిర్దిష్టమైన దృష్టినిచ్చి వారివారి వారినే వెదుక్కోమనడం సరియైన మార్గం.

ఒకవేళ శ్రీ నిఖిలేశ్వర్ అంటున్నట్లు నిజంగా సామాన్యజనులు, యువకులు ముందుకు దూకుతుంటే—వారికి అన్ని విషయాలు కూలంకషంగా తెలిసినట్లే. అలాంటప్పుడు వారికి తెలియని యీ సమాజంలోని కుళ్ళు ఏముంటుంది? ఇప్పుడు మీరు విశేషించి వారికి చెప్పవలసిం దేముంటుంది? అంటే మీరి దిగంబర కవిత అనవసరమన్నమాట!

కానీ నిజస్వరూపం యిందుకు భిన్నంగా వుంది. అశేషమైన పీడిత ప్రజానీకం ముందు యీ 'ముందుకు దూకుతున్నవారి' సంఖ్యను చూస్తే వ్రేళ్లపై లెక్కపెట్టడమే కాగలదు.

ఇక 'దోపిడీ వ్యవస్థను'గూర్చి ఆలోచిస్తే, దీనికి కారణభూతమైనవారు యిరువర్గాలవారు కూడా. దోచుకోనిచ్చేవాడుంటే దోచుకొనేవాడి కొరత వుండదు. కనుక యిది ఏకపక్షంగా జరిగేపనికాదు. నేటి 'పీడితప్రజల'పాత్రా యిందులో వుంది. వారి రక్షణకొరకు వారు ముందునుంచీ కృషి చేయలేదన్న మాట! అదే యిప్పుడు వారు చేయవలసివుంది.

'వైజ్ఞానిక హేతువాదం'లో ప్రగాఢమైన విశ్వాసంగల దిగంబరకవులు కొన్ని విషయాలలో దాన్నే దాటవేస్తున్నారు, లేదా బుద్ధిపూర్వకంగా మరచిపోతున్నారు. ప్రపంచంలో ఏ ప్రకృతి సొత్తయినా—అది ఎంత ప్రక్కృతిదే అయినా—ప్రతి ప్రాణికి సరిసమానంగా పంచిపెట్టబడలేదు. అసమానతలు, అసమగ్రతలు అతిసహజాలు. దీనికి ఏ ఒక్కడూ కారకుడుకాడు, కాబోడు. తన అవసరాల్ని అవకాశాలతో జోడించి అందినంతవరకు తాను వినియోగించుకోవాలని ప్రయత్నిస్తాడు ప్రతివాడూ. ఇందులో

అన్యాయం ఏమీలేదు. చిన్నచేపను పెద్దచేప మ్రింగడం లేదా ? బ్రతుకుతెరువుకు యిదీ ఒకవిధమైన పోరాటమే (Struggle). డార్విన్ సిద్ధాంతంలోని 'జీవనానికై పోరాటం' (Struggle for existence) 'మిక్కిలి యోగ్యులైనవాడే జీవించడం, (Survival of the fittest) అని యిదే విషయాన్ని ఋజువు చేస్తాయి. లేక వీరు "మేము వైజ్ఞానిక సిద్ధాంతాలను నమ్మినా, పురాతనమైన సిద్ధాంతాలను విశ్వసించం" అని తప్పుకుంటారా ?

ఎవరికీ, ఏదీ—సర్వసిద్ధంగా, ఏరకమైన ప్రయత్నం, పోరాటం లేకుండా సిద్ధపరచి పెట్టబడదు. మానవుడు తన శ్రమ, కృషి (Self-effort) ద్వారానే తనకు కావాల్సింది సమకూర్చుకోవాలి. ఇంట్లో కూర్చొని ఎవరో బతుకుతుంటే చూడలేక 'సర్వసమానత్వం, సామ్యవాద వ్యవస్థ' అని ఉపన్యాసాలిచ్చినా, కలలుకన్నా ఫలితముండదు. మన కృషి ద్వారా మనం సంపాదించుకోవాలి.

ఇన్ని సిద్ధాంతాలు వల్లెవేస్తూ, యింత స్పష్టంగానూ, బాహాటంగానూ తమ ఆలోచనా ధోరణిని బహిర్గతం చేస్తూకూడా వీరు "ఈ కవితోద్యమం ఏ సంస్థకు—రాజకీయపార్టీకి సాంస్కృతిక విభాగంకాదు" అంటున్నారు. వీరి వ్యాసంలోని, దిగంబరకవుల కవితల్లోని పరిభాష, వివరణ చదివిన వారికి యిందులోని విషయం తెలియకపోదు. పైగా యిటీవల హైదరాబాదులో జరిగిన 'దిగంబర కవుల సమావేశం'లో వారు 'లెనిన్—మార్క్సిజం'ను నమ్మిన విప్లవవాదులుగా స్పష్టంగా చెప్పుకున్నారు. ప్రజల పరిస్థితుల 'నగ్నస్వరూపాన్ని' బట్టబయలు చేయ బయలుదేరిన వీరు యిలా ఎందుకు ముసుగు వేసుకొంటున్నారు ? వీరి ఆశయాలు, అభిప్రాయాలు, సిద్ధాంతాలు—అన్నీ కమ్యూనిస్టుపార్టీకి చెందినవని ఎవరికి తెలీదు? మాకు దేనితోను సంబంధంలేదని ఎందుకు బుకాయించడం ?

పోతే నేటి విద్యావ్యవస్థను గూర్చి శ్రీ నిఖిలేశ్వర్ చెప్పిన వాక్యం నిజం. 'ఈనాటి విద్యావిధానం ఆధునిక సాహిత్య—విజ్ఞానం వర్తమాన జీవిత సమన్వయంతో రూపొందాలని కోరుతున్నారు' అన్నది సర్వజనామోదవిషయమే. ప్రతి ఒకరూ వాంఛించేది కూడా అదే. నేడు విద్యార్థుల్లో వ్యాపించిన నిర్లిప్తత, నైరాశ్య భావాలకు చాలవరకు కారణం పై అంశం లోపించడమే. విద్యార్థులను విద్యాలయాల 'బందిఖానాల'లో వేసి—రుచీపచీలేని, పనికిరాని పాఠ్యాంశాలను నామమాత్రంగా వడ్డిస్తూ—ఎందుకూ కొరగాని విద్యలో (తో) శిక్ష(ణ) నిస్తున్నారు. ఈ 'బందీఖానాల'లో పడి మగ్గేకన్నా—బయటపడి — ఏ బాదరాబందిలేక స్వేచ్ఛావాయువులు పీల్చడమే మేలని వారు తలపోస్తున్నారు. వారి భావిజీవితాలను తీర్చిదిద్దేందుకు కాక నామమాత్రంగా యిస్తున్న పట్టాలతోపాటు పొట్టలను కూడా చేతపట్టుకొని వీథుల్లో పడుతున్నారు విద్యావంతులు. విజ్ఞానం, సాహిత్యం—ఎంతో అభివృద్ధి చెందుతున్నా దాన్ని వర్తమానజీవితాలకు సమన్వయం చేయలేని నేటి విద్యావిధానం నిరర్థకం, అనర్థదాయకం.

గాంధీ నుద్దేశించి వ్యాసకర్త 'పెట్టుబడిదారులకు పరోక్షంగా మేలుచేసిన గాంధిజీ సిద్ధాంతాలు ప్రజలను కర్మ (మాయ) వాదులను, చేతగాని వాళ్లనుగా చేశాయి' అన్నారు. ఆ నాడు గాంధీ చేసింది ఆ రోజుల్లో సరిపోయే పనులే. దానికి గత్యంతరం లేకపోయి వుండవచ్చు, లేక ఆయనకు తోచివుండక పోవచ్చు. ఆ నాడు గాంధి ఆ సిద్ధాంతాలనే ప్రచారం చేయకపోయివుంటే, పెట్టుబడిదారులను ప్రోత్సహించక—ఆ పెట్టుబడిదారులే పెట్టుబడిపెట్టక పోయివుంటే - యీ నాడు దేశం పారిశ్రామికంగానూ, సాంకేతికంగానూ యింత అభివృద్ధినికూడా సాధించి యుండలేదు. ఒకవేళ సాధించివున్నా విదేశీయుల హస్తాలవల్ల జరిగివుండేది. అంటే అప్పట్లో స్వదేశీపెట్టుబడిదారుల్నైనాకట్టుకోకుంటే విదేశీ పెట్టుబడిదారులనైనా దానికై కోరాలి. ఒకవేళ విదేశీయులే పెట్టుబడి పెట్టివుంటే వారి ఆధిపత్యం మరింతగా చెలాయింప బడేది. అంతేకాక మనకు కావల

సిన ప్రతిఒక్క వస్తువుకు, అవసరానికి పూర్తిగా వారిపైననే ఆధారపడవలసి వచ్చేది. ఈ విధానాన్ని రూపుమాపాలని ప్రయత్నించారు గాంధీ. అదీగాక అప్పటి పరిస్థితుల్లో ప్రజలకు విదేశీయులంటేనే గిట్టేదికాదు. 'క్విట్ ఇండియా' అనేవారు. అప్పట్లో విదేశీయులను పై రంగాల్లో పెట్టుబడులకు ప్రోత్స హించాలన్నా ప్రజలందుకు సుతరామూ అంగీకరించ రనే విషయం గాంధీకి బాగా తెలుసు. తనబలమైన— ప్రజల యిష్టానికి వ్యతిరేకంగా పోవడానికి గాంధి సాహసించలేకపోయ్యారు.

కేవలం .పెట్టుబడిదారులకు మాత్రమేగాక, సామాన్య ప్రజానీకానికికూడా చాలా విషయాల్లో మేలు చేశారు గాంధీ. పేదప్రజానీకాన్ని క్రుంగ దీయడం అయన అభిమతంగాదు. వారి అభ్యున్నతికే కృషి చేశారు. కానీ యిప్పటి దృష్టిలో అయన అనుసరించిన మార్గాలు కొన్ని సరియైనవి కాక పోవచ్చు. అంతమాత్రాన గాంధీని దుయ్యబట్టనవసరం లేదు. పెద్దపరిశ్రమలకు పెట్టుబడిదారుల నెలా ప్రోత్సహించారో, అలాగే చిన్న పరిశ్రమల నడవుటకై కుటీరపరిశ్రమలద్వారా సామాన్య ప్రజానీకాన్ని ఉత్తేజపరిచారు. మార్గం చూపారు. ఎవరికి తగినది వారికి చెప్పారు. పేదప్రజలకు మేలు చేయాలని ఆయున ఎంత సంకల్పించినా—గాంధీ ఆశయాలు కాలక్రమంలో విపర్యయించి వుండవచ్చు. కానీ తత్కాలానికి తగిన సూత్రాలు, సిద్ధాంతాలతో, తాను నమ్మిన, ఆశించిన ఆశయాలను సర్వజన శ్రేయోదృష్టితోనే ఆయన తు. చ. తప్పకుండా పాటించారు. పాక్షికదృష్టితోగాని, దుష్టబుద్ధితో గాని ఆయన ఏపనీ చేయలేదు.

'గాంధీజీ సిద్ధాంతాలు ప్రజలను కర్మ (మాయ) వాదులుగాను, చేతకాని వాళ్లనుగా చేశాయి' అనడం అర్థంలేనిమాట. మనదేశంలో కర్మ సిద్ధాంతం ఏనాటినుంచో జీర్ణించుకు పోయివుంది. దానికి గాంధీసూత్రాలు ఏమాత్రం కారణంకావు, అదీగాక గాంధీ సిద్ధాంతాల ద్వారానే కర్మవాదం ప్రారంభం కాలేదు. ఇక ప్రజలను చేతకాని వాళ్లుగా చేశారంటే—అప్పుడాయన వారిచేతనైన పనిని చేయించారు కాబట్టే అంతమటుకు బలాన్ని పుంజుకొన్నారు ప్రజలు. అప్పట్లో అదే ఒక పెద్ద చైతన్యం, పోరాటం. అమాత్రం గాంధీ అప్పట్లో చేయకపోయి వున్నట్లయితే ప్రజలు ఎందుకూ కొరగానివారుగా మిగిలిపోయేవారు.

ఇదంతా .చెప్పుకొస్తున్నాను అంటే గాంధీని నేను వెనుకేసుకొస్తున్నాననిగాని,ఆయన్ను సమర్థిస్తున్నా ననికాని అర్థంకాదు. ఆయనపై పిచ్చిఅభిమానమున్న దనికాని, ఆయన సిద్ధాంతాలపై వెర్రివ్యామోహ మున్నదనికాని అర్థం అంతకంటేకాదు. కానీ ఆయన చేసిన ప్రతిపనికీ కారణాలున్నాయి, పరిస్థితుల ప్రభావమలా వుండింది. ఆయనకు సరియైనదవి తోచింది చేశారు. ఎందుకు చేయాలి? ఇలా ఎందుకు చేసివుండకూడదు? అంటే అవి పిచ్చిప్రశ్నలు. అవి ప్రస్తుతం మనం సమాధానం చెప్పవలసిన ప్రశ్నలు. చేసి చూపించవలసిన మార్గాలు.

పోతే గాంధీ అసలు తప్పు చేయలేదనిగానీ, ఆయన చేసిందల్లా సరిఅయినదేఅనికానీ ఎవరూ చెప్పరు, చెప్పకూడదు. తప్పులూ వున్నాయ్, కానీ ఒప్పులూ లేకపోలేదు. మనిషి అన్నాక మంచిచెడు గుల కలయికయే కదా? ఎంతమంచివానిలోనూ చెడు వుండకపోదు, ఎంతచెడ్డవాడిలోనూ మంచి వుండక పోదు. కేవలం ఒకేకోణంనుంచి చూచి వాటిని నిర్ధా రించలేం. ఏ మానవుడూ పరిపూర్ణుడుకాడు. ఆ కాలంలో, ఆ పరిస్థితులలో, అప్పటి ఆలోచనల ప్రకారం సరియైనదిగా భావించి ఆయన చేసినవాటిని —ఇన్నేండ్లు చర్రున ముందుకుపోగి, — ఇప్పటి కాలంలో, పరిస్థితుల్లో చేయవలసిన దానికీ, యిప్పటి ఆలోచనా ధోరణికీ, నేటి వైజ్ఞానిక కాలానికీ అన్వ యింప జూడడం—యిలా చేసివుంటే బాగుణ్ణు అని నిర్ధారించడం ఎంత తేలికో, అంతే తప్పుకూడా. ఇప్పుడు మనం సరియైనవని భావించి చేస్తున్న పనులు ఒకప్పుడు తప్పులుగా కన్పడవచ్చు. అప్పుడు

మన భావితరంకూడా యిలా మనం చేసింది తప్పని భావించడం సహజమే! ఈ విషయాన్ని వ్యాసకర్త ఒక సందర్భంలో 'మన భావితరం మనల్ని నడి రోడ్డుపై బట్టలు వూడదీసి మన అసమర్థతను, నిర్ణయించుకోలేనితనాన్ని వూరేగించి అవమానిస్తుంది' అన్నారు.

గాంధీ చేసిన తప్పులు ఆ పరిస్థితుల తీవ్రతలో బయటకు రాలేకపోయాయి. అసలు అప్పట్లో అవి తప్పులుగా కన్పడకపోయి వుండవచ్చు. ప్రజల వాకట్టుకొన్న అనేక యితర విషయాలమధ్య అవి కొట్టుకపోయి వుండవచ్చు.

ఇక వ్యాసకర్త చెప్పిన దాన్నిబట్టి దిగంబర కవితా స్వరూపాన్ని పరిశీలిద్దాం. నిస్సందేహంగా వీరి కవిత్వంలో ఉన్నతాశయాలు, సామాజిక దృక్పథం, ఉదాత్తమైన ఆలోచన, ఆవేదన వున్నాయి. కానీ వ్యక్తీకరించే తీరే బాగుండలేదు; చాలామందికి వచ్చుటం లేదు. అసభ్య, అశ్లీల, పదజాలం అధికం. కవిత్వోద్దేశం తాను నమ్మిన సత్యాలను బయల్పెట్టడమే; కాని ఒక సక్రమ పంథాలో. ముఖ్యమైనది భావప్రకటన కాని నాలుకజిల కాదు.

బూతును, అశ్లీలాన్ని 'బూతు, అశ్లీలం' అనడం వక్రభాష్యమా? కాదు, ముమ్మాటికీ అది సభ్యతే అనడం వక్రభాష్యమా? లేక యిది వితండ వాదమా? ఉన్నమాటను వున్నదున్నట్లు అంగీకరించేందుకు వెనుకాడే వీరు నేటి సమాజంలో నెలకొన్న పరిస్థితులను తాము వ్రాసినట్లే నమ్మమని ఎలా అడుగుతారు ప్రజల్ని? తామాపని చేస్తున్నపుడు 'అవును మేము వ్రాస్తున్నది అశ్లీలమే, అలా వ్రాయడమే వుచితమైనదిగా భావిస్తున్నాం' అని బల్లగుద్ది చెప్పడం మంచిదా? 'లేదు, యిది అశ్లీలంకాదు, అదివేరు, ఇది కేవలం మీ వక్రభాష్యం, నిరర్థకమైన సాకు' అనడం మంచిదా?

వీరు తమ కవితల్లో వాడే పదజాలం కొంత అశ్లీలమైనదే, బూతే. ఇది నిర్వివాదాంశం. అలా అనడం వారు పేర్కొన్నట్లు 'ఏదో నిరర్థకమైన సాకు' కాదు, 'వక్రభాష్యం' అంతకంటే కాదు. వారంటున్నట్లు వారి 'ఆవేదనను, నిజాయితీని శంకించే వాళ్లెవరూ లేరు. ఈ విషయంలో వీరి తర్కం వింతగొల్పుతుంది. 'బూతుఅని, అశ్లీలం అని 'ఏదో నిరర్థకమైన సాకులతో వక్రభాష్యాలు తలకు రుద్ది దిగంబరకవుల ఆవేదనను— నిజాయితీని శంకించేవాళ్లందరూ ఈనాటి కుష్ఠువ్యవస్థకు ప్రతినిధులు' అంటారు. ఇది హాస్యాస్పదంగా వున్నది. పరీక్షలో కాపీకొడుతున్న విద్యార్థిని అధికారులు పట్టుకొని 'ఇది కాపీ, మంచిపనికాదు' అంటే, అతను తిరగబడి 'ఇది కాపీకాదు' అనడం— పైగా 'నాయీ నిజాయితీని, ఆవేదనను శంకించే మీరే పరీక్షలలోని 'కాపీ'లకు ప్రతినిధులు' అనడంలోని వివేకం ఎట్టిదో సులభగ్రాహ్యమే.

'అసలు భాషలోని బూతు... ...యీ దోపిడీ వ్యవస్థ సాంస్కృతికంగా యిచ్చిన వారసత్వం' అట! భాషలోని బూతుకు, 'దోపిడీ వ్యవస్థ'లోని సంస్కృతికీ ఏమి సంబంధం? ఇదెలాటి వారసత్వం? 'దోపిడీ వ్యవస్థ' మానవజాతిని సాంస్కృతికంగా కృంగదీసినా—సాహిత్యపరమైనభాషపై దాని ప్రభావమెలా పడుతుంది? దానికీ, దీనికీ ఏమి సంబంధం?

'అశ్లీలమనే ప్రత్యేకభాష ఎక్కడా లేదు. అంతరార్థాన్ని — ఉద్దేశాన్నిబట్టి భాష అశ్లీలం' కావచ్చు అంటారు వీరు. అశ్లీలమనే ప్రత్యేకభాష లేకపోయినా సామాన్యభాషలోనే అశ్లీలమనేది వుంది కదా? లేక అదీ లేదా? కేవలం అంతరార్థాన్ని—ఉద్దేశాన్నిబట్టే భాష అశ్లీలం అయితే—ఉన్నతాశయాలు కల్గి, దాన్ని వ్యక్తీకరించడంలో సభ్యేతరమైన పదాలు వాడడం అశ్లీలం కాదన్నమాట! భార్యాభర్త లున్నారనుకోండి. వారి సంబంధం పవిత్రమైనదే, ఉద్దేశాలు మంచివే. వారు తమ అవసరాలు తీర్చుకోవడం భావ్యమే, న్యాయంకూడా. కానీ దానిలోను ఒక విధానముందికదా? తన ఉద్దేశాన్ని తెలిపేందుకు భర్త ఇంట్లో నలుగురిముందు పచ్చికూతలు వాడేందుకు, సభ్యతగా

తెలపడానికీ భేదంలేదా? రెండింటిలోని అంతరార్థం, ఉద్దేశం ఒక్కటే! కాని భాష, వ్యక్తీకరణ వేర్వేరు. ఒక దానిలో అసభ్యత, అశ్లీలం; రెండోదానిలో సభ్యత, సంస్కారం ద్యోతకమౌతాయి. అలాగే ఒకడు తన మిత్రునింటికివెళ్ళి 'మీ నాన్నగారున్నారా?' అనడానికీ, 'మీ అమ్మమొగుడుగారున్నారా?' అనడానికీ లేక అంత కంటే అశ్లీలంగా మాట్లాడడానికీ భేదంలేదా? రెంటి అర్థం, ఉద్దేశం ఒక్కటే, కానీ మాట, భాషల తీరే వేరు. సభ్యమైన పద్ధతిని హర్షించినట్లే, రెండో పద్ధతిని నిరసించుకొంటారు ప్రజలు. తను సాధించదలిచే విషయం మాటల దురుసుతనంచే వక్రించే ప్రమాదంకూడా లేకపోలేదు. కనుక కేవలం అంతరార్థాన్ని — ఉద్దేశాన్నిబట్టికాదు; ముఖ్యంగా మాట తీరును, భాష వాడకాన్ని, పదరూపాన్నిబట్టి అశ్లీలమా? కాదా? అనే విషయం ఆధారపడి వుంటుంది.

'నిత్యజీవితంలోని భౌతిక వాంఛలు, వాటి పరిపూర్ణత అశ్లీలమైతే మానవ జీవితమే అశ్లీలం' అనడం మరీ విడ్డూరం. నిత్యజీవితంలోని భౌతిక వాంఛలు, వాటి పూర్ణతను అశ్లీలమని ఎవరూ అనరు. పరిపూర్ణత సాధించే భౌతికవాంఛలు మానవ జీవితంలో ఎన్నివున్నా వాటిని సభ్యపరిధులకు దాటకుండా వర్ణించినపుడు అది అశ్లీలంకాదు. కానీ యిది భౌతిక వాంఛయేకదా? మామూలేకదా? లోకానికి తెలియనిదేముంది? అని దాన్ని బజారులో వేస్తామా? అలా వేసినప్పుడు దానితోపాటు మానవ జీవితమూ అశ్లీలమౌతుంది.

నేటి సమాజంలో సామాన్య ప్రజానీకాని కెదురవుతున్న దుర్భర పరిస్థితులను అలాగే నగ్నంగా చూపాలనే లక్ష్యంతో సభ్యత అనే ముసుగును తీసివేసి నగ్నంగానే వ్రాస్తున్నాం అని దిగంబర కవులలో నొకరైన శ్రీ జ్వాలాముఖి యిటీవల హైదరాబాదులో జరిగిన సమావేశంలో అన్నారు. ఎంత హీనమైన పరిస్థితులైనా అవి కళ్ళముందు కన్పించేలా భావాన్ని ద్యోతకం చేయగలిగే పదాలు కొల్లలుగా వున్నాయి. వాటివల్ల భావప్రకటనగానీ, కవి ఉద్దేశం గాని ఏమాత్రం దెబ్బతినదు కానీ వీరు అలాటి సభ్యేతరపు మాటలు, అశ్లీల పదాలనే వాడుతున్నారంటే—వీరు చేస్తున్నది సామాన్యుని పరిస్థితులను నగ్నంగా బయల్పెట్టడంకాదు—కవితా కన్యనే నడిబజారులో నగ్నంగా ప్రజలముందు నిలబెట్టి నగుబాటు చేయడం.

వీరంటున్నట్లు ఈ స్థితిలో చాలమంది యువకుల మెదళ్లను శూన్యం ఆవరించివున్నది. అది ఉద్యమాలవైపు తిరుగుతున్నదికూడా వాస్తవమే. కాని శ్రీ నిఖిలేశ్వర్ అంటున్నట్లు 'ఆ మహత్తరమైన మార్పుకోసం యువకులు ముందుకు దూకడం'లేదు. ఇంకా వారు దాన్ని నేర్చుకోవాల్సి వుంది. నేడు వారు చేస్తున్నదల్లా వారి కోసం, వారి ప్రయోజనాలకోసం, వారు కోరుతున్నది, వాళ్లకు ప్రస్తుత సమాజం లోనే ఒకచోటు చూపించమనికానీ వేరే సమాజం కావాలని కాదు. నేటి యువజనులు నేటి సమాజంలోనే సర్దుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు, దానికై పోరాడుతున్నారుకానీ నవసమాజ నిర్మాణంకోసంకాదు. ఉదాహరణకు వారికి ఉద్యోగాలు కల్పించియిస్తే వారిలో యిప్పుడున్న 'శూన్యం' వుండదు. వారు దేన్నో వాంఛిస్తున్నారనుకోవడం తొందరపాటే కాగలదు. వారిలో మౌలికంగా భావవిప్లవం రావాలి. ఆలోచనలను రేకెత్తించాలి.

ఇక వీరూ, నేనూ, అందరూ వాంఛిస్తున్న ఆ 'మహత్తరమైన మార్పుకోసం, అనుసరించదగ్గ మార్గాన్ని యిదివరకే నేను స్థూలంగా చెప్పినా వివరంగా ఆలోచిద్దాం. శ్రీ నిఖిలేశ్వర్ సూచించిన 'సాయుధవిప్లవమార్గాని'కి ప్రత్యామ్నాయంగా ఏం చెయ్యవచ్చో చూద్దాం. దీనికి వేరేమార్గం లేకపోలేదు. కవిత్వాలు, యితర ప్రయత్నాలద్వారా ముందు ప్రజలలో ఒక మానసిక సంచలనాన్ని కల్గించాలి. ఈ భావకల్లోలంతో—సామాన్యప్రజానీకానికి వాస్తవికత స్ఫురించేలా చైతన్యవంతమైన కృషిద్వారా

ప్రయత్నించాలి. నేటి సమాజపురీతిని, కునీతిని వాళ్లకు స్పష్టంగా తెలియజేయాలి. ఇదింకా యిట్లానే వుండడానికి తాము కూడా బాధ్యులన్న భావాన్ని వారిలో కలుగజేయాలి. ఈ భావాలన్నీ వారిలో తిరుగుబాటుతనాన్ని చెలరేపుతాయి. ఎప్పుడీ తత్వం యినుమడిస్తుందో, శిఖరస్థాయికి (Climax) చేరుకొంటుందో అప్పుడు సమాజం తన రంగులను తానే మార్చుకోవచ్చు. లేదా అప్పటి పరిస్థితుల కనువైన విధానాలను అప్పుడు వారే స్వయంగా నిర్ణయించుకొంటారు. అంతేకాని కేవలం బెదరింపులు, 'సాయుధ విప్లవం'ద్వారా ప్రారంభిస్తే అసలు ధ్యేయమే దెబ్బతినే ప్రమాదముంది.

తమ బాధ్యతలను గుర్తింపజేయడం ద్వారాను, కర్తవ్యాన్ని అంగీకరింప జేయడంద్వారాను, నేటి సాంఘిక వ్యవస్థలోని దురవస్థకు తమ ప్రమేయమూ కలదని తెలియజేయడంద్వారాను, ప్రజలను 'ఆ మార్పు కోసం' యీ మార్గంలోకి మళ్లించగలం. అప్పుడే సామాజిక విప్లవం వస్తుంది. ఉదాత్తాశయాలు కలిగి, ఆవేదనతో కూడుకొన్న దిగంబరసాహిత్యం యిందుకు వుపకరిస్తుంది. నేడు నిర్వీర్యుడుగా, నిస్తేజంతోనున్న మానవుడు అప్పుడుత్తేజితుడై పునఃప్రాణ ప్రతిష్ఠను పొందుతాడు. ఒకకొత్త మానవునిగా తానాశించిన, వూహించిన నవసమాజంలో నవనవలాడుతూ వినూత్న జీవనాన్ని ప్రారంభించగలడు.

శ్రీ నిఖిలేశ్వర్ అన్నట్లు 'అభ్యుదయ దృక్పథంగల పార్టీలు చీలిపోవడంవల్ల' నేడు ఫాసిస్టు శక్తులు చెలరేగుతున్నాయి. కానీ అభ్యుదయ దృక్పథం గల పార్టీలు ఎందుకు చీలిపోయాయి? ఆశయం ఒక్కటే, దృక్పథ మొక్కటే ఐనప్పటికీ దాన్ని సాధించే మార్గాలలో అభిప్రాయభేదాలు, విభిన్నాలోచనలు ప్రబలడంవల్లనేకదా? కనుక ఒక ఆశయాన్ని సాధించడానికి సరియైనమార్గం అతిముఖ్యం.

ఇందులోని నా అభిప్రాయాలు, విధానాలు, నేను సూచించిన మార్గం దిగంబరకవులకు నచ్చకపోవచ్చు, నచ్చవుకూడా. వీరు నన్ను 'అభివృద్ధి నిరోధకుడ'ని ఇంకా ఏమేమోఅని అనవచ్చు. కానీ వీరి విధానాలతో ఏకీభవించనంతమాత్రాన వీరు ఏదో అన్నంతమాత్రాన నేను అభివృద్ధి కాంక్షితుణ్ణి కాకపోను. నాకూ ఎంతగా 'నూతన ప్రపంచం' కావాలని, 'నవ్యసమాజం' రావాలని గాఢమైన ఆశయం, యిష్టంవున్నా వాస్తవాన్ని సక్రమంగా చిత్రించలేను గదా?

'సుఖసంతోషాలతో హాయిగా గాలి పీల్చుకొనే హక్కు ప్రతిమానవునికీ వుంది.' నిజమే! ఉంది, ముమ్మాటికీ వుంది. కానీ కేవలం తన శ్రమ, కష్టం, కృషివల్లనే! ఇది లోపించినపుడు ఆ సుఖసంతోషాలు, గాలి ఎవరికోరకూ కాచుక్కూర్చోవు.



# పురుషులకు ప్రత్యేకం

శ్రీ మధురాంతకం రాజారాం

జీవితం యింత రసవత్తరంగా నిత్యనూతనంగా వుండడానికి కారణమేమిటని ఎవరైనా అడిగితే అనుకోని సంఘటనలు ఎదురుగావడమేనని చెప్పవచ్చు. పది పన్నెండేళ్ల తర్వాత హఠాత్తుగా ఒకచోట నరహరి నా కెదురుగావడం అలాంటి అనుకోని సంఘటన. ఒకానొక వివాహానికి దూరప్రాంతం వెళ్లి వస్తూ మార్గమధ్యంలోవున్న పట్టణంలో ఒక పెద్ద ఎగ్జిబిషన్ జరుగుతోందని తెలిసి అక్కడ దిగాను. తెలిసిన వాళ్లెవరూ లేకపోవడంవల్ల హోటల్లో గది తీసుకోవలసి వచ్చింది. ఆ హోటలు మూడంతస్తుల కట్టడం. క్రింది అంతస్తులో పక్కాహోటలు వ్యాపారం నడుస్తుంది. పై రెండు అంతస్తుల్లోనూ గదులున్నాయి. స్నానంచేసి గదిలో కాసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత ఎగ్జిబిషనుకు ఎలా వెళ్లాలో తెలుసుకునే నిమిత్తం క్రిందికి దిగివచ్చాను. సాయంకాలం ఆయిదుగంటలు కావచ్చినా ఆ పట్నంలో ఎండలింకా తగ్గలేదు. పనిలోపనిగా వుపాహారం సేవించి బయటికి వెళ్దామనిపించింది. ఖాళీ కుర్చీ కోసం వెదుకుతుండగా పూర్వపరిచితమైన కంఠస్వరమేదో వినిపించి నట్లయింది. నా అనుమానం నిజమే! అతడు నరహరి. 'అబ్బాయ్ నా కింకొక మసాలాదోసె తెచ్చిపెట్టు. అలాగే ఒక ఊతాప్పం. ఇదిగో, రెండు మైసూరుపాకులు, రెండు పెసరట్లు, అయిదు బోండాలు పార్సెలుగా కట్టి తీసుకరావాలి. క్విక్, క్విక్'అంటూ అతడు సర్వర్‌ను తొందరపెట్టేస్తున్నాడు.

సర్వర్ అవతలికి తప్పుకోగానే అతడికి వెనుకవైపున నిల్చున్న నేను నరహరికి కనిపించాను.

నరహరి నావైపు చూచాడు. ఆ చూచిన క్షణంలో అతడి ముఖంపైన దట్టంగా ఒక నీడ క్రమ్ముకుంటున్నట్లు తోచింది. కళ్లల్లో ఆశ్చర్యం రెపరెపలాడింది. పెదవులుగూడా లీలగా కదిలినట్లు గుర్తు. ఈ తతంగమంతా ఒకటి రెండు క్షణాలలోనే ముగిసింది. తటాలున అతడు నోరు తెరిచేశాడు. 'నువ్వు? నువ్వు రాజశేఖరానివి గదూ! ఎప్పుడొచ్చావీ వూరు? నేనిక్కడ వున్నానని నీకెలా తెలుసు?' అన్నాడు.

నేను నవ్వాను—'బాబూ! నువ్విక్కడున్నావని నేను కలైనా గనలేదు. చూచిన తర్వాతగూడా నువ్వూ నాలాగే యిక్కడికొచ్చివుంటావనుకున్నాను. అదీ పొరబాటే! ఐతే నువ్విప్పుడుండడం యిక్కడే నన్నమాట!'

'అవును మరి. భిలాయ్‌లో కొద్దిరోజులు పని చేశాను. బొంబాయిలో కొన్నాళ్లున్నాను. నాలుగైదేళ్లు కోయంబుత్తూరులో పనిచేశాను. మొదట్లో నా కిక్కడికి రావడం యిష్టంలేదు. హిరణ్యాక్ష వరాలన్నీ కోరాను. అన్నింటికీ సమ్మతించి......ఫ్యాక్టరీ వాళ్లు నన్నిక్కడికి తీసుకున్నారు...' రోడ్డు రిపేరీ జరుగుతున్నందువల్ల మలుపుతిరిగి పొలాల కడ్డంపడి ఎక్కుతూదిగుతూ, ఏటవాలుగా ఒరిగిపోతూవచ్చిన బస్సు మళ్లీ రోడ్డుపైకి వచ్చేసినట్లుగా, యిక్కడి నుంచీ నరహరిప్రసంగంలో వేగమూ, వాల్యూమూ గూడా విజృంభించాయి—'' "లక్ష్మీపురంకాలనీలో యిలు. ఇల్లు కాదులే! బంగళా అనొచ్చు. ఎండాకాలపు రాత్రుల్లో పడుకోడానికని డాబాపైన పూరిల్లుగూడా వేసిచ్చారు. క్రింద గార్డను. పెసిలిటీస్‌కి కొదవేలేదు. మునుపు అయిదారువందలే

యున్నుండేవాళ్లు. ఇప్పుడన్నీ అలవెన్సులూ కలిసి వెయ్యిదాకా చేతికొస్తోంది. చీకూచింతాలేకుండా గడచి పోతోంది లైఫు. హాయిగా వున్నాననుకో!'

నరహరి జీవితం చీకూచింతాలేకుండా గడచి పోవడంలేదని యిప్పుడు నేనన్నానా? ఆతడు హాయిగా వుండడంలేదని అపోహ పడ్డానా? లేదే! ఉత్తపుణ్యానికి నేనేదో దురభిప్రాయంలో వున్నట్టు ఆతడు భావించడం నాకెంతమాత్రం రుచించలేదు.

మాటవరుసకు ఈ వూరెప్పుడొచ్చావని నాపట్ల యించుక ఆసక్తి కనబరిచాడంతేగానీ నరహరి నన్నందుకు బదులు చెప్పుకోనివ్వలేదు. 'మంచి అవకాశం, మించిన దొరకదు' అన్నట్టుగా తాను చెప్పదలచుకున్న వివరాలన్నీ చెప్పుకుపోసాగాడు. ప్రతిసంవత్సరమూ తనకు లభించే బోనసు, విడుదలైన ప్రతిసినిమాకు తాను మొదటిరోజున్నే వెళ్లడం, తాను ధరించే దుస్తుల క్వాలిటీ, తన భోజనంలో నిండి నిబిడీకృతమై వున్న విటమిన్లు—పాడు డబ్బు! సంపాదించి పారెయ్యడమేకాదు, దాని మూలంగా లభించగల సౌకర్యాలన్నింటినీ చెవి పట్టుకుని పిండి మరీ వసూలు చేస్తున్నాడట నరహరి! 'మిస్టర్ రాజశేఖరం! చప్పగా బ్రతికెయ్యడానికా జీవితం? కాదు. కానే కాదు. ఆనందించాలి. అష్ణనుమరి. ఆనందించడానికేనయ్యా జీవితం!'' అన్నాడు. అప్పటికది తాను కనిపెట్టిన కొత్త మతంగా భావిస్తున్నట్టున్నాడు నరహరి! భగవంతుణ్ణిఆనంద స్వరూపు డనుకున్నాం. బ్రహ్మపదార్థం ఏదైతేవుందో అది ఆనందం మినహా మరొకటి కాదనుకున్నాం! లేదంటే ఆ ఆనందాన్ని మానవులందరూ తలాకొంచెం పంచుకునే వెసులుబాటు వుండడం లేదనేగదా మన గోడు! ఎదుటివాడు ఆనందానికి బొత్తిగా విముఖుడైనట్టు, ఏడుపు మొహంపెట్టి హమేషా చీకటిలో కూర్చొనే వాడైనట్టు, జీవితం, డబ్బు, ఆనందం మొదలైనవాటిని గురించి వాడికిగూడా కొన్ని అభిప్రాయాలుంటాయన్న ధ్యాస లేకుండా నరహరి గడగడా మాట్లాడేస్తుంటే నేనేం చేయుగలను?

నరహరి మాట్లాడుతుండగానే మూడు పార్శెళ్లు టేబిలు పైకొచ్చాయి. అయిదురూపాయల బిల్లు చేతికొచ్చింది.

"ఎలాగూ యింతదూరం వచ్చావు. మాయింటికొకసారివచ్చి వెళ్లగూడదా రాజశేఖరం? లక్ష్మీపురం కాలనీలో ఒక పార్కుంది. అక్కడే బస్‌స్టాపింగు. పార్కు ప్రక్కనే జవహర్ లేను. ఆ లేనుపెన బయల్దేరి అటువైపు కొసదాకా వచ్చేస్తే డాక్టరు సుబ్బరాచారి రోడ్డు! అక్కడికొచ్చి ఎవర్నడిగినా చెబుతారు. అయినా అడగడ మెందుకు? పెద్ద పెద్ద అక్షరాలతో బోర్డే వ్రేలాడువుంటుంది...'

'చాలా సంతోషం నరహరీ! నేనీ వూరొచ్చింది ఎగ్జిబిషన్ చూచి వెళ్లడానికని. ఐనా వీలయితే తప్పకుండా మీ యింటికి వస్తాను' అన్నాను.

ఐతే ఈ ఆహ్వాన, అంగీకారాలు రెండింటిలోనూ కొంత తెర మరుగు అంతరార్థముంది. మునుపటి కెవతో ఒకపెళ్లాం 'నువ్వు కొట్టినట్టే కొట్టు. నేను ఏడ్చినట్టే ఏడుస్తాను' అనలేదా? నరహరి ఆహ్వానం, నా అంగీకారం—రెండూ అలాంటివే! 'నేను పిలిస్తేమాత్రం నువ్వొస్తావా? రాగల హృదయవైశాల్యం నీకుందా? రావు. రావని నాకు తెలుసు. ఐనా పిలుస్తున్నాను. కుళ్లేవాళ్లముందే కులకాలి గదా!' అన్నట్టుంది అతడి ధోరణి. నా అంగీకారానికి సైతం కొంత వివరణ అవసరమే! నిష్కర్షగా వస్తానని నేను చెప్పలేదు. 'వీలైతే' అంటూ పొడిమాట ఒకటి అతికించాను. వీలుగాకపోవడానికి నాకవతల ఏమంత పెద్ద రాచకార్యా లున్నాయని? అదేం లేదు. కానీ ఒకవిధంగా నేను ప్రకటించింది అనంగీకారమే! అందుకు నా కారణాలు నాకున్నాయి. అంతగా నేను తన యింటిక్కి రావాలని అభిలషిస్తున్నవాడైతే 'రావోయ్ రాజశేఖరం!' అని అప్పటికప్పుడే అతడు నన్ను బయల్దేరదీయడానికి ప్రయత్నించి వుండవచ్చు. పోగా, యింకొక కారణం వుంది. ఇది మరీ అంత రంగికమైన కారణం. ఇతడు — ఈ నరహరి— నా కళ్లతో నేను చూస్తుండగానే రెండు మసాలా

దోసెలు చాపచుట్టినట్టుగా చుట్టి మింగేశాడు. 'ఊతాప్పం' నామక ఖాద్య పదార్థాన్ని నాలుగే నాలుగు ముక్కలుచేసి ఆహరించేశాడు. గళాసు నిండుకూ తెచ్చిపెట్టిన నెస్‌కాఫీలో ఏదో తక్కువైందని వంకబెట్టి తీసుకెళ్ళి దాన్ని మురుగుకాల్వలో పార బోయమన్నాడు. ఇంత హంగామా చేస్తున్న పెద్ద మనిషి 'ఒరే బాబూ! నువ్వూ కాస్త టిఫినేదైనా తిన్నశాస్త్రం చెల్లించగూడదూ?' అని మొగమాటాని కైనా అడగలేకపోయాడు. అలాంటి వాడికోసం లక్ష్మీపురం పార్కుదగ్గర బస్సుదిగి, జవహరు లేను వెంట బయల్దేరి, డాక్టరు సుబ్బాచారి రోడ్డు రాగానే ఆగి, అక్కడ పెద్దక్షరాలబోర్డుకోసం వెదికి— అబ్బే, ఎందుకొచ్చిన గొడవ? ఎగ్జిబిషన్ చూస్తానేమో! తెల్లవారగానే వెళ్ళిపోతానేమో! నరహరికొక సమస్కారం.

నరహరి వెళ్ళిపోయిన తరువాత కొద్దినిమిషాల వరకూ నేను స్తబ్ధుడినై కూర్చుండిపోయాను.

ఆ నాటి సాయంకాలం నా పాలిటికి శరవే గంగా పరుగెత్తిందనే చెప్పాలి. అది ఎగ్జిబిషను గాదు. ప్రజాసాగరం. మనుషుల నక్కడికి చేరవేస్తున్న ప్రతి రోడ్డూ ఒక మహానది. ఒక్కసారిగా అంత జనాన్ని చూడటానికైనా అక్కడికి వెళ్ళొచ్చు. ఆ సముద్రంలో గులకరాయిలా బుడుంగు బుడుంగున మునిగిపోతూ, పైకి తేలగలిగినప్పుడల్లా ఏవో కొన్ని దృశ్యాలను వీక్షింవ గలిగాను. ప్రాజెక్టులు, ఫ్యాక్టరీలు, ఆధునిక యంత్రాలు చంద్రమండలయాత్ర మొదలైనవన్నీ చిత్రపటాలు గానూ, నమూనా శిల్పాలుగానూ ప్రదర్శింపబడు తున్నాయి. విద్యుద్దీపాలఅలంకరణలో విపణివీధి హరివిల్లును తెంపిపోసినట్టుగా కళ్లకు మిరుమిట్లు గొల్పుతోంది. వినోదప్రదర్శనాలకు లెక్కలేదు. లాటరీలు విరివిగా సాగుతున్నాయి. కానీ ఏమాట కామాటే చెప్పుకోవాలి. ఈ విశేషాలేవీ నన్ను నరహరిని గురించి మరచిపోయేటటు చేయలేక పోయాయి.

తిరిగివచ్చి హోటలుగదిలో పడుకున్నాను. నిద్ర పట్టలేదు. నా తలపులసీమకు నేనెంత పకడ్బందీగా కంచె వేసుకోజూచినప్పటికీ ఏసందులోనుంచో దూరి తటాలున లోపలికి వచ్చేస్తున్నాడు నరహరి!

ఇంతగా నన్ను పట్టుకుని, నరహరి నన్ను వదిలిపెట్టనందుకు ఒక బలవత్తరమైన కారణం వుంది.

అతడు నా బావమరిది. అంటే మా శారద మొగుడు! శారద మా చిన్నాన్నగారి కూతురు.

మొదటినుంచీ చెప్పవలసిందే కథ!

* * *

మా నాన్నగారు చనిపోయేనాటికి నా వయసు పన్నెండు. ఇద్దరు తమ్ముళ్ళూ, నేను, మా అమ్మ, అయిదంకణాల పెంకుటిల్లొకటి, కొంత ప్రావిడెంటు ఫండుపైకం, ఒక జీవిత భీమా పాలిసీ తాలూకు డబ్బు, ఈమాత్రం స్థిరచరాస్తులతో మిగిలి పోయిన సంసారానికి మా బాబాయికన్నా పెద్ద దిక్కు లేదు. బాబాయిపట్ల నాకైనా, తమ్ముళ్లకైనా అచం చలమైన భక్తిప్రపత్తు లున్నాయంటే అందుకు కారణం రక్తసంబంధం ఒక్కటి మాత్రమేగాదు. పరులసొత్తును నిప్పుతో సమానంగా భావించే నిజా యితీ ఎక్కడున్నా గౌరవింపబడేదే! చేతనైనంతతో ఎవడికివాడు స్వంతంగానే సంపాదించాలి. అదిగూడా తప్పనిసరిగా న్యాయార్జితంగానే వుండాలి—అన్న ఆర్థిక సిద్ధాంతం ఆయనది! బాబాయి చేసింది నాలుగు రాళ్లు అదనంగా కళ్ల జూడటానికి వీల్లేని బడిపంతులు ఉద్యోగం గనుక 'వృద్ధనారీ పాతివ్రత్యం' లాగా బాబాయి ఆర్థికనీతి అపహాస్యం పాలయ్యే ప్రమాదం లేకపోలేదు. లంచగొండి బంట్రోతు ఒకడు జనానాలో గంటలుకొట్టే ఉద్యోగంలోసైతం దొంగచాటుగా రూకలార్జించి మూట్టగట్టుకున్న పుక్కిటి కథ ఒకటి యిక్కడ జ్ఞప్తి కొస్తుంది. సంపాదించే విధానంకన్నా, సంపాదించడమే ముఖ్యమనుకున్నట్టయితే ఉపాధ్యాయ వృత్తిలోసైతం ఒకింత అదనపు సంపాదనకు వెసులు బాట్లు వుండకపోలేదని ఈ నాడు చాలామందికి తెలిసే వుండాలి. ఒకసారి మా బాబాయికి గవర్నమెంటు

పరీక్షల పేపర్లొచ్చాయి. ఎగ్జామినర్ చిరునామా పసిగట్టి ఓ పాతికేళ్ల అమ్మాయి పల్నాటిసీమ సివార్లలోనుంచీ ఊడిపడింది. బక్కపలచటి మనిషి. బ్రతుకు బరువుక్రింద క్రుంగిపోయినట్టున్న వాలకం. వందలకొలదిమైళ్ల రైలుప్రయాణంతో నజ్జుగుజ్జయి పోయివచ్చింది. పసితనంలో పెళ్లయిందట! వెంటనే భర్తృవియోగం. నా అన్నవాళ్లెవరూ లేరు. ఉన్నా ఆదుకోరు. పదేళ్లకు మునుపెప్పుడో పరీక్షకు కూర్చుని ఫెయిలయిందట. ఈసారి యిందులో కడతేరితే తన పొట్టకోసం తాను యితరులపైన ఆధారపడవలసిన అవసరం వుండదట! 'మేష్టారు గారూ! మీ కాళ్ళు పట్టుకుంటాను. కనికరించండి. పాసుమార్కు లొచ్చేటట్టు చూడండి'అంటూ అంగ లారుస్తుంది. ఒక మానవుడిగుండె కరగడానికి దయ నీయమైన ఆకృతి, ఒక దుఃఖగాథ యివి మాత్రమే చాలవన్నట్టుగా ఆమె ఒక ఘనసెంటిమీటరు పరి మాణంతో మడిచిపెట్టుకుని ఓ నూరు రూపాయల నోటుగూడా పట్టుకొచ్చింది. బాబాయి పెదవులు ముడివడ్డాయి. భ్రుకుటి కుంచించుకపోయింది. ముఖం గిరుక్కున అవతలికి త్రిప్పుకుని ఆయన మా జానకమ్మపిన్నిని పిలిచి ఆగంతుకురాలికి భోజనం పెట్టమన్నాడు. భోజనం చేసినతర్వాత ఆమెను హాల్లోకి రమ్మన్నాడు. 'అమ్మాయ్! ఇదేపని మగపిల్ల వాడెవడైనా చేసివుంటే చెంపలు వాయించి పంపి వుండేవాణ్ణి. నువ్వాడబిడ్డవి. లేనిపోని ఆశలు పెట్టు కుని యింతదూరం వచ్చావు. పొట్లంలాకట్టి ఓ వంద రూపాయలనోటును ఎంతో పదిలంగా తీసుకొచ్చేశావు. దానితోబాటుగా ఒక గురుగింజంత వసనాభిగూడా తెచ్చివుండవలసింది. కాకపోతే యింతకాలం మనిషిలా బ్రతికి ఒక క్షణంలో నన్ను పసరమై పొమ్మంటావ టమ్మా నువ్వు! నాకూ వున్నారమ్మా నీలాంటి కూతుళ్ళు! ఒకరుగాదు, అయిదుగురున్నారు. వాళ్ళు మా నాన్నగారెంతో మంచివాడని గూడా అనుకుంటు న్నారు. ఈ అభిప్రాయాన్ని బుగ్గిలో కలప మంటావా? జీవితమన్న పెద్దపరీక్షలో నీకూ, నాకూ యింకా మనకందరికీ మార్కులిచ్చేవాడు వేరే వున్నాడు. వాడి పరీక్షలోనమ్మా మనకు పాసుమార్కులు రావలి సింది. వెళ్ళవమ్మా, వెళ్ళు' అన్నారు. అమె వెళ్ళి పోయింది. బాబాయి ఆమెకు మార్కులు వేశాడా, లేదా అన్నది మా పాలిటికి ఒక చిదంబర రహస్యంగా వుండిపోయింది.

ఇలాంటి మా రామనాథం బాబాయిని లోకులు కొందరు అప్పుచేసి తీర్చనివాడని అనుకోవడం నేను విన్నాను. అప్పు, ముప్పు అక్కచెల్లెళ్లని బాబాయి నమ్మకం. ఆయన అప్పు చెయ్యనే చెయ్యడు. ఒకవేళ చేస్తే తీర్చేదాకా నిద్రపోడు. మరైతే ఆయన పైన యిలాంటి అపోహ అల్లుకోడానికి కారణమేమై వుంటుంది? వాకబు చేశాను. అత్యంతాశ్చర్యకరమైన విశేషోదంతం ఒకటి తెలిసింది. బాబాయి అప్పుచేసింది గానీ, దాన్ని తీర్చకుండా ఎగరేసిందిగానీ ఈ జన్మలో కాదట! గడచిన జన్మల్లోనట! దాఖలా ఏమిటన్నాను. ఇదిగో—ఈ అయిదుగురు కూతుళ్లేనన్నారు!

నేను తెల్లబోయాను.

మనం గుర్తించక పోవచ్చు. గుర్తించడానికి నిరాకరించవచ్చు. అంతమాత్రాన ఒక సత్యం లోకం నుంచీ అంతర్హితమైపోదు. ఆ సత్యాన్ని లోకులు మిరపకాయలతో ముంత పొగపెట్టినంత ఘాటుగా, నరాల్లోకి యింజక్షను దించినంత సూటిగా చెబుతున్న మాట నేను కాదనను. కానీ యిది నా ముఖం నీకు, నీ ముఖం నాకు కనిపించేటంత వాస్తవమని మాత్రం ఒప్పుకుంటాను. మా రామనాథం బాబాయి పెద్దకూతురు శారద. గోడకు మేకుగొట్టి పటం తగిలించాలన్నాసరే, బాబాయికి శారద తోడ్పాటు కావాలి. ఆమె పిన్నికి చేదోడుగా లేకపోతే శుక్రవారం తలంట్లయినా వాయిదా పడవలసిందే! నలుగురు చెల్లెళ్లకూ శారదే మానీటరు. ఇంటిని తీర్చిదిద్దడం ఒక అపురూపమైన కళ. ఈ కళాకౌశలం శారదకు చాలా చిన్నతనంలోనే అబ్బింది. మగబిడ్డలు లేని కొరత తనకు శారదవల్ల తీరిందనుకుంటాడు బాబాయి. 'నా తల్లిన్నీ చిదిమి దీపం పెట్టుకోవచ్చు' నంటుంది పిన్ని. రెండో అమ్మాయి సావిత్రి.

అక్కయ్యలా అంత అందంగా వుండదుగానీ, అది మాటల్రపోవు. పాటల పేటిక. నడయాడే రేడియో సెట్టు. మూడోది పద్మ. ఈవిడ పలుకే బంగారం, నడకే సింగారం, లేచినిలబడి కాళ్ళూ చేతులూ విదిలించినా అదొక నాట్యహేలలా వుంటుంది. భార్గవి, మైథిలి—చివరి వాళ్ళిద్దరూ కవలపిల్లల్లా, ముచ్చటైన చలువరాతిబొమ్మల్లా కనిపిస్తారు. ఆ యిల్లు నవ్వుల పూదోట. ఉత్సాహదేవత క్రీడామందిరం. ఈ ఆనందసాగరం లోలోతుల్లో బడబాగ్ని దాగివున్న సత్యాన్ని నేను చాలా ఆలస్యంగా గుర్తించాను.

ఒక్కొక్కరికీ ఎంత కనీసంగా లెక్కవేసుకున్నా ఒక పదివేలు చొప్పున అయిదుగురికీ కలిసి మా బాబాయి యాభైవేల రూపాయల అప్పును లోకానికి చెల్లించుకోవలసివుంది.

పిత్రార్జితం పూజ్యం, ఇల్లొక్కటే ఆస్తి, ఉద్యోగమే జీవనాధారం. ఇతర చాకచక్యాలు సున్న. బాబాయి ఎక్కడినుంచీ తీసుకొస్తాడు డబ్బు! అయిదుగురమ్మాయిలకూ ఎలా పెళ్ళిళ్ళు చేస్తాడు?

స్కూలుఫైనల్లో శారద స్కూలుకంతా ఫస్టున పాసయిందని తెలిసిన రోజున ఆ ఆనందంలో పాలుపంచుకోడంకోసం బాబాయిగారింటికి వెళ్ళాను. పిన్ని తన సంతోషాన్ని మైసూరుపాకుల రూపంలో పంచిపెడుతోంది. రెండు ముక్కలు నా చేతిలో పెట్టి 'ఒకటి నీకు మామూలుగా యివ్వవలసింది. ఇంకొకటి జ్యేష్ఠభాగంరా రాజా!' అంది. శారద చెల్లెళ్ళనందరినీ వెంటబెట్టుకుని గుడికి వెళ్ళిందట. బాబాయి పెరట్లో మల్లెపందిరి దాపుగా వాలుకుర్చీ వేసుకుని వెర్రిగా ఆకాశంవైపు చూస్తున్నాడు.

హక్కున్నవాడికి బాధ్యత వుండకపోదు. పిన్ని మూలంగా నాకున్న హక్కేమిటో తెలిసింది. బాధ్యతను బాబాయి గుర్తుచేశాడు. 'కూచోరా రాజా! నీతో ఒక విషయం చెప్పాలి' అన్నాడు బాబాయి.

కూర్చున్నాను.

'ఈ శారద అనే అమ్మాయి నా అంచనాలను తల్లక్రిందులుగా చేయడమే పనిగా పెట్టుకుందిరా రాజా! పరీక్షలకు కూచున్న వాళ్ళందరూ విధిగా పాసై తీరాలన్న నిర్బంధమేముంది? పోనీ జస్టుపాసుమార్కులతోనైనా పాసు కావచ్చుగదా! అదీ, యిదీకూడా గాకుండా ఈమె చాలామంచి మార్కులతో పాసై పోయింది. చూడగా చూడగా ఈవిడ నా జాతకాన్ని పరీక్షకు పెట్టేటట్టుందిరా రాజా!'

ఎందుకూ, ఎందుకూ అన్నప్రశ్న నా ముఖంలో గింగుర్లు తిరిగి వుంటుంది.

'నిజమే. నీ కర్థంగాదు. ఇప్పుడీమెకు ఖాయంగా స్కాలర్ షిప్పు లభించే అవకాశం వుంది. ఊళ్లో కాలేజీవుంది. పై చదువులకు పంపకపోతే ఊరూ నాడూ వూరుకోదు. అంతెందుకూ? మీ పిన్నికైనా మనం జవాబు చెప్పుకోలేము...'

'..........'

'పోనీ కాలేజీలో చేర్పామనుకో! కాన్సిక్వెన్సస్ ఏమిటి?'

'అబ్బే, ఏముంటుంది బాబాయ్! అక్కడైనా శారదకు మొదటి మార్కులే వస్తాయి' అన్నాను.

'ఎందుకురావు! తప్పకుండా వస్తాయి. శారద నీళ్ళు త్రాగినంత సులభంగా పరీక్షలో పాసై పోతుందని నాకు తెలియదా! అదేరా నన్ను పట్టుకున్న దిగులు! అప్పుడు మనం శారదకోసం ఒక డాక్టరును వెదికి పట్టవలసివుంటుంది. లేదా ఒక ఇంజనీరుకోసం గాలించవలసి వుంటుంది. అలాంటి అల్లుళ్ళని వరించడమంటే మాటలా! ఏనుగను భరించినట్టే! అప్పుడిక ఒక్కశారద పెళ్ళికే మనకు పాతిక వేలు చాలవు......'

నిజమే! చదువు మాన్పించేస్తే అలా పెద్ద పెద్ద కొండలకు సన్నలు వేయవలసినపని వుండదు. గంతకు తగిన బొంతగా ఒకటి సెలక్టు చేసి కొప్పుకు తిరగమని శారదకు బహూకరించవచ్చు.

ఈ మాట నేను మనసులోనే అనుకున్నాను. పైకి అనలేదు. బాధ్యతను భుజస్కంధాలపైన వేసుకునే వయసు అప్పటికింకా నాకు రాలేదు.

కానీ పూచిక పుల్లొకటి అడ్డువేస్తే ఏటిలో నీటిజాలు ఆగిపోదు. ఆగిపోదు సరిగదా ఆ పూచిక పుల్లగూడా నీటివాలువెంట కొట్టుకపోతుంది. శారద చదువుకు లౌకికమైన ఇబ్బందులేవీ అవరోధంగా నిలవలేకపోయాయి. చదువులంతా సరిపోయి, ఇంకా కొంతడబ్బు మిగిలేటట్టుగా ఆమెకు మెరిట్ స్కాలర్ షిప్పులు లభించాయి.

చూస్తూచూస్తూ వుండగానే నాలుగేళ్లు గడచిపోయాయి.

'ఏమండీ! శారదకు పెళ్లి చేయలేదా' అని ఎవరైనా అడిగితే 'అబ్బే, యిప్పుడెక్కడండీ? ఆమె యింకా చదువుకుంటూ వుంది' అని చెప్పుకో గలిగే అవకాశం చేయిదాటిపోయింది.

'చేయవలసిందే కానీండి! పెళ్లికొడుకేనండీ కనిపించకుండా వున్నది' అంటూ బదులు చెప్పుకో వలసిన అవసరం ఎదురైంది.

'ఇకమీదట క్రొత్తగా పుట్టబోతాడా! ఎక్కడో పుట్టేవుంటాడు' అంటూ ఒక గొప్పసత్యాన్ని సెలవిచ్చసాగింది లోకం.

ఎవడో వాడెవడో! ఆ పెళ్లికొడుకు ఎక్కడ వున్నాడో మాకు ఊహాకందేదికాదు.

అతగాడి అడ్రసు తెలుసుకునేందుకు మా దగ్గర మాయల మరాఠీ అద్దాలు లేవు. పక్షులు మాట్లాడే భాష ఎరుగము. చివరకు అంజనకప్పు వేసి చూచుకోడమైనారాదు.

ఈ దశలో బాబాయి మళ్లీ ఒక సందేహం వెలిబుచ్చాడు. 'చూడరా రాజా! ఇంటిని తెగనమ్మి శారదకు భారీ రేటున పెళ్లికొడుకును కుదురుస్తా మనుకో! అదైనా మన ముంగాళ్లకు మనం వేసుకునే బంధం కాకపోదు. ఎలాగంటావా? రెండో అమ్మాయికి రాబోయే పెళ్లికొడుకు పై రేటులో ఒక్కపైసా తగ్గించడానికి ఒప్పుకోడు. ఈ లెక్కన ఆఖరు బిడ్డదాకా మనం ఈ రేటు నియమాన్ని పాటించనైనా పాటించాలి. లేదా వీళ్లలో కొందరికి పెళ్లిళ్లు చేయడమైనా మానుకోవాలి. విన్నావా బాబూ! అదీ సంగతి...'

పెద్దగా కట్నాలు తీసుకోకుండా, ఒకమాదిరి ఆదర్శవివాహాలు చేసుకునేవాళ్లకోసం మేము పత్రికల్లోమాత్రం ప్రకటనలు వెయ్యలేదు. మిగిలిన ప్రయత్నాలన్నీ చేశాము.

వివాహమన్నది ఒక మంచికట్టుబాటుగా, ఒక పవిత్రనియమంగా, నూరుకాలాల పంటగా మనం వ్యవహరించడమంతా మాటల్లోనే! చేతలదగ్గరికి వచ్చేసరికి యిది పూర్తిగా వ్యాపారసరళిక్రిందికి రూపాంతరం చెందడం నేను ప్రత్యక్షంగా గమనించాను. పదివేల రూపాయల పెట్టుబడితో మనమొక వ్యాపారం ప్రారంభిస్తే, అందులో మనం మన పెట్టుబడి తిరిగి రావాలనుకోమా? అందుకు తోడుగా కొంత లాభాపేక్ష వుండడంమాత్రం అనుచితమా? కాదే! అయిన డబ్బంతా కుమ్మరించి కుర్రవాణ్ణి చదివించడమెందుకు? చదువుకున్నందుకు వాడి ఉద్యోగమేదో వాడు చేస్తాడు సరే! వాడి జీతం వాడికి సరిపోతుంది. కాని చదివించినందుకు తల్లిదండ్రుల కేమొచ్చేటట్టు? చిప్ప చేతికి రావాలంటారా? భలేవారండీ మీరు! అదేం కుదరదు. మావాడు డాక్టరు. (కాదా ఇంజనీరు. లేదా లెక్చరరు.) మీరు మాతో సరితూగాలంటారు. మంచిది. మేము తులాభారానికి రెడీ! అబ్బాయి ఈజీక్వల్‌టు అమ్మాయి ప్లస్ పదిహేనువేల రూపాయలు!

నిద్రపట్టని రాత్రుల్లో నేనీ ఈక్వేషన్ని పదే పదే నెమరుకు తెచ్చుకుంటూ గాభరాపడిపోయేవాణ్ణి! 'బాబూ! మీ అబ్బాయి వెల ఎంతండీ?' అని వరుడి వైపు బంధువులను అడిగి తెలుసుకోవాలని వుండేది. మరేం లేదు. అందువల్ల అమ్మాయియొక్క నిజమైన ఖరీదెంతో తెలుసుకోడానికి వీలుంటుందని! మాట వరుసకు అబ్బాయి ఖరీదు పదిహేనువే లనుకుందాం. అమ్మాయి కిమ్మత్తు గుండుసున్న. అబ్బాయివెల పదివేలైతే అమ్మాయి విలువ మైనస్ అయిదువేలు! స్త్రీ పురుషులు, ఆలుమగలు, యువతీయువకులు

అన్నపదాల జంటలు బహుశా ఏ బి. సి. నాటి ఆదిమ సమాజంలోనో పుట్టివుంటాయి. ఇప్పుడవి ద్వంద్వ సమాసాల్లోనేగానీ మానవ సమాజంలో సమానమైనవిగా పరిగణింపబడటం లేదు.

ఇలాంటి గడ్డుపరిస్థితిలో మాకు ఆపదోద్ధారకుడిలా తటస్థపడినవాడు నరహరి.

నరహరిని గురించి చెప్పుకోవలసిన ముఖ్యమైన విశేషం ఒక్కటే! అతడు అయిదువందల రూపాయల జీతగాడు. చదువు, ఉద్యోగం సాధారణంగా పరస్పరాశ్రితాలు. ఐనా ఒక్కొక్కప్పుడిందులో విపర్యయం పొడచూపడం అసంభవమేమీకాదు. చదువుకు తగిన ఉద్యోగం దొరకవచ్చు. ఎల్లెడలా వున్నట్టే ఉద్యోగలబ్ధిలో సైతం అదృష్ట దురదృష్టాల వెలుగు చీకట్లు వుండనే వున్నాయి. నరహరి అదృష్టవంతుడు. ఏ బడిపంతులుగానో, యల్. డి. గుమాస్తాగానో ఉద్యోగ జీవితం ప్రారంభించి వుండవలసినవాడు ఉత్తరదేశం వెళ్లి ఒక సాంకేతిక విద్యలో శిక్షణ పొందివచ్చాడు. మెట్లుమెట్లుగా నిచ్చెన లెగ్రాకాడు. లోకానికి ప్రత్యేకించి చదువుపైన పెద్దగౌరవ మేమీ లేదు. ఎటొచ్చీ బాగా చదువుకుంటే బాగా సంపాదించవచ్చునని అంచనా! మొదటిదానికన్నా రెండోది ముఖ్యం. సాధనకన్నా సిద్ధి ప్రధానం కదా! నరహరి ఆ రెండోపని ధారాళంగానే చేసేస్తున్నాడు. బస్. నరహరికి శారదను యిచ్చినా యివ్వవచ్చు...

ఈ సంబంధం స్థిరం గావడానికి బాబాయి ప్రయత్నంకన్నా నరహరి ధోరణే ఎక్కువగా తోడ్పడిందని చెప్పాలి. అతడు హిరణ్యాక్షవరాలేవీ కోరలేదు. రెండువేల రూపాయల రొఖ్ఖం చేతికివ్వమన్నాడు. దుస్తులకొక వెయ్యి రూపాయలిస్తే చాలునన్నాడు. వరకట్నం తీసుకునే సాంప్రదాయాన్ని మన్నించడానికేగానీ, లేకపోతే తానీమాత్రంగూడా ఆశించి వుండడన్నంత ఔదార్యం వ్యక్తం చేశాడు. వివాహానికొక గడువు నిర్ణయించి, ఆ గడువులోగా ఓ పిల్లమెడలో తాళిగడితే, ఒక లక్ష రూపాయల బహుమానమని ప్రకటించామనుకోండి! ఆ గడువుకిక కొద్దిరోజుల వ్యవధిమాత్రమే వున్నప్పుడు మానవుడు తహతహలాడిపోవడం సహజమే! అలాంటి ఉత్కంఠ ఏదో నరహరిలో కానవచ్చింది. ఇందుకు కారణమేమిటో తెలిస్తే, నరహరి స్వభావాన్ని గురించి ఒక అవగాహనకు రావడానికి వీలవుతుంది. కోదండాన్ని అడిగిచూచాను. అన్నట్టు కోదండ మెవరో చెప్పాలి గదూ! నరహరికో అక్కచెల్లెలుంది, రాజమ్మ అన్న పేరుతో. ఆ రాజమ్మ మొగుడు కోదండం.

నరహరికి తల్లిదండ్రులు లేరు. అందువల్ల మగపెళ్లివారి తరఫున్న ఏకైకప్రతినిధిగా వ్యవహరించే హక్కు కోదండానికే దక్కింది. ఎందుకో తెలియదు గానీ అతడు నన్ను ఆడపెళ్లివారి తరపున ఒక కీలకమైన వ్యక్తిగా లెక్కగట్టేశాడు. దూరంగా తీసుకెళ్లి ఈ పెళ్లి ఎలాగైనా తొందరగా జరిగిపోయేటట్టు చూడమన్నాడు. 'అది కాదండీ కోదండంగారూ! ఇదేమైనా బంగారుకత్తా గొంతు కోసుకోడానికి? ఎందుకండీ ఈ సంబంధంపట్ల యింతగా మొగ్గుజూపుతున్నారు?' అని నేను సూటిగానే ప్రశ్నించేశాను. కోదండం నవ్వాడు. 'అమ్మాయి అందంగా వుంటుందనా?' అన్నాను. కాదన్నాడు. 'గుణవంతురాలనా?' 'ఏమో, ఎవరికి తెలుసు'నన్నాడు. 'సాంప్రదాయం మంచిదనా?' ఆ విషయాన్నిగురించి తాము వాకబు చేయనేలేదన్నాడు. 'బాబ్బాబూ! మరైతే కారణమేమిటో చెప్ప'మని ప్రాధేయపడ్డాను.

చెప్పాడు కోదండం. బాగా చదువుకున్న అమ్మాయినే పెళ్లిచేసుకోవాలన్నది ఆదినుంచీ నరహరి అభిమతమట!

'తెలిసిపోయిందిలెండి కోదండంగారూ! చదువుకున్న అమ్మాయి అయితే సంపాదిస్తుందని! అంతే గదూ?' అన్నాను.

కాదట!—'అబ్బే, అదేం లేదయ్యా రాజశేఖరం! పెళ్లాం ఉద్యోగం చెయ్యడానికి నా బావమరిది చచ్చినా ఒప్పుకోడు. భార్యను పదిమంది మగవాళ్ళలోకిపంపి తన పనేదో తాను చూచుకోడానికి మావాడేం గాజులు తొడుక్కోలేదు' అన్నాడు కోదండం.

పరవాలేదు! అర్ధాంగిని 'బెటర్ ఆఫ్' అంటాడు యింగ్లీషువాడు. జీవితం పొడుగునా సాహచర్యానికి చదువుకున్న అమ్మాయిని ఎన్నుకోవడం ఉత్తమ సంస్కారానికి గుర్తే! ఇందులో నరహరిని తప్పులుపట్టవలసిన పని లేదనుకున్నాను.

తాంబూలా లిచ్చేసుకున్నాం.

వరుడివైపు బంధువులు అత్యల్ప సంఖ్యాకులు. తోబుట్టువు, ఆమె భర్త, ఈ దంపతుల బిడ్డలు ముగ్గురు, కొందరు స్నేహితులు—యింతకుమించి ఆ పెళ్లిలో కొత్తమొగాలేవీ నాకు కనిపించలేదు.

మొదటినుంచీ గ్రంథుల్ని పసిగట్టడం నా వంతయితే వాటిని విడగొట్టడం కోదండం వంతే అయింది. నరహరికి బంధువుల బలగం తక్కువగా ఏమీలేదట! కానీ వాళ్లు నరహరి పచ్చగా బ్రతుకుతున్నందుకు కళ్లల్లో నిప్పులు పోసుకుంటున్నారట! 'వాళ్లకిబ్బడి ముబ్బడిగా నిప్పులు సప్లయి చేయడానికే గదయ్యా ఈ వివాహం!' అంటూ వెకిలిగా నవ్వేశాడు కోదండం.

జీవితం కురుక్షేత్ర సంగ్రామంలాంటిదైతే అందులో నరుడిలాంటి నరహరికి గీతోపదేశం చేస్తున్నవాడు కోదండమేనని నాకు తరువాత తరువాత తెలిసింది. కానీ అతడి విశ్వరూపం తాలూకు సూక్ష్మలక్షణాలనుమాత్రం నేను పెళ్లిపందిరిలోనే గమనించాను. ఏది ఎలా జరగాలన్నా, ఏది ఎలా జరగగూడదన్నా అన్నింటికీ కోదండం తానే నిర్దేశకుడుగా వ్యవహరించడం మొదలెట్టాడు. 'మావాడు పాంటులేగాని పంచలు కట్టుకోడు. తలపాగా చుట్టుకోడం వాడివల్లనయ్యే పనిగాదు. మీరు గంటల తరబడి పీటలపైన కూచోమంటే వాడు కూచోడు... అమ్మాయ్! కాస్త అడుగు సాచి వెయ్యగూడదూ? అడుగులో అడుగు వెయ్యడమేనమ్మా మొదట నేర్చుకోవలసింది......శాస్త్రిగారూ! మీకు పెళ్లి మంత్రాలు క్షుణ్ణంగా రావని మేమనలేదే! కానివ్వండి. తొందరగా ముగించండి...అయ్యా! అరంజోతిని చూడ్డమిప్పుడుగాదండీ! ఇప్పుడు ముందుగా మనం తీసుకోవలసినవి ఉపాహారాలు...' ఇలా అతడు సమస్తమైన పెళ్లితతంగాన్నీ తన యిష్టాయిష్టాలకు అనుగుణ్యంగా సర్దుబాటు చేసుకోసాగాడు.

ఎంత ఎబ్బెట్టుగా వున్నప్పటికీ బంధువర్గాన్ని కలవరపాటుకు లోనుచేసింది కోదండం ప్రవర్తన గాదు—విన్నవాళ్లు విన్నట్టుగా స్తబ్ధులైపోయే ఉదంతం, పెళ్లి జరిగిననాటి సాయంకాలం గుసగుసల స్థాయిలో ప్రచారమైంది. చీర మార్చుకుని, పూలతో జడల్లుకుని, పాపట బొట్టుపెట్టుకుని నాలుగు రకాల కంఠాభరణాలతో ముస్తాబై పెళ్లికూతురు పేరంటాళ్లమధ్య కూర్చుని వుండగా, పెళ్లికొడుకు దగ్గరినుంచీ పిలుపు వచ్చిందట! తక్కుతూ, తారుతూ ఆమె గదిలోకివెళ్లి నిల్చోగానే నరహరి ఒకసారి క్రిందికీ, పైకీచూచి 'చెప్పులు తొడుక్కో! అలా కొంతదూరం షికారు వెళ్లొద్దాం' అన్నాడట! శారద తన చెవుల్ని తానే నమ్మలేకపోయి వుంటుంది బహుశా! 'షికారుకా? అబ్బే, నేను రాను. నాకు సిగ్గు' అంటూ ఆమె యీవరికి రాబోతుండగా 'సిగ్గా! ఎందుకూ? చదువుకోని బ్రూట్‌లా వున్నావే!' అన్నమాటలామెకు విసురుగా వినిపించాయట!

బంధువుల్లో బుద్ధిమంతులైన వాళ్లు కొందరు పై ఉదంతంపైన చక్కని, చిక్కని వ్యాఖ్యానం ఒకటి రూపొందించారు—శారద ఒకవేళ బ్రూట్ అయితే కావచ్చు. కానీ చదువుకోని బ్రూట్‌కాదు!

చిత్రమేమిటంటే పెళ్లయిన క్రొత్తలో ఏ పేచీ ప్రారంభమైనప్పటికీ చివరికది 'చదువు'లోకి పర్యవసానం చెందుతూ వచ్చింది. కోదండం పిల్లలు తలదువ్వమని, స్నానం చేయించమని, బట్టలు మార్చమని యిలా గంటగంటకూ ఒక అభ్యర్థనతో తల్లి దగ్గరకు పచ్చేసేవారు. అన్నగారి అత్తారింటిలో ఆడపడుచు హోదా వెలిగిస్తున్న రాజమ్మ 'అయ్యో, నన్నడుగుతారేమర్రా! పెళ్లి మీ అత్తయ్య నడగండి' అంటూ రెక్కమానులా చేయెత్తి చూపించేది. ఆ కుర్ర కుంకలు గనుక కాస్త ఓపికపడితే వాళ్ల

అవసరాలేమిటో గమనించి పంపేదే శారద. కానీ వాళ్ల కెక్కడి కక్కడే తొందర. వెళ్లినవాళ్లు వెంటనే తిరిగివచ్చి అత్తయ్య వినిపించుకోలేదని మొరపెట్టుకునేవాళ్లు. 'నాదే తెలివితక్కువరా బాబూ! చదువుకున్నా ఎక్కడైనా యిలాంటి పనులు చేస్తారా? ఊరుకోండూరుకోండి. మీకు స్నానాలు, బట్టలు, మార్చుకోడాలు, తలదువ్వుకోడాలు అలాంటి వేవైనా మన వూరికి వెళ్లినతరువాతనే'అంటూ రుస రుస లాడేది రాజమ్మ.

భర్తకోసం భార్య సునాయాసంగా చేసిపెట్టే పనులు కొన్ని వున్నాయి. కోటు వేసుకోడం, గుండీలు పెట్టుకోడం, బూట్లు తొడుక్కోడం, తల దువ్వుకోడంలాంటివి మగవాడు స్వయంగా చేసుకోజాలని వేమీకావు. కానీ అదొక సరదాగా భార్య అలాంటి పనులు చేసిపెట్టడం లోక సహజమే! కానీ యిది మనసూ మనసూ కలిసినతర్వాత మాట. ఇల్లలికి ముగ్గులుపెట్టగానే పండగైపోయిందని తొందరపడితే వట్టిబోకులుతప్ప గంజినీళ్లయినా దొరకవు. బ్రతుకు బ్రతుకంతా పండుగకావడమన్నది ఆలుమగలమధ్య నీవు, నేను అన్న భేదభావం నశించిపోయినప్పుడు మాత్రమే సాధ్యం. భార్య కేదైనా పని పురమాయించి, ఆ పని చేయకపోతే ఆవిడలో విధేయత లోపించినట్టేనన్న కొలబద్ద చేతబట్టుకుని ముళ్ల పైన కూచునేవాడు నరహరి. ఎక్కడికక్కడే పరీక్షలు. ఎప్పటికప్పుడే ఫలితాల నిర్ణయం. మళ్లీ యిందులోనూ ఈ పరీక్షల నిర్వహణంతా ఒక భర్త బాధ్యతపైన్నే జరిగితే అదొక పద్ధతి. అలాకాకుండా దీనికంతా సూత్రధారిత్వం యింకొకరిది కావడంతో పరిస్థితి మరింత జుగుప్సావహంగా తయారైంది.

శారద యింకా పుట్టింట్లోనే వుంది. కన్న వాళ్లను, తోబుట్టిన వాళ్లను వదిలిపెట్టి ఒక అపరిచిత ప్రదేశానికింకా వెళ్లనేలేదు. కానీ పుట్టి పెరిగిన సుపరిచిత ప్రదేశంలోసైతం భర్తవైపు బంధువుల్లో ఏ ఒక్కరు ఎదురైనా ఆమె జడుసుకోవడం నేను గమనించాను. వేటగాళ్లొచ్చేశారు. అడివిలో గుడారాలు వేసుకున్నారు. జింకపిల్ల వలలో తగులుకుంది. తప్పించుకునే వెరవులేదు. రేపో మాపో కాళ్లుకట్టి తమవెంట తీసుకెళ్లిపోనున్నారు. దిగులు నీడలు పారాడుతున్న శారదముఖాన్ని చూచి నప్పుడల్లా ఆ జింకపిల్ల రూపం కళ్లకు గట్టి నట్టుండేది!

అల్లుడితోబాటు గిల్లుడుగా బాబాయిగారింట తిష్ఠవేసిన కోదండం ఉబుసుపోకకోసం అప్పుడప్పుడు నాతో ప్రసంగం మొదలెట్టేవాడు. ఆ మాటల సందర్భంలో అతడు భార్యా భర్తల సంబంధాలను గురించి కొన్ని దివ్యమైన అభిప్రాయాలను నా చెవిలో వేశాడు. మొగుడు రౌతు. పెళ్లాం గుర్రం. రౌతు మెత్తగావుంటే గుర్రం ఏం చేస్తుంది? అన్నాడు. మూడు కాళ్లతో నడుస్తుందన్నాను. 'మూడు కాళ్లతో నడవడమేగాదు. నీ నెత్తి పైకెక్కి కూచుంటుంది. అప్పుడిక రౌతే గుర్రం. గుర్రమే రౌతు. ఏం చేస్తా' వంటూ వళ్లికిలించాడు. 'బాబ్బాబూ! ప్రమాదమే. దీనికి విరుగుడేమిటో సెలవివ్వం'డన్నాను. 'ఉన్నదొకటే ఉపాయం. ఆలస్యం చెయ్యకుండా గుర్రాన్ని అదుపులో పెట్టుకోవాలి' అన్నాడు. ఇందుకైనా సులభోపాయం సెలవివ్వదగిన వారు తమరేనన్నాను. 'ఏముంది! వెనుకా ముందూ చూడకుండా పట్టుకుని చితక బాదడమే' నన్నాడు. కోదండం దండనీతిని నేను మారుమాటాడకుండా ఒప్పుకునేవాడినే! కానీ అతడు పెళ్లాన్ని కొడుతుండగా నేనెప్పుడూ చూడలేదు. 'ఇదిగో, వీళ్లనలా ఎక్కడికైనా తీసుకెళ్లి రాగూడదూ?'అని భార్య ఒకసారి గదమాయిస్తే, ముగ్గురు పిల్లల్ని వెంటబెట్టుకుని మళ్లీ ఒక జాముసేపటిదాకా ఇంటికొక మైలు దూరంలో ఎక్కడా కనిపించని కోదండం రాజమ్మని కొట్టగలడని నేను నమ్మను. తాను సాధించలేకపోయిన పనిని బావమరిది సాధిస్తే కనులపండువగా తిలకించాలన్నది అతడి ఉద్దేశమైతే కావచ్చు.

పులిమీద పుట్రలాగా యింతలో కోదండాన్ని గురించి మరికొన్ని వాస్తవాలు తెలిసొచ్చాయి.

'చాలుబాబూ! ఇక చెప్పొద్దండి' అంటూ దూరంగా వెళ్ళిపోయింది పిన్ని.

'కాదురా రాజా!' వాపోయాడు బాబాయి. 'స్నానం చేస్తుండగా శారద టవల్ తీసుకొచ్చింది. 'సాయంకాలమేనా నాన్నా వూరికి వెళ్ళడం' అని అడిగింది. 'అవునమ్మా' అన్నాను. 'నన్ను మీతోగూడా తీసుకెళ్ళరా నాన్నా? ఇక్కడే విడిచిపెట్టి వెళ్ళిపోతారా?' అంది. ఏంచేయను చెప్పు. వాళ్ళు ముఖమిచ్చి మాట్లాడకనేపోతే యిక అమ్మాయిని పంపించే దెక్కడ?'

ఇల్లుంటుంది. అందులో బల్బులుంటాయి. ఫాన్లుంటాయి. రేడియో వుంటుంది. వైరింగులో లోపం వుండదు. కానీ మెయిన్‌స్విచ్ ఒకటి ఆఫ్ చేసినప్పుడు మిగిలిన వెన్నిఉన్నాలేనట్టే! బాబాయి గారి యిల్లు సరిగ్గా యిలా తయారైంది. నవ్వులు లేవు. పాటలులేవు. ఒకరితో ఒకరు మాటాడుకోడం గూడా తగ్గిపోయింది. బ్రతకాలంటే వేళకింత తిండి తినాలి. ఆ తిండికోసం ఎవరు చేయవలసిన పనులు వాళ్ళు చేసుకపోవాలి. ఆ యింట్లో యింతకుమించిన జీవన చైతన్యం కనిపించడం మానేసింది.

రోజులు గడచిపోతున్నాయి.

బాబాయి రకరకాలుగా ఉత్తరాలు వ్రాసి చూచాడు. దేనికీ ప్రత్యుత్తరం లేదు.

పిన్ని ఎలాగో మూడు మాసాలదాకా ఓపిక పట్టగలిగింది. ఆ పైన అమ్మాయిని కళ్ళ జూడక పోతే తిండి దిగని, నిద్రపట్టని పరిస్థితికి దిగజారి పోయింది.

ఒకనాటి ఉదయం సైకిలుపైన వెళ్తూ పోస్ట్‌మేన్ తటాలున యింటిముంగిట దిగేశాడు. 'పోస్టు' అంటూ కేకవేశాడు. సుడిగాలిలా వెలుపలికి వచ్చి పిన్ని ఉత్తరం చేతికి తీసుకుంది.

ఆ ఉత్తరంలో సంబోధన లేదు. సంతకం లేదు. పెన్సిలుతో గిజిబిజిగా వ్రాసిపెట్టిన కొద్దిపాటి వాక్యాలుమాత్రం వున్నాయి.

'యాతన దుర్భరంగా వుంది. ఉత్తరంలో వ్రాయడానికి వీలులేని పరిణామాలు ఏర్పడ్డాయి. ఆడవాళ్ళుఆత్మహత్యకెందుకుతెగ్గబడతారో తెలుసుకున్నాను. ఒక్కటే కోరిక. ఎలాగైనా యిక్కడినుంచి బయట పడాలి. గుండె అరచేతిలోపెట్టుకుని ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ జాబు మీకు సకాలంలో చేరి, యిది చేరిన నాలుగురోజుల్లో మీరిక్కడికివచ్చి, నేను మీతో వచ్చేయగలిగితే, భగవంతుడా! నాకింకేమీ వద్దు. ప్రపంచంలో మరెక్కడున్నా యింత కన్నా నికృష్టపుబ్రతుకు చవిచూడను...'

దేనికైనా ఒక హద్దుంది. ఇప్పుడిక తాము సించడమంటే ఎలాంటి దుర్వార్త వినడానికైనా సిద్ధపడివుండడమే. ఎందుకైనా మంచిదని బాబాయి నన్నుగూడా తనవెంట రమ్మన్నాడు. మేము బయల్దేరింది ఉదయం అయిదుగంటల ఎక్స్‌ప్రెస్సుకు. గమ్యస్థానం చేరుకునేసరికి సూర్యుడు నడిమింటికి వచ్చేశాడు. రోడ్డుపైన జట్కా నిలవగానే, హాల్లో కూచుని వెలుపలికి చూస్తున్న శారద వీధిగుమ్మంలోకి వచ్చేసింది. బాబాయి లోపలికివెళ్ళి ఆమె పెట్టె తీసుకొచ్చేశాడు. కారుబారుచేస్తూ రాజమ్మ అడ్డు తగులజూచింది. మరికొంతసేపటికి అక్కడ పదిమందీ ప్రోగయ్యేవారే! ఆలోగా జట్కాబండి కదిలింది.

అనుభవించేకాలంలో బాధలకు అంతుండదనే లనిపిస్తుంది. ఒక్కొక్కక్షణం ఒక యుగంలా తోస్తుంది. అంతటి బాధలోనుంచీ కొద్దినిమిషాల్లో విముక్తి లభిస్తే, ఈ సత్యాన్ని నమ్మడంగూడా కష్టమే! అప్పట్లో బుద్ధి స్తబ్దమైపోతుంది. శారద ఈ స్తబ్ధతలోనుంచీ బయటపడడానికి చాలా సేపు పట్టింది.

ఉత్తరంలో వ్రాయడానికి వీల్లేకపోయినా వర్తమానాలు క్రమ్మక్రమంగా తెలిసివచ్చాయి. సూదిపోటు మాటలతో శారద మనసును గాయపరిచారు. ఇంటెడు చాకిరీతో ఆమె ఒళ్ళు హూనమయింది. ఇంత జరిగినా శారద తొణకకుండా వుండిపోయేసరికి

అవతలివాళ్లకు ఉడుకుమోత్తనం ముంచుకొచ్చింది. ఇరుగు పొరుగు యిళ్లలోనుంచీ పత్రికలు తెప్పించు కునే అవకాశం వాళ్లు కల్పించిందే. ఉన్నట్టుండి ఆ పత్రికలద్వారా శారదకు, ఎదురింటి కుర్రవాడికి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయన్న అపవాదు లేవదీశారు. అప్పటికి నరహరి ఆడది మూసిన ముత్యం, పోసిన పగడంలా ఉలుక్కుండా, పలుక్కుండా వుండడం కొంపలార్పే లక్షణమన్న నిర్ణయంలో వున్నాడు. శారద సాంసారిక జీవితం కొద్దినెలలపాటు మాత్రమే కొనసాగింది. ఐనా భర్త అనుమానానికి గురికాకుండా వుండే అదృష్టం ఆమె నుదుట భగ వంతుడు వ్రాసిపెట్టలేదు. కుటిల వాతావరణం గూడుకట్టుకున్న ఆ యింట్లో శారదకు నిస్సహా యత్వం వినా మరొకటి ఎదురుకాలేదు. ఘోరకలి యింతటితో ఆమెను వదిలిపెట్టలేదు. ఒకనాటి మధ్యాహ్నం రాజమ్మ తన పిల్లలతోసహా మిద్దెపైన గదిలో పడుకుని నిద్రపోతోంది. కోదండం మెల్లగా గదిలో ప్రవేశించి శారద చేతిని పట్టుకున్నాడు. అరవబోతే నోరు నొక్కేశాడు. చేతిలో గాజులు విరిగిపోయాయి. చీరచిరిగి పోయింది. గోళ్లుపడిన చోట్ల గాట్లుపడ్డాయి. కొండంత దౌర్భాగ్యంలో గోరంత అదృష్టంలా ఆ పెనగులాటలో శారద తాను తానుగా బయటపడ గలిగింది.

మనసులో చోటు చేసుకుని ఆ పైన శరీరం జోలికి వెళ్ళడం మనిషి మర్యాద. శరీరాన్ని ఆక్ర మించుకుని మనసును అధోలోకాల్లోకి అణగ ద్రొక్కడం అందుకు విరుద్ధం. మనుషులు కని పించని చోటునుంచీ మళ్లీ మనుషులు నడయాడే ప్రపంచంలోకి రాగలిగింది శారద. కానీ పాత జ్ఞాప కాలను నెమరువేసుకుంటున్నప్పుడు తలచాటులేని పెనుభీడులో జడివాన వాతబడి తడిసి ముప్పందు మైన పావురంలా ఆమె కుంచించుకపోయేది.

శారద తిరిగి వచ్చిన తరువాత బాబాయి గారింట్లో పోస్టుమేన్‌కోసం వేచి చూడడం మాను కున్నారు. కానీ వద్దన్నా వెంట తగులుకునే అతిథి సత్తముడిలా అతడు తరచుగా యింటిముందర దిగ సాగాడు. ఆ ఉత్తరాలన్నీ నరహరి వ్రాసినవే! ఉత్తరా లనడంకన్నా వాటిని శ్రీముఖాలనడం సబబు. ఒక్కొక్క ఉత్తరం ఒక అగ్నిమేటం.

పెళ్లిమూలంగా యువతీయువకులు సన్ని హితులౌతున్నారు. వాళ్లొకరి నొకరు విడిచిపెట్టి దూరంగా వుండిపోవడానికి వివాహబంధం నమ్మతించదు. ఎవడి పెళ్లాం వాడిసొత్తు. ఇప్పుడుకాదుగానీ ఒక ప్పుడు ఈ సొత్తును చచ్చిపోయిన మగడితో బాటుగా కాష్టంలోపెట్టి కాల్చిచంపివేసే సంప్ర దాయం అమల్లో వుండేది. ఇప్పుడైనా 'నా సొత్తును నేనేమైనాచేసుకుంటాను.నువ్వెవడివయ్యా అడగడానికి' అంటూ అడ్డుపడినవాడిని తన్ని తగలేసి పెళ్లాంపైన విచ్చలవిడిగా ప్రతాపాన్ని వెచ్చించే మగటిమి అరు దుగానైనా కానరావడం ముదావహం. తనతో చెప్ప కుండా, తన అనుమతిపొందకుండా తన పెళ్లాన్ని ఒక పెద్దమనిషి (సదరు పెద్దమనిషి ఆ పిల్లకు తండ్రయితే అవుగాక!) తనవెంట తీసుకెళ్లి పోతాడా? ధర్మం ఒప్పుకుంటుందా? చట్టం నిద్ర పోతుందా? కాచుకో సవ్వాల్ అంటూ బాబాయిని వుత్రికాసమేతంగా కోర్టుకులాగి బోనులో నిలబెట్టి వాళ్లపైకి చట్టాన్ని ఉసికొల్పాడు నరహరి.

వాది తరపున వకాల్తా పుచ్చుకున్న వకీలు శారదను అడగగూడని ప్రశ్నలన్నీ అడిగాడు—

పెళ్లికాకమునుపుగానీ, అయినతర్వాతగానీ నువ్వు నీ భర్తనుగాకుండా యింకెవరినైనా ప్రేమించావా? ఈ పెళ్లి నీ యిష్టానికి వ్యతిరేకంగా జరిగిందా? భర్త నిన్ను కొట్టడంగానీ, తిట్టడంగానీ జరిగిందా? ప్రేమగా చూచుకోలేదంటే అర్థమేమిటి? ప్రేమగా చూచుకునే వాళ్ల లక్షణాలు ఎలాంటివి? నీ శీలం పట్ల భర్తకు సదభిప్రాయం లేకపోవడంలో న్యాయం లేదని చెప్పగలవా? నీకూ, నీ భర్తకు మధ్య లైంగిక మైన అసంతృప్తి ఏమైనా వుందా?

" సిగ్గు, లజ్జ అనేవి స్త్రీకి పెట్టని ఆభరణా

లైతే తాను చేసిన నేరానికి (?) శారద వాటిని గూడా వదలుకుని జవాబులు చెప్పవలసి వచ్చింది.

కళ్లు గట్టిగా మూసుకోవాలి. మనశరీరం మనది కాదనుకోవాలి. అవ్యాంగనాలు లాగివేస్తుంటే ఊరుకోవాలి. కత్తులతో కోస్తున్నా కిక్కురు మనగూడదు. న్యాయస్థానం గూడా ఆపరేషన్ థియేటరులాంటిదే! నిజాన్ని తెలుసుకోడానికి జరిగే ప్రయత్నంలో ఎంతటి దుస్సహమైన బాధనైనా ఓర్చుకోక తప్పదు.

శస్త్రచికిత్స పూర్తిచేసి కత్తి క్రిందపెట్టిన డాక్టరులా, న్యాయమూర్తి కలం క్రిందికి దించి న్యాయనిర్ణయం చదివి ముగించాడు. కోర్టు వివాహ విచ్ఛిత్తికి సమ్మతించింది. కాపురం చేయటానికి యిష్టపడనివ్యక్తి భార్యే గనుక, భర్త భరణం చెల్లించవలసిన అవసరంలేదని న్యాయాన్ని విడమరిచి చెప్పింది.

* * *

మరునాటి ఉదయం చాలా ఆలస్యంగా నిద్ర లేచి రైలుకోసం వాకబు చేశాను. నలుగురూ నాలుగు విధాలుగా చెప్పడంవల్ల స్టేషనుకేవెళ్లి తెలుసుకోవడం మంచిదనిపించింది. బహుశా నేను దారిలో వుండి వుంటాను. పదిగంటల రైలు దాటిపోయింది. మళ్లీ మధ్యాహ్నం మూడు గంటలకుగానీ బండిలేదని తెలిసింది.

చేసేదిలేక బెంచిపైన చతికిలపడ్డాను.

అర్థరాత్రిదాకా నిద్రపట్టకపోవడం, ఉదయం ఆలస్యంగా నిద్రలేవడం, తీరా స్టేషనుకు వచ్చేసరికి రైలు వెళ్లిపోవడం, గోళ్లు గిల్లుకుంటూ కాలహరణం చేయవలసిరావడం — యిదంతా నరహరి మూలంగా వచ్చింది.

పునరాగమనం! నేనీ వూరు వదిలిపెట్టేదాకా నరహరి నన్ను వదిలిపెట్టేటట్టులేడు.

సమయానికి బుద్ధి సరిగ్గా పనిచేయకపోవడం చికిత్సలేనిజబ్బు. నరహరి ఎదుట నా మందబుద్ధి నావాట్టకునాకే బుజువైపోయింది. నరహరిమూలంగా శారదకు లభించిన అమూల్యమైనవరం విడాకులు. జీవితంనుంచీ విడాకులు పుచ్చుకుంటేగానీ జీవాత్మ వ్యాపకంలేకుండా వుండటం కుదరదు. బ్రతికి వున్నంత వరకూ ఏదో ఒకపనిలో నిమగ్నం గాకపోతే ప్రొద్దు గడవదు. కొంతకాలం శారద అన్ట్రెయిన్డు టీచరుగా పనిచేసింది. జిల్లా పరిషత్తే ఆమెను ట్రెయినింగుకి పంపింది. ట్రెయినింగులో వుండగా ఆమెకు సూర్యనారాయణతో పరిచయమైంది. ఒకరినొకరు అర్థంచేసుకున్నతర్వాత పెళ్లి కుదిరింది. ఉద్యోగం చేయడంవల్ల తన పరువుకు నేగి వాటిల్లవచ్చునని సూర్యనారాయణ భావించలేదు. ఉద్యోగంచేస్తూ ఆ భర్త తోడ్పాటుతో యం. ఏ. పరీక్షకు కూర్చుంది. ఇప్పుడిద్దరూ ఒకే కాలేజిలో పని చేస్తున్నారు. ఇద్దరు బిడ్డలు. స్వంతయిల్లు. పొరపొచ్చాలముళ్లచెట్లు లేవు. అరమరికల పల్లేరు తీగలు లేవు. ఆ సంసారం అందమైన చిన్నపూల తోటలా వుంటుంది...కానీ ఈ వివరాలేవీ నేను నరహరితో చెప్పనేలేదు!

ఐనా నేనందుకు చింతించడం లేదు.

తెలుసుకోవలసిన ముఖ్యమైన విశేషం ఒకటి తెలుసుకోకుండానే, ఈ పట్టణాన్ని వదిలిపెట్టి వెళ్లి పోతుండడ మొక్కటే తీరని వెలితిగా నన్ను వెంటాడుతోంది.

గృహిణిగా కాపురాన్ని చక్కదిద్దుకోడానికి కావలసిన గుణగణాలన్నీ శారదకు పుష్కలంగా వున్నాయని నా నమ్మకం. కానీ శారద నా చెల్లెలు. పక్షపాత దృష్టిలోనుంచీ నాకిలా అనిపిస్తున్నదేమో! ఏమైనప్పటికీ నరహరికి ఆమెలో అన్నీ దొసగులే కన్పించాయి. కొద్దిమాసాల దాంపత్యజీవితంలో అతడామెను సంసారానికి లాయకీలేని ఆడదిగా తేల్చి పారేశాడు. మరైతే అదే నరహరి యిప్పుడేమో తనకు జీవితం నందనారామంగా, ఆనందకందంగా వుందంటున్నాడు. అతడి పెదవులకు ఆ ఆనంద మధుపాత్రను అందిస్తున్న గృహిణి ఎలాంటిదై వుంటుందో నేను తెలుసుకోవద్దా?

మానవసహజమైన కుతూహలం హఠాత్తుగా నాచేత ఒక నిర్ణయం చేయించింది. లెదర్‌కేసును క్లోక్‌రూములో పెట్టించి రోడ్డుపైకి వచ్చాను. లక్ష్మీపురంకాలనీ అక్కడికి దగ్గరేనట! రిక్షావాలా పదిహేను నిమిషాల్లో తీసుకపోగలనన్నాడు.

ఇంచుమించుగా పదకొండుగంటలకు నరహరి యింటి ఆవరణలో ప్రవేశించాను. మెట్లెక్కి వసారాలోకి వెళ్ళాను. ఇంటిలోపలినుంచి కలకలం వినిపించడంలేదు. ద్వారం దాటుకోగానే హాలు. తుక్కు కాగితాలు, మాసినగుడ్డలు, పేకముక్కలు హాల్లో చిందరవందరగా పడివున్నాయి. కావడానికది పాలగచ్చే! కానీ గచ్చుపైన ఒక పొరగా వ్యాపించివున్న దుమ్ము పాదాల కంటుకుంటూవుంది. పైకప్పుకు గూడా అలాగే బూజు తెరలు తెరలుగా వ్రేలాడుతోంది. కొద్ది నిమిషాలు వేచిచూచి 'నరహరీ!'అంటూ గొంతెత్తి పిలిచాను. 'ఎవరూ?'అంటూ బదులు వినిపించింది. మరుక్షణంలో నరహరే కనిపించాడు. ఇప్పుడతడు నడుముకు లుంగీ చుట్టుకున్నాడు. బనీను తొడుక్కున్నాడు. ముంజేతులపైన మసిమరకలు కానవస్తున్నాయి.

'నువ్వా రాజశేఖరం! వచ్చేశావా! అబ్బే, నువ్వొస్తావనుకోలేదు. కూర్చో...' నిస్సహాయకరమైన పరిస్థితిలో పడిపోయి, వీలయినంతవరకు దాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టుగా అన్నాడు నరహరి.

కూర్చుంటూ 'ఏదో పనిమీద వున్నట్టున్నావు' అన్నాను.

'ఏం లేదు. స్నానం చేద్దామని బాత్‌రూంలోకి వెళ్తున్నాను. నువ్వొచ్చావ్...'

కానీ స్టౌ మండుతున్న సవ్వడినిబట్టిచూస్తే అది బాత్‌రూమై వుంటుందని అనిపించడం లేదు.

'ఉండు ఇప్పుడే వస్తాను' అంటూ నరహరి నడవదారిగుండా నిష్క్రమించాడు.

స్టౌ మండుతున్న గది కెదురుగా వేరొక గది ఒకటి వున్నట్టుంది. టెలిఫోన్ పైన్నుంచి మాట్లాడుతున్నట్టుగా అటువైపునుంచీ మాటలు వినవచ్చాయి.

'ఎవరతను... ఎందుకొచ్చాడు?... వస్తేరానీ... కాఫీ యిస్తే పోలా!...ఊహూ, అబ్బురంగానే వుందే...'

నరహరి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు. ఇప్పుడతడు ఖరీదైన పాంటు తొడుక్కున్నాడు. పొంకంగా పొట్టి చేతుల చొక్కా తగిలించాడు. జిడ్డోడుతూ గుడ్డిగావ్వుండిన ముఖంలోకి పైపూత వల్ల కాస్తా కళగూడా వచ్చేసింది.

'నువ్వు ఖాయంగా వస్తావని తెలిసివుంటేనా రాజశేఖరం! నీట్‌గా ఒక డిన్నర్ అరేంజ్‌చేసి వుండేవాణ్ణి. ఎంగేజిమెంటెప్పుడూ డెఫినిట్‌గా ఫిక్స్ చెయ్యాలి...' ఆగి గొంతు హెచ్చించి గోడవైపు చూస్తూ అన్నాడు నరహరి 'ఇదిగో నాగమణీ! కాఫీ, రెండు కప్పులు...'

చదువుతూ చదువుతూవున్న పత్రికను రూళ్ళకర్రలా చేతివ్రేళ్ళమధ్య చుట్టిపట్టుకుని ఒక ముప్ఫైయేళ్ళావిడ సందులోనుంచీ హాల్లోకి తొంగి చూచింది. 'కాఫీయా? రెండు కప్పులా!' తన చెవుల్ని తానే నమ్మలేకపోతున్నట్టుగా ప్రశ్నించింది.

'ఔనౌను. కప్పులు రెండే!' తడబడ్డాడు నరహరి.

'సాసర్లెన్ని?' ఆమె కదిలిపోతూ నవ్వుతోంది.

బిక్కుబిక్కుమంటూ నావైపు చూచాడు నరహరి. నేను నవ్వుతున్న నాగమణి స్వరూపంకేసి చూస్తున్నాను. ఆడవాళ్ళల్లో పహిల్వాను లుంటారేమో తెలియదు. దిట్టమైన పహిల్వాన్ ఆకారం ఆమెది. పనిమీద వుండిపోయిందేమో, యింకా ముస్తాబు కాలేదు. ముంగురులు చెదరిపోయివున్నాయి. శరీరాన్ని పొందికగా పొదివి పట్టుకోడంలో ఆమె దుస్తులకుగూడా అంతోయింతో అలసత్వం అబ్బినట్టుంది. అందువల్ల ఎక్కడి అందచందా లక్కడివిగా కానవస్తున్నాయి.

ఆమె రెండే రెండు నిమిషాల్లో మూడు కప్పుల కాఫీ పట్టుకొచ్చేసింది. 'ఒకటినాకు' అంటూ నరహరివైపు కొరకొర చూచింది.

'చూడు మణీ! ఇతడు రాజశేఖరమని, నాతో బాగా పరిచయమున్నవాడు. ఈ వూరుకాదులే! ఎగ్జిబిషన్ చూడ్డాని కొచ్చాడట! అన్నట్టు ఎగ్జిబిషన్ ఎలా వుంది. రాజశేఖరం?'

'చాలా బాగుంది' అన్నాను.

'ఏమిటండీ బాగున్నది?'

టేబిలుపైకి వంగిపోయి, కప్పు పైకెత్తకుండా పెదవులతో అలాగే కాఫీ చప్పరిస్తూ, కళ్ళుమాత్రం పైకెత్తి సూటిగా నా కళ్ళల్లోకి చూస్తూ అడిగింది నాగమణి

పాపం శమించుగాక! పొరబాటుగా ఆమెవైపు చూస్తూ నేనామాట అన్నానేమో! తలదించుకున్నాను.

ఇల్లు చూపెడతాను రమ్మని నరహరి నన్ను లోపలికి తీసుకెళ్ళాడు. ఇల్లేమో బాగానే వుంది. కానీ ఎక్కడుండవలసిన సరంజామా అక్కడుండడం లేదు. ఎలా వుండవలసినవి అలా వుండడం లేదు. ఏదోమరవిరిగి రేడియో పాడటం లేదట! పనిమనిషి క్రమంగావచ్చి నీళ్ళు పోస్తుంటే తోటలోని చెట్లు వాడిపోయేవికావట. దేశయాత్రకు వెళ్ళి తాను తీయించుకున్న ఫోటోల ఆల్బం ఎక్కడో వుండాలన్నాడు. అలమరాల్లోనూ, పెట్టెల్లోనూ వెదికివెదికి చివరికొక చెత్తడబ్బాలోనుంచీ దాన్ని పైకితీశాడు. ఏవిధంగా చూచినా ఆ యింటికి సంబంధించిన ప్రతివిషయమూ అస్తవ్యస్తంగానే వుంది. కానీ నేనీ వాస్తవాన్ని పసిగట్టకుండా వుండడం కోసం నరహరి మాటల వర్షంతో నా చెవుల్లో అదే పనిగా ఊదరపెట్టేస్తున్నాడు.

హాల్లోకి తిరిగి వచ్చేటప్పటికి మిసెస్ నరహరి వాలుకుర్చీలోకిమారి, కుర్చీపైకి కాళ్ళు చాపి కారియర్ పట్టుకొచ్చిన కుర్రవాడితో మాట్లాడుతోంది.

'వెళ్ళొస్తాను నరహరీ!' అన్నాను.

సాగనంపుతూ అవసరం లేకపోయినా సంజాయిషీ చెప్పుకున్నాడు నరహరి. 'ఆదివారం గదా! బద్ధకంగా వుండడంవల్ల వంట చేసుకోలేదు. హోటలునుంచీ కారియర్ తెప్పించుకున్నాం...'

రోడ్డుపైన రిక్షాబళ్ళు కనిపించలేదు. మెల్లగా నడిచి బస్స్టాపుదాకా వచ్చాను.

'ఎందాకా వెళ్ళాలండీ బాబుగారూ?' కారియర్ తెచ్చిపెట్టి, నా వెనువెంటనేవచ్చిన కుర్రాడు పలకరించాడు.

'వెళ్ళవలసింది రైల్వే స్టేషనుకే! తొందరేం లేదు. తీరిగ్గానే వెళ్ళొచ్చు. దారిలో ఎక్కడైనా భోజనంచేసి వెళ్ళాలి...'

'హోటలెల్లోరా కొచ్చేయండి. మీల్స్ చాలా బాగుంటుంది. నరహరిగారింటికి భోజనం సప్లయి చేస్తున్నది మేమే!

పెద్దగా ఆసక్తి వ్యక్తంగానివ్వకుండా 'ఇంట్లో వండుకోరా?' అన్నాను.

'వండుకోడానికి ఒళ్ళు వంగొద్దూటండీ! ఆవిడ తింటుందిగానీ వండదు. పడుకుంటుందిగానీ పరుపులియ్యదు. ఇంట్లో వుంటుందిగానీ యింటిని సుబ్బరంగా వుంచదు. చెయ్యని తిండి. తియ్యని పరుపు. దిగని కుర్చీ. అందరికీ జరిగేదేనటండీ ఆ వైభోగం?'

'అయ్యో పాపం! నరహరి ఓపికను మెచ్చుకోవలసిందే!' స్వగతంలా చెప్పుకున్నాను.

'ఓపిగ్గా వుండకేం చేస్తాడు? కట్టుకున్న పెళ్ళామటండీ కట్టుబాటులో వుండడానికి? ఎక్కువగా మాటాడితే చక్కాలేచి పోతుంది. చీర విడిచి పెట్టి చీరకట్టుకున్నట్టే!'

పగలబడి నవ్వుతున్నాడు కుర్రవాడు.

# "పాపం శమించుగాక!"

## శ్రీ గుమ్మడపు రామకృష్ణరాయణం

పారుతున్న కాలాని కనుగుణంగా
రోజుకోగది, వారానికో యిల్లు
పక్షానికో వీధి, మాసానికో వూరు
మారుతూ
ఇంటిపేరునూ, ఒంటిపేరునూ
కరక్కాయ సిరాలో కలిపి
కలాల్లో దాచుకున్న
స్వేచ్ఛా సంచారుల అడ్రసులు దొరక్క
పోస్టు బంట్రోతు
బట్వాడా కాని ఉత్తరాలబరువుతో
భారంగా తిరుగుతున్నాడు.
అమ్మకు అన్నం పెట్టని సుపుత్రుడు
పిన్నమ్మకు పిండివంటలు పెడుతున్నాడు.
తల్లి శీలాన్ని శంకించిన తనయుడు
తన నిజాయితీని కూర్చి డబ్బాకొట్టుకుంటున్నాడు
దీపాన్ని తిందామనుకుని
దివ్వె చుట్టూ తిరుగుతున్నాడు.
నీకొడుకు నిన్ను తిడుతున్నాడు.
అమ్మా!
ఆంధ్రకవితా సరస్వతీ!
భారతీ!
పాపం శమించుగాక!

రాజులు మత్తులనీ
వారి సేవ నరకప్రాయమనీ

## " పా పం శ మిం చు గా క! "

తుచ్ఛమైన ఐహికసుఖా లశాశ్వతాలనీ,
మతాలపేరిట మస్తకాలు నరుక్కోవడం
మానవతకు లక్షణంకాదనీ,
కావ్యాలు నరాంకితం చెయ్యరాదనీ,
గంటా లరిగిపోయేటట్టుగా రాసి,
అరిగిపోతున్న పదాలకు
ఆకారాలు వేసి
మారిపోతున్న అర్థాలకు
ప్రాణాలు నూరిపోసి
సర్వమానవసమాజ సౌఖ్యాన్ని కోరి
భగవద్భక్తులై, భాషాపోషకులై
నిష్కాములై నిష్కర్షించి
నీ కన్నీళ్లు తుడిచి
అనంతకాలగర్భంలో కలిసిపోయిన
ఆ మహనీయులందరూ,
గతకాలపు మాన్లు పట్టుకుని వ్రేలాడిన
గబ్బిలా లేనా ?
మతదురహంకారు లేనా ?
మాకు వారిచ్చిపోయినవన్నీ
మైలగుడ్డ లేనా?
ఇంతకాలంగా
మా కండరాలకూ, కలాలకూ
బలాన్నిచ్చినవి, యీ
తెలుగుదేశంలో పండిన
తెగులు కంకుల పుచ్చుగింజ లేనా ?
చెప్పమ్మా!
శతగోపం పెట్టడానికి
సరిపడ్డ శిరస్సులు దొరక్క,
పుణ్యానికి దొరికిందని మెక్కిన
పులిహోరా చక్కెర పొంగలీ అరక్క.

## హారతి

గర్భగుడి గడపముందు
గగ్గోలుపడుతూ
బెదిరిబేజార్లై పోతున్న యీ జనతా
పూజారులంతా,
ఉద్భిజ, అండజ, స్వేదజ,
జరాయుజాలనే నాలుగు విభాగాలకందక
కల్లోలజాలజాతికి చెందిన యీ
కంకాళప్రియులంతా,
యుద్ధరంగంలో పుష్పక విమానంమీద
మాయాసీతను జుట్టుపట్టి తల నరికి
ఇంద్రజాలాన్ని చేస్తున్న యీ
ఇంద్రజిత్తులంతా,
పగిలిన శంఖాల నూదుతూ
విరిగిన చక్రాలను త్రిప్పుతూ
నెమలియీకెలు నెత్తిన పెట్టుకొని
గాండ్రిస్తున్న యీ
పాండ్రకులంతా,
నవసమాజం, నవత, సామ్యజీవనమనే
ఎర్రల్ని గాలాలకు గ్రుచ్చి
ఊరచెరువుకట్టమీద
ఎంతసేపు జపంచేసినా
ఒక్క చేపకూడా పడక
బిక్కచచ్చి
కావలసినంత బురద దుర్గంధాన్ని పీల్చి
కడుపు నింపుకుంటూ,
మాటకుముందు 'పాపం, పాపం', అంటూ
జాలి నటిస్తున్న యీ
జాలరులంతా,

## "పా పం శ మిం చు గా క!"

విశ్వరూపం చూపించడానికి
విగ్గులు కొనుక్కుంటూ
మందిస్తున్న మంత్రసానిని
మహామారివని తిడుతూ
కుళ్లిన సమాజంలో పుట్టే
కుక్కగొడుగుల నీడక్రింద
అడ్రసు లేని,
ఆకారం లేని
అమ్మాయిని కనడానికి
కొంగనొప్పులు పడుతున్నారమ్మా!

దూడకు గడ్డి తేవాలంటే
కాడిచెట్టుక్కి లాభం లేదనీ
చెవులో చీము కారుతున్న వానికి
సీసపద్యం వినిపించవద్దనీ,
వాంతి చేసుకుంటున్న వానిమీద
వచనకవిత చల్లక్కర్లేదనీ,
వెంకటాయవేషాలు చాలించి
వెంటనే వైద్యుణ్ణి తెమ్మనీ
చెప్పమ్మా!

కాలరుమీద పట్టి మురికి
కడిగి తీసివేసే
సన్‌లైటు
సబ్బుబిళ్లా,
మలేరియా దోమల్ని చంపడానికి
వంట యింటి చూరుల్లో
వసారాల మూలల్లో కొట్టే
డి. డి. టి. స్ప్రేయరూ,

ఏ ప్లాటు ఫారంమీద
ఏ రైలు ఎన్ని గంటలకు బయలుదేరి
ఎక్కడికెవ్వడు చేరుతుందో చెప్పి
మనిషికి మంచిమార్గం చూపించి
మళ్ళీ వచ్చే ఏడాది ఏప్రిలు ఒకటికి
మారిపోయే
సెంట్రల్ రైల్వే గైడూ,
కవిత్వంగాదనీ,
కవిత కామమయంగాదనీ
కవిత కల్లుతొట్టిగాదనీ,
కసిగాదనీ
మసిగాదనీ,
కరుణతో
కన్నీటితో
పతితుల్ని, బాధితుల్ని
సముదాయించే, సముద్ధరించే
శక్తి, ఆసక్తి
చిన్నతనంనుంచీ నాలో
చిగుళ్లువేసి పెరుగుతున్నాయనీ,
అందుకోనం
పెద్దబాకా లూదక్కర్లేదనీ
పెద్దలను దూషించక్కర్లేదనీ,
పెద్దబాలశిక్షను శ్రద్ధగా చదువుకొమ్మనీ, ఈ
ఆదిమ నివాసుల్ని పిల్చి
ఆప్యాయంగా మరొక్కసారి
చెప్పి చూడమ్మా!

# తెలుగు అర్జీలు - ఆంగ్ల పదాలు

**శ్రీ కొలకలూరి ఇనాక్.**

ఆంధ్రదేశాన్ని మహమ్మదీయుల తర్వాత ఆంగ్లేయులు పరిపాలించటంవల్ల తెలుగుభాషలో పార్శీ అరబ్బీ హిందుస్థానీ పదాలతోపాటు ఆంగ్ల పదాలూ చోటు చేసుకొన్నాయి. "The long continued dominion of the Musulmans introduced many foreign words into the various Hindu languages. Thus the modern Telugu contains a variety of persian and Arabic expressions. In later years, some English words have crept into use" [మిశ్రభాషా ఘంటువు—సి. పి. బ్రౌన్. Preface]

తెలుగు భాషలో చేరిన అన్యభాషా పదజాలం గూర్చి జరుగుతున్న పరిశోధనలనుబట్టి తత్ ప్రాధాన్యం తెలుస్తుంది. డా॥ కొత్తపల్లి వీరభద్రరావు 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' పరిశోధన వ్యాసంలో, ఆంగ్ల ప్రభావ ప్రాథమిక దశలో తెలుగుభాషలోకి చేరిన ఆంగ్ల పదాలగూర్చి చెప్పే ప్రయత్నం కనిపిస్తుంది. భావ ప్రభావం కంటే భాషా ప్రభావం ముందుగా ప్రభావిత భాషలో గోచరిస్తుంది. ఈ పరిశోధన వ్యాసం ప్రచురితమయింది. ఇది పదజాలంగూర్చి చేసిన పరిశోధన కాదు గనుక సమగ్రంగాచేసే అవకాశం లేదు. సూచన ప్రాయంగా విడిచిపెట్టబడింది. డా॥ చక్రధరరావు చేసినట్లు చెప్పబడుతున్న తెలుగులో చేరిన పార్శీ అరబ్బీ పదాల గూర్చిన పరిశోధన క్రీ॥ శ॥ 1800 వరకు పరిమితమనీ, అముద్రితమనీ తెలుస్తుంది. ఈ పరిశోధనల దృష్టితో తెలుగులో చేరిన అన్య భాషాపదాలగూర్చి ఆలోచన అవసరమే అనిపిస్తుంది.

'తెలుగు డాక్యుమెంట్స్' (Telugu Documents—Being petitions etc. in Telugu preserved in the oriental collections at the National Archives of India) అర్జీల సంపుటి, దీనికి సంపాదకత్వం వహించిన ప్రొఫెసర్ బి. జె. సోమయాజి ఎం. ఏ; ఎల్. టి; విద్వాన్ చేత నేషనల్ ఆర్కైవ్స్ ఆఫ్ ఇండియా తరుపున ఆంధ్రా యూనివర్సిటీనుంచి 1957 లో ప్రచురింపబడింది.

ఈ సంపుటిలోని అర్జీలలో సగం క్రీ॥ శ॥ 1810 సంవత్సరంలో వ్రాయబడ్డాయి. మిగతా సగం 1834--1859 మధ్యకాలంలో వ్రాయబడ్డాయి. ఈ సంపుటి ఆధారంగా క్రీ॥ శ॥ 1810 ప్రాంతంలో వ్యావహారికాంధ్రభాషారూపమూ, ఆంధ్ర భాషలోని పర్శీ, అరబ్బీ, హిందూస్థానీ, ఆంగ్లపదాలు మొదలైన భాషా విషయాలూ; ప్రజలు—జమీందారులు—ప్రభుత్వం, మధ్యసంబంధం, పాలకుల పాలితుల మనస్తత్వం, మొదలైన సాంఘిక విషయాలూ తెలిసే అవకాశం వుంది.

డా॥ కొత్తపల్లి వీరభద్రరావు పరిశోధన వ్యాసంలో పోర్చుగీసువాళ్ళు, డచ్చివాళ్ళు, ఫ్రెంచివాళ్ళు ఆంధ్రదేశంలోకి రావటం, తమభాషాపదాలు తేవటం చెప్పి, ఇంగ్లీషువాళ్ళ కారణంగా తెలుగుభాష పొందిన పరిణామం వివరించేముందు, ఇంగ్లీషు భాషలోనుంచి తెలుగు భాషలోకి వచ్చిన పదజాలం గూర్చి చెప్పటం కనిపిస్తుంది. 'పద్మనాభయుద్ధం' రచించిన కవి చల్లాతి లక్ష్మీనరసకవి, రచనాకాలం 19 వ శతాబ్ది ప్రారంభం. 'గ్రంథము రచించిన విజయరామగజపతిగారి కుమారులైన శ్రీ నారాయణ గజపతిగారి కంకితముగ చెప్పబడుటచే గ్రంథము 19వ శతాబ్ది ప్రారంభమున రచింపబడినదనుట సత్యము' (పే॥ 85. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభా

పము—డా॥ కొత్తపల్లి వీరభద్రరావు). ఈ కావ్య గతాంగ్ల పదాలు పై పరిశోధన వ్యాసంలో చూపింప బడ్డాయి.

19 వ శతాబ్ది ప్రారంభంలో వ్రాయబడ్డ ఈ సంపుటిఅర్జీలలోని భాషలో ప్రయోగింపబడ్డ ఆంగ్లపదాలు, 'పద్మనాభ యుద్ధము'లో ప్రయుక్తాంగ్ల పదాలకంటే అధికం భిన్నం. అంతేకాక, ఒకపదం రూపం వివిధంగా వుండటమూ వైశిష్ట్యమే! ఆంధ్రభాషలో చేరిన అనేకాంగ్లపదాల ప్రాచీనత, రూపవైవిధ్యం, తెలుసుకోటానికి ఈ సంపుటి బాగా ఉపయోగపడుతుంది. పై సంపుటిలోని ఆంగ్లపదాల క్రోడీకరణమే ఈ వ్యాసం.

సాధారణంగా భాషా సంస్కారం ఉన్న (18 వ శతాబ్ది ఉత్తరార్థంలోని, 19 వ శతాబ్ది ప్రారంభం లోని) తెలుగు కవులు భాషలోకి కొత్తగావచ్చే పదాలు పార్శీ ఆంగ్లాది పదాలు) తప్పనిసరి అయితే తప్ప, స్వీకరించలేదు. సామాన్య ప్రజలు కొత్తగా వచ్చిన వస్తువున్న పదజాలం వీలయినంత, అవసరమయినంత త్వరగా గ్రహించారు. ప్రయోగించారు. ఆంధ్రభాషలో చేరిన ఆంగ్లపదాలు కవులు రచయితలుకంటే సామాన్యజనం త్వరగా స్వీకరించారు. సాధారణంగా ఒక భాషలోకివచ్చే అన్యభాషా పదజాలం కవుల కంటే సామాన్యులు ముందుగా గ్రహించి ప్రయోగిస్తారు. కనుక, ఒక భాషలోకి వచ్చిన అన్యభాషా పదాల పరిశీలనకు ఆ భాషలోని కావ్యభాషకంటే తదితరమైన సామాన్యజనజీవితంలోని వ్యావహారిక భాషా రచనలు ఎక్కువ ఉపయోగకరంగా ఉంటాయి. కనుక, తెలుగులోకి చేరిన ఆంగ్లపదజాలంగూర్చి కూలంకషంగా తెలియటానికి దృశ్యశ్రవ్యకావ్యాలూ, తదితరకావ్యగౌరవంఉన్న రచనలూ నిఘంటువుల కంటే వ్యావహారికభాషలోవున్న మెకంజీ కైఫీయతులు, లోకల్ రికార్డులు, సి. పి. బ్రౌను లేఖలు, రచనలు, రికార్డులు, ఇంకా భిన్నమయిన లేఖలు, అర్జీలు, కోర్టురికార్డులు, దస్తావేజులు, దరఖాస్తులు మొదలైన అనేకం ఉపయోగకరంగా ఉండవచ్చుననటానికి సందేహంలేదు.

ఈ సంపుటిలోఉన్న అర్జీలపేర్లు వాటికాలం ఈ దిగువ ఇవ్వబడుతున్నాయి. ఈ శీర్షికలు అర్జీదారుల శీర్షికలు కావు. సంపాదక శీర్షికలు. ఒక పదం ప్రక్కనే ఇవ్వబడే సంఖ్యనుబట్టి, అర్జీ, దాని కాలం గుర్తించవచ్చు.

1. వరిగొండ రమణప్పగారి విల్లు 23.2.1810
2. ,, శేషయ్య బందరు కలక్టరునకు అర్జీ 23.2.1810
3. ,, రమణప్పగారి సనద్దు 23.2.1810
4. రమణప్ప జమీదారీ గ్రామాదులలోఉండే కరణముకాపుల అర్జీ 26.2.1810
5. అల్లూరు నరసయ్య వకీలు అర్జీ విన్నపం 1.3.1810
6. వరిగొండ వెంకటరాయుడు అర్జీ 12.3.1810
7. ,, రమణప్ప జమీదారు మోఖాసా సన్నదు 15.3.1810
8. ,, శేషయ్య మేనేజరు అర్జీ విన్నపం 18.3.1810
9. బందరు జిల్లా కలక్టరు ఆఖీదత్ 25.3.1810
10. మచిలీపట్నం జిల్లాకలక్టరు ఆఖీదత్ 25.3.1810
11. మేనేజరు వరిగొండ శేషయ్యగారి అర్జీ 12.4.1810
12. జిల్లా బంట్రోతు రశీదు 18.4.1810
13. విస్సన్నపేట మేనేజర్లకు కలక్టరు పంపిన ఆకీదత్ 18.4.1810
14. వరిగొండ వెంకటరావు అర్జీ 25.5.1810
15. ,, శేతయ్యగారికి రమణప్పగారి జాబు 30.5.1810
16. ,, వెంకటరావు గవర్నరు జనరల్‌కు వ్రాసిన హకీఖత్తు 5.8.1810

17. ,, శీతయ్యగారికి తమణప్ప గారి జాబు 1807

18. బంగాళా గవర్నరుకు రామచంద్రప్ప జమీందారు అర్జీ 21.10.1834

19. చిలుపూరి బనువారావు కరారునామా 1836

20. కలకత్తా గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిలుకు పుత్తపేడు పముద్రమ్మ అర్జీ 19.12.1848

21. వుడ్‌కాక్ దొరకు ఎవరో వ్రాసిన రశీదు 18.4.1850

22. మాచిరాజు వెంకటరాయుడికి తహశీలుదారు ఆర్డరు 19.3.1852

23. గవర్నరు ఇన్ కౌన్సిల్‌కి మాచిరాజు వెంకటరాయుని అర్జీ 26. 4.1852

24. మాచిరాజు వెంకటరాయుడికి తిరుమలశెట్టి వ్రాసియిచ్చిన రశీదు 1.5.1852

25. అర్జీలను గురించి నిబంధనలు.

26. గవర్నర్ ఇన్ కౌన్సిలుకి మాచిరాజు వెంకటరాయుడు అర్జీ 4.5.1852

27. బంగాళా గవర్నరుకు మాచిరాజు వెంకటనాయుడు వ్రాసిన అర్జీ 31.10.1854

28. బంగాళా గవర్నరుకి శానంపూడి రామబ్రహ్మం అపీలు అర్జీ 1.4.1858

29. గవర్నరు ఇన్‌కౌన్సిలుకు బువ్వంతాలూకా ప్రజలు వ్రాసికొన్న మహజరు 30.4.1859

30. మచిలీపట్నం కమర్షియల్ ఆఫీసరునకు నేతగాండ్ర అర్జీ. (ప్రమోదూత ఆశ్వయుజ. శు 4 గురువారం)

31. నల్లూరు నన్నయ్య వ్రాసియిచ్చిన రశీదు

32. హిరామనిషి అధికారి కిచ్చిన పంజాయిషీ

17, 21, 22, 31, 32 సంఖ్యగల అర్జీలలో ఆంగ్లపదాలు లేవు. ఈ సంపుటిలోని ఆంగ్లపదాలన్నీ నెలలు తెలిపే పదాలు, ప్రభుత్వ పదాలు, న్యాయశాఖపదాలు, జిల్లా అధికారి సంబంధి పదాలు, సైన్యసంబంధిపదాలు, జమీందారీ పదాలు, నామవాచకపదాలు, క్రియాపదాలు, ఇతర పదాలుఅని స్థూలంగా విభజింపబడ్డాయి. ఈ దిగువ పదాల ప్రక్కనే ఇవ్వబడే సంఖ్య అర్జీ సంఖ్య!

## 1. నెలలు తెలిపే పదాలు

| | | |
|---|---|---|
| 1. | జ్నవరి | 23 |
| | జనేవరి | 28 |
| 2. | పిబిరెవరు | 6 |
| | పిబెరెవరు | 2 |
| | పిబరెవరు | 2 |
| | ఫిబరెవరి | 1 |
| | ఫ్రిబవరి | 3 |
| 3. | మార్చి | 2 |
| 4. | య్యేప్రేలు | 13 |
| | య్యేప్రిలు | 12 |
| | య్యేప్రిల్ | 29 |
| | య్యేప్రియలు | 12 |
| | య్యేప్రియల్ | 12 |
| 5. | మెయి | 13 |
| | మే | 26 |
| 6. | జూన్ | 18 |
| 7. | శపిటంబరు | 28 |
| | శపటంబరు | 27 |
| 8. | అకుటోబరు | 28 |
| | అక్టోబరు | 18 |
| 9. | నవేంబరు | 20 |
| 10. | డిసెంబరు | 20 |

## 2. ప్రభుత్వ పదాలు

| | | |
|---|---|---|
| 1. | కుంఫిణి | 3 |
| | కుంఫిణీ | 7 |

| | | |
|---|---|---|
| | కుంపినీ | 30 |
| | కంపెని | 30 |
| 2. | గవునరుమెంటు | 20 |
| | గౌనరుమెంటు | 1 |
| | గవరన్మెంటు | 25 |
| | గౌరన్మెంటు | 27 |
| | గౌర్నమెంటు | 27 |
| | గౌవర్నుమెంటు | 3 |
| | గౌర్నరుమెంటు | 28 |
| 3. | గౌనరు జనరలు | 14 |
| | గవనరు జనరల్ | 16 |
| 4. | గవునరు | 20 |
| | గౌనరు | 18 |
| | గౌనర్ | 23 |
| 5. | లారడు | 18 |
| | లార్డు | 16 |
| 6. | కవున్సిల్ | 14 |
| | కౌనుశిల్ | 26 |
| 7 | శెంటు | 26 |
| | సెంటు | 23 |
| | (St. Saint. St. George Fort) | |
| 8. | పోరటు | 26 |
| | ఫోర్టు | 23 |
| 9. | యూరోపియన్ (ఆఫీసరు) | 29 |
| 10. | యింగ్లీషు | 12 |
| | యింగిలీషు | 12 |
| 11. | హానరబుల్ | |
| | (గౌనరుమెంటు) | 1 |
| | (గిల్బర్టు) | 16 |
| 12. | మెస్తరు | 12 |
| | మేస్తరు | 12 |
| | (Mister: మెస్తరు త్యాజిలెటు దొరగారు మేస్తరు వుడుకొకు దొరగారు) | |
| 13. | యిస్క్వయరు | 2 |
| | యస్క్వయరు | 6 |
| | యస్క్వయరు | 8 |

(Esq—Esquire; a squire or shield—bearer, one of the two attendants on a knight; now a courtesy title—Dr. Samuel Johnson's Dictionary of English Language.)

### 3. న్యాయశాఖ పదాలు

| | | |
|---|---|---|
| 1. | కోరటు | 18 |
| | కోర్టు | 2 |
| 2. | ప్రవిన్శియల్ (కోరటు) | 18 |
| | ప్రవిన్శియాల్ (Provincial) | 18 |
| 3. | మేజిగ్రేటు | 1 |
| | మెజిస్ట్రేటు | 2 |
| | మేజిస్ట్రేటు | 2 |
| | మేజిస్ట్రేటు | 6 |
| | మేజిస్ట్రేటు | 7 |
| | మేజిస్ట్రేటు | 11 |
| | మెజిస్ట్రేటు | 13 |
| | మెజిస్ట్రేటు | 19 |
| | మేజిస్ట్రేటు | 20 |
| 4. | రిగ్యూలేశను | 1 |
| | రిగ్యులేసను | 28 |
| | రిగ్యులేశను | 6 |
| | రిగ్లులేశను | 2 |
| | రిగ్యులేషను | 13 |
| | రెగ్యులేషన్ | 27 |
| 5. | శెక్సను (Section) | 1 |

6. క్లాజు 2
7. శివిల్ 14
   సీవిల్ 25
8. క్రిమేన్యాల్ 25
   (Criminal
9. పిటశన్ 28
   పిటిషన్ 20
10. అప్పీలు 28
11. కోర్టాపు వారడను 2
    కోర్టాఫ్ వారడను 14
    కోర్టాఫ్ వార్డును 2
    కోర్టాఫ్ వారడు 14
    (Court of wards)

**4. జిల్లా అధికారి సంబంధి పదాలు**

1a కలకటరు 5
   కలఖటరు 19
   కల్కాటరు 1
   కలక్టరు 7
   కలకట్రు 18
   కలక్ట్రటు 18
b సబు కలకటరు 26
  సబు కల్కాటరు 23
c హెడ్డు కల్కాటర్లు 27
d హెడ్డు అశిష్టాంటు కలక్టరు 28
2 రివిన్యూ 6
3. బోరడు 18
   బోర్డు 6
4. డివిజన్ 29
   (సబు డివిజన్)
5. ఆరుడరు 20
   ఆర్డరు 11
6. ఆడిడి 20
   (Audit)
7. డిపార్టిమెంటు 20
   (ఆడిడి డిపార్టిమెంటు)
8. కమ్మిసనరు 27
   కమిషనరు 27
9. కమిశారి జ్నరల్ 20
   (Commissary General)
10. కమ్మెరుశెయులు 30
    (Commercial)

**5. సైన్యసంబంధి పదాలు**

1. ... కమాండరు 16
2. ...కమిండింగు... 3
   కమాండింగు
   (ఆఫీసరు) 16
3 కర్నల్ 18
  (Colonel. (Ker'nel. n) [Formerly also coronel which is an old French form, and has given the modern pronounciation:..........—.....the name was originally given to the leading company in a regiment] The chief Commander of regiment of troops, whether infantry or cavalry—The concise English Dictionary.)
4. రిజిమెంట్ 29
   (Regiment)
5. గేరిజన్ 29
   గ్యారీజన్ 29
   గ్యారిజన్ 29
   (Garrison)
6. పోలీసు 27
7. ఆడదలీ (ల) 8
   ఆదురదలీ (ల) 8
   ఆరతిల్వ (ల) 2
   ఆరదలీ (ల) 2

ఆరడలీ (౦) 16

(Orderly: A private soldier or non. Commissioned officer who attends on a superior officer to carry orders or messages–The Concise English Dictionary.)

6. జమీందారి పదాలు

1. యిస్టేటు 2
 యస్టేటు 16
2. మేనేజరు 2
3. మేనేజరి (?) 4

(జమీందరు—జమీందారి మేనేజరు—మేనేజరి?)

4. మయినరు 14
 మైనరు 2
5. రిపోరటు 18
 రిపోర్టు 2
6. గారెడనను 3
 గారిడ్యాన్ 5
 గ్యారిడెనున్ను 7
 గ్యారిడ్యాన్ 11
 గార్డియను 16

7. నామవాచక పదాలు

1. డాక్టరు 1
2. ఆఫీసరు 16
3. సెకటరీ 28
4. ఫరంగి 31
 (పరంగి N. S. Farangi, plu. పరంగులు or పరంగీలు Europeans జాతివాండ్లు—మిశ్రభాషా నిఘంటువు—సి. పి. (బ్రౌన్.)
5. రయిటరు 20
 రైటరు 20
6. డిమాండు 23
 డిమెండు 23
 డిమ్యాండు 27
7. రిజెష్టరు 28
 రిజిష్టరు 28
8. రెశ్విడెంటు 30
 రెస్సిడెంట్ 30
9. నంబ్బరు 23
10. రశీదు 5
 (రశీదు (Receipt): A corruption for Receipt or the Persian 'Rasida'= చెల్లుచీటి — మిశ్ర భాషా నిఘంటువు—సి. పి. (బ్రౌన్)
11. కార్డివాల్ 18
12. చార్జి 11
13. యిన్క్లోజర్లు 14
 యినుక్లోజరను 14
 (Enclosures)
14. అనసరు 14
15. క్యారక్టు 14
 (Character)
16. డైరీ 14
17. వుల్ 11
 వుయిల్ 4
 వుయిల్ 2
 వుయులి 3
 విల్ 1

(వకారానికి పకారం ముద్రా రాక్షసం కావచ్చు)

8. క్రియా పదాలు

1. యిండ్డారము 19
 యిండ్డారను 19
 యిండార్డను 29
 యిడ్యారను 20

యిూండార్సు 28
ఎంఢారస్మ 26
యండాసు 23

2. రిఫరు 20

3. అకుటింగు (గౌసరు) 18

4. వోపన (open) 14
(...మళ్లీ కోర్టులు వోపన చేసే యాలోగా కలెక్టరుగారు...)

5. ష్టాప 14
స్టాపు 14

6. అడజరన 14
(Adjourn కోర్టు అడజరన్)

**9. ఇతర పదాలు**

1. చిపు 20
(Chief : చిపు మెజిస్ట్రేటు)

2. హెడ్డు 27
(Head : హెడ్డు కల్కటర్లు)

3. అశిష్టాంటు 28
(Assistant : హెడ్డు అశిష్టాంటు కలక్టరు)

4. చానల 14
(Channal : జిల్లాకోర్టు చానలద్వారా)

5. ఆపు 10
ఆఫ్ 13
ఆవ్ (of) 16

6. ది (the) 10

7. అండ్ 13
(శేషయ్య అండ్ పెమ్మరాజు రంగయ్య)

8. యిన్ 14
ఇన్ 16

9. టు (to) 23

10. సబు 23
(సబుకల్కటరు)

11. మిసు 14
(మిసు రిపోర్టు)





12. లేటు 2
(లేటు వరిగొండ రమణప్పా జమీం దారుగారు.)

13. రైటు 14
(మహారాజశ్రీ రైటుహోనరబుల్ గిల్బరటు)

ప్యార్టావు (13) part of అసి, వోనావుదీ (10) one of the అసి, (ఆకీదతు అసారు వరిగొండ శేషయ్యా వోనావుదీ మేనేజరు అవు ది యిప్పేటు లేటు వరిగొండ రమణప్పా జమీందారు గారు) భావించే అవకాశం వుంది.

ఆంగ్లభాష బాగా రానివాళ్లు, ఆంధ్ర భాష బాగా రాని వాళ్లకు తమ సంగతులు చెప్పుకోవలసి వచ్చినప్పుడు తేలికయిన వ్యావహారికంలో, వీలయినంత వరకు ఆంగ్లేయులకు అర్థమయ్యేపదాలు ప్రయోగిస్తూ వ్రాసిన కారణంగా ఆంగ్ల పదజాలం అర్జీలతో విరివిగా దొర్లింది.

డ్యైరీ, లేటు, రైటు, చార్జి మొదలైన బహ్వాల్ప పదాలు తప్ప ఈ రోజుల్లో ఆంగ్లపదాలకు వాడుకలో ఉన్న తెలుగురూపాలు క్రీ॥ శ॥ 1810 ప్రాంతంలో లేవు. భిన్నంగా ఉన్నాయి.

ఒక ఆంగ్లపదం భిన్నమైన తెలుగురూపాలలో ప్రయోగింపబడటంవల్ల, ఆదశ, ఆంగ్లపదం ఒకే ఆంధ్రపదంగా తెనుగురూపం స్థిరంచేసుకొంటున్న పరిణామదశగా భావింపబడుతుంది. ఒక ఆంగ్లపదం పొందిన అనేకాంధ్రరూపాలలో పూర్వాపరాల పరిశీలన—ఆ రూపాలు ప్రయోగించిన వ్యక్తుల భాషా సంస్కారంమీద ఆధారపడివుంటుంది గనుక—పూర్తిగా చేసే అవకాశం తక్కువ.

ఒక భిన్నభాషాపదం తెలుగుభాషలో చేరేటప్పుడు సాధారణంగా తెలుగు భాషా వ్యక్తిత్వం పొందించుకొని వస్తుంది. ఒక ఆంగ్లపదం భిన్నాంధ్ర రూపాలుపొందితే, అవి అన్నీ ఏదో విధమయిన ఆంధ్ర వ్యక్తిత్వం ఉన్న రూపాలే అయితే, అందులో ఏదో ఒకటి, అధికంగా ఆంధ్రభాషా సంప్రదాయముద్రితం అవుతుంది. ఒక ఆంగ్ల పదానికి ఇప్పుడు వాడుకలో ఉన్న తెలుగు రూపమూ, పూర్వ భిన్నరూపాలూ పరిశీలించి, ఈ రూపం అధికాంధ్ర భాషా సంప్రదాయ ముద్రితం అవునా కాదా అని పరిశీలింపచ్చు.

భిన్నభాషాపదాలు పొందిన భిన్నాంధ్ర పద రూపాలవల్ల ఆంధ్రభాషానాగరికత తెలుస్తుంది. భాషా వ్యక్తిత్వ లక్షణాలు తెలుస్తాయి. అందుచేత అనేకేతర భాషాపదజాల పరిశీలనవల్ల గతాగతాల ఆంధ్రభాష స్పష్టమవుతుంది.

---



లేఖలు:

# తెలుగులో బహువచనరూప నిష్పత్తి

ఆర్యా!

శ్రీ చేకూరి రామారావుగారు జూన్ 70 భారతిలో వ్రాసిన 'తెలుగులో బహువచనరూప నిష్పత్తి' అనే వ్యాసాన్ని చదివి అవగాహన చేసికోటానికి ప్రయత్నించాను. అక్కడక్కడ బహువచనరూపాలు ఏర్పడు విధానాల్ని పూర్వవ్యాకర్తలకన్నా వీరు ఎక్కువ శాస్త్రీయదృష్టితో నిరూపించడం ముదావహం. కాని అతిసాంకేతికంగా ఈ విషయాల్ని నిరూపించే అభిజ్ఞతవలన విద్యార్థులకు జిజ్ఞాసువులకు కలిగే ఉపయోగమేమిటో తెలియడంలేదు. ఇంతకన్న పూర్వ వ్యాకర్తలు, ముఖ్యముగా చిన్నయసూరి వంటివారు అందించిన సూత్రాలే ధారణకు తోడ్పడుతున్నాయని చెప్పవచ్చు. పై వ్యాసాన్నిగూర్చిన నా అభిప్రాయాల్ని కొన్నింటిని పాఠకుల కందించాలనుకుంటున్నాను.

(1) బహువచన ప్రత్యయం పరమౌతున్నప్పుడు 'ము'కు లోపం, తత్పూర్వస్వరానికి దీర్ఘం ఒక్కొక్కచో విభాషగా వస్తుందని మన వ్యాకర్తలు గుర్తించారు. కాని యిందుకు చిన్నయసూరి యిచ్చిన లక్ష్యాలన్నీ హ్రస్వమైన 'అ'కారానికి దీర్ఘం వచ్చినట్లే వున్నాయి. సూత్రంలో తత్పూర్వస్వరమని సామాన్యంగాచెప్పినా అకారేతరస్వరాలకు లక్ష్యాలు చూపలేదు. పైగా ఈ ముగాగమలోపం 'ఒకానొకచో' అనటంచేత ప్రయోగవైరళ్యము సూచింపబడుతుందనికూడ హెచ్చరించాడు. ఇది ప్రామాణిక భాషకు వ్యాకరణం కావడంచేత ఇవి అంతటా వస్తాయని చెపితే వ్యవహారికభాషాప్రాబల్యాన్ని ప్రదర్శించినట్లవుతుందనే భయంతో కాబోలు వ్యాకర్తలు అనగా చింతామణికర్త మొదలు చిన్నయసూరి వరకు (ఒకానొకచో—క్వచిచ్చ) అని హెచ్చరించివుంటారు. కానీ సూరికంటె చింతామణికర్త 'అత ఆదిమస్య భవేత్' అనడంచేత ఒక హ్రస్వ అకారానికే దీర్ఘం వస్తుందని నిర్దిష్టం చేసినట్లు కన్పడుతుంది. వాడుకలో మువర్ణలోప రూపాలే విన్పిస్తాయ్.

'పేలాలు' అనేపదమే వింటాంగాని 'పేలములు' అనుపదమున్నట్లే ఊహించలేంగదా! కంపాలు, భాండాలు, రణాలు, షండాలు, కుంకుమాలు యిలాంటివి వినడానికి కొంత హితవుగాను వుండవు.

ఇదట్లావుంచి మువర్ణము లోపిస్తే ప్రక్కనున్న 'ఎ'కారము ఏకారముగా మారుతుందని శ్రీ రామారావుగారు చెప్పడం చాలా చింత్యం. అందులోను ఆధునికభాషాశాస్త్రాభిజ్ఞులు అలా చెప్పకూడదేమో. ఎందుకంటే పక్కన ఎత్వముంటే అది బహువచనంలో [ae: — తాటాకు మొదలైన వాటిలోవలె] ఉచ్చరింపబడుతుందని అందరికీ అనుభవంలో ఉన్న విషయమే.

నాణెములు—నాణేలు
పందెములు—పందేలు
పళ్లెములు—పళ్లేలు మొదలైనవి.

బాలకవిశరణ్యంలో శ్రీ గిడుగువా రీవిధంగా ఉద్ఘాటించారు.

"పైని చెప్పిన బాలవ్యాకరణ సూత్రములో 'తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును' అనుటచేత మువర్ణమునకు పూర్వమందున్న అత్వమే అయివుండవలెనన్న నియమంలేదు. కనుక"

బల్లెములు—బల్లేలు
ముత్తెములు—ముత్తేలు

మొదలైన రూపములుకూడ సిద్ధిస్తున్నవి. వీటికిని కవిప్రయోగాలు కలవు"

(—బాలకవి శరణ్యం—మార్చి 1958 ముద్రణ పుట 111)

ఇంతేకాక వ్యవహారంలో ము వర్ణమేకాకుండా 'వు'కూడ కొన్నింటిలో లోపిస్తుంది. శ్రీ రామారావుగారు వ్యావహారికభాషనంతటినీ ప్రాండలిక భేదాలతో నిరూపించటంలేదని చెప్తున్నా ఆధునిక నవలల్లో ప్రచురంగావున్న 'పెడలు' అనేపదాన్ని గుర్తించకపోవడం విచార్యం.

(2) చారిత్రకంగా నిరూపించకూడదనే పట్టు దల ఆధునికభాషాశాస్త్రజ్ఞులకులేదని శ్రీ రామారావు పేర్కొన్నారు.

**Item and Process, Item and arrangement** కంటే కూడా వ్యాకర్తలచే సూత్రరచనల్లో ఎక్కువగా అనుసరింపబడుతుందని వారు పేర్కొన్నారు. వర్ణనాత్మకంగా చెప్పడంలోవున్న సౌలభ్యాన్నిగూర్చి చారిత్రకంగా చెప్పడంలోని క్లిష్టతను గురించి డా॥ బొడ్డుపల్లి పురుషోత్తంగారు తమ 'భాష—వ్యాకరణము' (భారతి—ఏప్రిల్ 70) అను వ్యాసంలో ఉద్ఘాటించారు. అంతేకాని చారిత్రకంగా అసలే చెప్పకూడదని ఎవరంటారు? పాణిని సూత్రాల్లో కూడా కొన్ని చారిత్రక నిరూపణలున్నట్లు అభిజ్ఞుల వల్ల తెలుస్తుంది.

ఆధునికభాషాశాస్త్రజ్ఞుడైన Gleason తన **An Introduction to Descriptive Linguistics** అన్న గ్రంథంలో Descriptive Grammar యొక్క ప్రాముఖ్యాన్ని ఈ రకంగా ఉద్ఘాటించారు.

"In the last several sections six types of Grammars were mentioned. Of these the descriptive Grammar clearly occupies the central place. Not only is it the first product of analysis but it is also specialised. All others are derived from it by the addition of other sort of rules or by the combination of two grammars. Moreover all the more specialised grammars required the observation of additional kinds of data often by different methods of observation. In view of these facts it is not surprising that the desciiptive grammar has been more highly developed than any of the others."

—(13. 13)

ఈ గ్రంథంలోవున్న Language and Grammar అన్న అధ్యాయంలో Gleason పండితుడు ముక్తకంఠంతో వర్ణనాత్మక వ్యాకరణ విధానాన్ని ప్రశంసించినట్లు మనం గమనిస్తాం. బహుశా శ్రీ పురుషోత్తంగారు తమ వ్యాసంలో ఈ విషయ ప్రస్తావన దీన్ని ఆధారించుకొని చేసివుంటారను కుంటాను. Item and process కూడ వర్ణనాత్మక పద్ధతిలోని భాగంగానే కన్పిస్తుంది.

(3) వ్యావహారిక భాషను ఎంతగా వ్యాకరించాలని ప్రయత్నిస్తున్నా అది అసమగ్రంగానే వుండిపోతుంది. అందుకే వ్యాసకర్తలు తమ అసమర్థ్యాన్ని చివరలో ప్రకటిస్తూ వుంటారు. మాండలిక పద కోశాలు, మాండలిక వ్యాకరణాలు యేర్పడితే కాని సమగ్రమైన వ్యావహారిక భాషా వ్యాకరణం సిద్ధం కాదేమో. పూర్వ వ్యాకర్తలు చెప్పిన అంశాలు కొన్ని, వ్యావహారిక రూపాలు కొన్ని కలగాపులగంచేసి ఏవో కొన్ని విషయాలు అందించబడుతున్నా పూర్తిగా సంతృప్తి కలగడం లేదు.

(4) దీర్ఘాచ్చు హ్రస్వాచ్చు అనటం అనవసరమనే చెప్పచ్చు. దీర్ఘం, హ్రస్వం అనేవి స్వర ధర్మాలే కాబట్టి అట్లా అననక్కరలేదు.

—సుహాసిని.

## "జాడ తెలియని కొన్ని పద్యములు"

ఆర్యా!

సుప్రసిద్ధ లాక్షణికుడైన అప్పకవి తన అప్పకవీయములో అనేకమైన గ్రంథములనుండి లక్ష్యములను ఏరికూర్చినాడు. అట్టి పద్యములు కొన్ని

ఆతఁడుదహరించిన గ్రంధములలో కన్పించుటలేదు. సరికదా! అప్పకవీయముపై అనేకములైన విమర్శలు వ్యాఖ్యలు వచ్చినవి. ఈమధ్య రావూరి వారు 'భావప్రకాశిక' అనుపేర అప్పకవీయము తృతీయాశ్వాసమునకు వివరణ వ్రాసిరి. ఇందులోను ఈ పద్యముంజాడ —అనగా రచయిత ఎవరు? ఏ గ్రంథములోనివి? అనునవి తెలియుట లేదు. విజ్ఞులు దీనికి సరియైన ఆకరములు తెలిసి సంశయ నివృత్తి చేయుచు సాహిత్య లోకోపకారకులగుదురని కోరుచు, ఆ పద్యముల నుదాహరించుచున్నాను.

1. అప్పకవి (3—83) పుట—138. భిన్నయతికి 'విజయ విలాసము'నుండి రెండు పద్యముల నుదాహరించినాడు. అవి యివి :

'చిత్తజాఁడల్గి తూపు మొనఁజేసిన......'
(విజయ—3—15.)

'అందే'—అని ఈ పద్యమును గలదు—

'చెట్టతనంబునన్ జనకు
జీవనమంతయు వెల్లి పుచ్చి తోఁ
బుట్టిన యాపె యిర్వితిచి
పుట్టిన బిడ్డనికిం బగైన నీ
యుట్టి నిశాట కృత్యమున
కెవ్వఁడు రోయక సమ్మతించు నీ
వెట్టి ప్రదోషవేళజని
యించిన వాఁడవొగాక చంద్రమా!'

'చిత్తజాఁడల్గి' పద్యము 'విజయ విలాసము'లో గలదు. ఈ 'చెట్టతనంబునన్' అను పద్యము నేటి 'విజయ...'లో లేదు. 1966 వ సం॥న రావూరి వారు పరిష్కరించిన వావిళ్లవారి అప్పకవీయములో నీ పద్యమునకు గుర్తుపెట్టి పాదసూచికలో 'ఈ పద్యము విజయ విలాసములోఁ గానరాదు—ఎందలిదో? (రా)' అని వ్రాసిరి. వీరు తమ 'భావ ప్రకాశిక'యందు ఈ భావమును మరల ప్రకాశనము చేయలేదు.

2. ఈ అప్పకవీయము (3—307) వ (168 పుట) ఖండాఖండప్రాసమును దెల్పుచు 'ఆది పర్వమునందు' అని—

మత్తకోకిల :—

'తీగ యుయ్యల నూఁగుఁ జల్లని
తియ్యమామిడి మోకలం
దాగుఁ బువ్వుల తేనెసోనలఁ
దారుఁ గేతకిఁ జేరుఁ బు
న్నాగ పూగ మహాగ వీథుల
నాట్యముల్సచరించు నా
భోగ నాగలతాగృహంబుల
భోగముల్గను వేడుకన్.'

ఈ పద్యము ఆదిపర్వములోనేకాదు కవిత్రయ భారతములోనే లేదు. ఈ విషయమును రావూరివారు అప్పకవీయము (ఫుట్‌నోట్సు)లోను భావప్రకాశికలోను తెలిపిడిచేసినారు. అయితే ఈ పద్యము ఎక్కడిది?

3. అప్పకవీయము (3—311) వ (169 వ పుట) 'ఉద్యోగపర్వమునందు' అని రెండు పద్యములు గలవు. అందొకటి—

'బోఁటి యొకతె పెండ్లిపాట పాడఁగఁ జొచ్చె
నాదనాని విరహతాపమునను
బేరుఁ గూర్చి తాను పెండ్లికూతురుగాఁగ
గోత్రధరుఁడు పెండ్లికొడుకుగాఁగ.'

ఈ పద్యము ఉద్యోగపర్వములోలేదు. ఇది ఎచ్చటిది?

పఠనపాఠనప్రవచనములచే సాహిత్యలోకమున ప్రచారమునగల 'అప్పకవీయము'నందు నాకు గలిగిన సంశయములలో కొన్ని మాత్రమే యివి. సాహిత్య ప్రియంభావుకులు ఈ పద్యములజాడ తెలుపగలరని మరల కోరబడుచున్నారు.

—శ్రీ రంగాచార్య.

## అప్పకవి నివాసము

ఆర్యా!

70 జాల్లై భారతిలోని 'లేఖలు' అనే శీర్షిక క్రింద ప్రకటించిన అప్పకవి నివాసమును గురించి వ్రాసిన శ్రీ కోమండూరి రామానుజాచార్యులుగారి

లేఖను చదివితిని. కానీ వారందు అప్పకవి నివాసము కందుకూరు తాలూకాలోని కామేపల్లి అని నిశ్చయించుట నన్ను కొంత కలతబెట్టినది. అందునను "'తంగెడ అను గ్రామము పల్నాటిసీమలో వుంటే వుండవచ్చునుగానీ కామేపల్లిమాత్రము లేదనే" అను నిశ్చయమునకు వచ్చినందుకు నేను కొంత చింతించక తప్పలేదు.

ఏలనన పలనాటిసీమను వారు దర్శించకపోయినను రైల్వే గజెట్‌నందు గుంటూరునుండి మాచెర్ల వఱకుగల స్టేషనులు చూచినను అందు కామేపల్లిఅను Sub-Station కనిపించును. అయితే ఆ కామేపల్లి మాత్రము అప్పకవి నివాసస్థానముకాదు. మఱొకటి తంగెడసీమలోనిదే 'కామేపల్లి' కలదు.

అయితే ముందుగా మఱొకమాట. ఇది వ్రాయుట నేను వారిని విమర్శించు దృష్టితోకాదు. 'ఆకుకందని, పోకకుపొందని మాటలతో గాలిమేడల కట్టుటతప్ప మరేమియుకాదు. ఎందరెన్నివిధములుగ నాలోచించినను—అప్పకవి కందుకూరుతాలూకా కామేపల్లి వాడేననుట నిశ్చయము' అనినారు.

అయితే వారే మూడవపేరాలో 'తంగెళ్ల' అను గ్రామము నేడుకూడా విలక్షణముగ నున్నదని, ఒకనాడీ ప్రాంతమునకు 'తంగెడుసీమ'యను పేరు గలదనియు, ఆ సీమలో కామేపల్లి కలదని, అయితే అప్పకవికి కావ్యభర్తయైన వేణుగోపాలస్వామి ఆలయము మాత్రము కనబడుటలేదనిరి.

ఇందు నాకు తోచిన విధమును వివరింతును. వారు చెప్పిన దానిలోనే అనుమానాస్పదమైన రెండు విషయములు మనకుకనిపించుచున్నవికదా! 'తంగెళ్ల'ను తంగెడ అనుకొమ్మని (2) కావ్య భర్త వేణుగోపాల స్వామి ఆలయములేదని. ఇక నా అభిప్రాయము.

'తంగెళ్ల'ను తంగెడసీమగా మార్చుటకంటే పలనాటిలోని మాచర్ల దేవాలయములోని ఎఱ్ఱబండ శాసనమున, పట్లవీడు ధరణికోటలలోని శాసనమునను కృష్ణదేవరాయని అధీనమునకువచ్చిన కోటలలో అద్దంకి, బెల్లంకొండ, వినుకొండ, నాగార్జునకొండ, తంగెడ, కేతవరము మొదలగు దుర్గములు కలవని తెలియుచున్నది.

పెద్దలు పరిశీలించుటకై నేను యింతగా వ్రాయుచున్నాను. తంగెడ దుర్గము యిప్పటికిని వున్నది. ఆ తంగెడకు తూర్పుగా 9 మైళ్ల దూరమున కామేపల్లి కలదు. అందు కవి కావ్యభర్తయైన వేణుగోపాలస్వామి ఆలయము కలదు.

1660 ప్రాంతమున నుండిన అప్పకవి తన గ్రామమగు 'కామేపల్లి' సాయప వేంకటపతి భూనాయకునిచే నీయబడినదని వ్రాసికొనెను.

కనుక పూజ్యులు, పెద్దలు అయిన పరిశీలకులు యిప్పటికైనను 'తంగెడ' చేరి, అచ్చటనుండి కొన్నిశాసనముల నాధారముగా తీసికొని, అచ్చటివారి నడిగియైన లక్ష్మణరావుగారు వ్రాసినట్లు తంగెడ సీమలోని కామేపల్లిని దర్శించి, ఆ చెంతనేగల కేతవరము మొదలగు గ్రామముల పరిశీలించి యదార్థమును మాకు తెలియజేతురని ఆశించుచున్నాము.

—ఉల్లి రామసుబ్బయ్య.

# గ్రంథ విమర్శలు

## మనుచరిత్రము

(ఎమెస్కో సంప్రదాయ సాహితి)

(ప్రచురణ : ఎం. శేషాచలం అండ్ కంపెని. ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, సికింద్రాబాదు. మూల్యము : సాదా ప్రతి రూ, 2-00 గ్రంథాలయప్రతి రూ 3—75.)

శేషాచలం కంపెనీవారు ఎమెస్కో పాకెట్ బుక్సు ప్రచురణ ప్రారంభించి శతాధికముగా నవలలు, కథలు ప్రకటించినారు. అంతటితో నాగక సంప్రదాయ సాహిత్రీప్రచురణమునుకూడా చేపట్టినారు. ఈ వరుసలో ఆంధ్ర పంచకావ్యములను అచ్చువేయుటను ప్రారంభించినారు. మన ప్రౌఢ ప్రబంధములు వ్యాఖ్యానములు లేక అర్థముకావు. వ్యాఖ్యాన మనగానే గ్రంథము పెరిగిపోవును. అంత గ్రంథమువెల మిక్కిలిగా నుండకతప్పదు. అందువల్ల చాలమందికి ఆ వ్యాఖ్యానముతోడి గ్రంథము లందుబాటులో లేవు. సరిగా అర్థముగాక పోయినప్పటికిని వట్టి మూలముతోడి గ్రంథము తక్కువ వెలకు లభించుట మంచిదన్న అభిప్రాయములో ఈపద్ధతి ప్రచురణక్రియ ప్రారంభింపబడినది. ఇది ప్రాచీనాంధ్ర సాహిత్యపరిచయము ప్రజాసామాన్యములో కలుగుట కెంతయేని దోహదము చేయగలదు. ఈ బాధ్యతను నెత్తికెత్తుకొని సముచితముగా నిర్వహించుచున్న శేషాచలం అండ్‌కంపెనీ— వారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైయున్నారు.

ఈ మనుచరిత్రమును పరిష్కరించి యిచ్చినది శ్రీ రావూరి దొరసామి శర్మగారు. నాలుగైదు ప్రతులను సంప్రతించి ఈ పుస్తకములోని పాఠముల నాయన నిర్ణయించెను. ఆయన స్వయముగ గొప్ప పరిశోధకుడు. సాధారణముగా భారత భాగవతములు, మనుచరిత్ర, వసుచరిత్ర వంటి ప్రసిద్ధ గ్రంథముల కిప్పటి కెప్పుడో పరిష్కారము జరిగిపోయినది. ఈ నాడెంత గాలించినను పెద్దబ్రహ్మాండమైన మార్పులతో పాఠభేదములు లభించవు. శ్రీ దొరసామిశర్మగారు తమకున్న అవకాశపుటవధిలో చక్కని పాఠములతోనే ఈ ప్రతిని సమకూర్చిరి.

ఈ ఎమెస్కో సంప్రదాయ సాహితిలో ఆంధ్ర పంచ కావ్యములకును పీఠికలు సంతరించుటకు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా రంగీకరించుట అదియొక విశేషము. ఈ గ్రంథములు సాధారణ మానవుని దృష్టిలో పెట్టుకొన్నవగుటచేత పీఠికలుకూడ అందుకనుకూలముగా నుండవలెను. మనుచరిత్రము మొదటిసారిగా చదువుటకు తెరిచిన వానికి శ్రీ సత్యనారాయణగారి పీఠిక మనుచరిత్రముయొక్క సారాంశమును చక్కగా బుద్ధికెక్కించి అసలు కావ్యపఠనమున కవసరమైన ఉత్సాహమును కలిగించును. ఆ విధముగా పాఠకులను మనుచరిత్రమున కభిముఖులనుగాచేసి నడిపించుటకు ఆ పీఠిక తాను తగియున్నది. మరియు నీపీఠిక మనుచరిత్రము కొంతకు కొంత అర్థమగుటకును దోహదము చేయుచున్నది. మహాకథాకథనకుశలుడైన శ్రీ విశ్వనాథ ఈ పీఠికను తత్కౌశల్యము కలిమిని నడిపించి వీరు వారను భేదము లేకుండ అందరను మనుచరిత్ర పాఠకులనుగా చేసెను. ఈ మహాప్రయత్నమువలని ఫలితము నాంధ్ర ప్రజానీక మరమరికలులేక పంచుకొనుచున్నది.

## కురుక్షేత్రే

(రచయిత : శ్రీ పి. రాజగోపాలనాయుడు. ప్రతులకు : రచయిత, దిగువ మాఘంపోస్టు, చిత్తూరు జిల్లా. మరియు విజయ పబ్లికేషన్సు, 180 లాయడ్సురోడ్డు, మద్రాసు—14. మూల్యము : పది రూపాయలు.)

కురుక్షేత్రమనగా మహాభారతమన్న మాటే. మహాభారతయుద్ధ మక్కడ జరిగింది. ఆ యుద్ధాన్ని గురించి, ఆ పరిస్థితులనుగురించి మొత్తం పదునేడు శీర్షికలక్రింద ఈ గ్రంథము రచింపబడ్డది. కురుక్షేత్రము, సంగ్రామకాలనిర్ణయము, గత చరిత్ర, నాటి పరిస్థితి, రాజ్యాధికారం, రాజనీతి, చతురంగ బలాలు, శస్త్రాస్త్రాలు, రాయబారాలు, దుర్గాలు, గూఢచారులు, సారథులు, సమరధర్మాలు, సంగ్రామం, మాయాయుద్ధం, ఆకాశయుద్ధం, సంగ్రామానంతరం—ఇవన్నీ గ్రంథంలోని ఉపశీర్షికలు.

ఈ గ్రంథకర్త శ్రీ రాజగోపాలనాయుడుగారు గొప్పపరిశోధన బుద్ధికలవారు. స్వతంత్రమైన ఆలోచనావిధాన మున్నవారు. ఒక ప్రవాహవేగముతో కూడిన రచనావైదుష్యము కలవారు. గట్టిచారిత్రక దృష్టితో తాను చేపట్టినదానిని ఆమూలచూడము చూడగలిగిన శక్తిసామర్థ్యములుగలవారు. సిసలైన చారిత్రక పరిశోధక విమర్శకున కుండవలసిన మంచి లక్షణములన్నియు పుణికి పుచ్చుకొన్నవారు. అంతటి వానికి మరికొన్ని ఆధునిక పరిశోధన లక్షణము లెరుకబడియున్నచో నింకను బాగుండెడిది. ఏ విషయానికికూడ రచయిత ప్రామాణిక మూల గ్రంథాలను పేర్కొనుటను పెట్టుకొనలేదు. అందువల్ల ఈ గ్రంథము ప్రమాణ గౌరవము నిస్సంశయముగా దిగజారి పోయినది. ఇందలి "మొదటి రెండు ప్రకరణాలు గ్రంథకర్తగారి సర్వతోముఖ వైదుష్యానికి, అసమాన పరిశోధనకు, నిరంతర కృషికి తార్కాణాలు. మిగిలిన ప్రకరణాలన్నీ ఏదో విధంగా కురుక్షేత్ర సంగ్రామానికి సంబంధించినవే. ఆనాటి సంగ్రామపద్ధతులు కండ్లకు కట్టినట్లుగా వివరించారు. ఈ సంగ్రామంలో సమరధర్మాలు ఎంత వరకు పాటించబడ్డాయో నేర్పు సహేతుకంగా పక్షపాతరహితంగా వుంది. కురుక్షేత్రం ధర్మక్షేత్రం. భారతీయులకు సర్వదాస్మరణీయం. అటువంటి క్షేత్రంగురించి అక్కడ జరిగిన భారత యుద్ధం గురించి తెలుసుకోదగిన అన్ని విషయాలు శ్రద్ధతో పరిశ్రమతో సంకలించి ఆకర్షణీయంగా వెల్లడించే ఈ గ్రంథరాజాన్ని ఎంత ప్రశంసించినా చాలదు". ఈమాటలు పలికినది శ్రీ పి. వి. రాజమన్నారు గారు. నిజముగా ఈ గ్రంథమంత గొప్పదియే. మహాభారతమునుగూర్చిన చర్చలతోవచ్చిన గ్రంథము లన్నింటిలో నిది మిక్కిలి ప్రశంసింపదగినది. మహాభారత విషయ పరిశోధకులకు, మహాభారత విషయాసక్తులకు ఈ గ్రంథము అవశ్యము పఠనీయము. పురాణవిజ్ఞానము నింతగా పుక్కిలించు గ్రంథమి సదసుమగాలేదు.

## కావ్యాదర్శము

(అనువాదకుడు: శ్రీ చర్ల నారాయణశాస్త్రి. ప్రతులకు: శ్రీ చర్ల గణపతిశాస్త్రి, ఆర్షవిజ్ఞాన పరిషత్తు, 6—2—977/1. ఖైరతాబాదు, హైదరాబాదు—4. మూల్యము: రూ. 2—50 లు)

అలంకారికులలో దండి మొదటివాడు. కాదన్నచో రెండవవాడు. అనగా ఆయన అంత ప్రాచీనుడు. అలంకారశాస్త్ర గ్రంథములలో కావ్యాదర్శము మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్నది. భామహుని కావ్యాలంకారమునకంటె దండి కావ్యాదర్శమునకే ప్రసిద్ధి కలదు. దండి ముందా భామహాచార్యుడుముందా అన్న ప్రశ్న నిశ్చయముకాని సమాధానములతోనే ఇంకను ఉన్నది. భామహుడు ముందువాడను వారి సంఖ్యయే బలముగా కనిపించుచున్నది. అయినను ఆచార్య [illegible]వంటి మహావిద్వాంసులు దండినే ముందువాడుగా చూపుచున్నారు. అది యెట్లుండె.

## గ్రంథ విమర్శలు

సంస్కృతమునగల కావ్యాలంకార విషయములే భారతీయ భాషలన్నింటికిని కావ్యాలంకార విషయములు. అందులో తెలుగునకు మరియును. సంస్కృతాలంకారిక గ్రంథము లన్నియు దాదాపు తెనుగు చేయబడినవి. సంస్కృత సాహిత్యమెట్లు అనుసరింపబడి తెనుగైనదో అట్లే సంస్కృత అలంకారశాస్త్రమంతయు కూడ తెనుగు చేయబడినది. ఒక్కొక్క దానికి రెండు మూడు అనువాదములును కలవు. సంస్కృతాలంకారిక గ్రంథములలో ఒకవిధముగా మెట్టమొదటిదైన ఈ దండికృతము కావ్యాదర్శముకూడ ఇంతకుపూర్వ మొకసారి తెనుగు చేయబడినది. కాని నేడది పఠిత విశేషదుల కందుబాటులోలేదు. పునర్ముద్రణములేక అది ఆంధ్ర సాహిత్య విద్యార్థులకు కందుబాటుకు రాలేదు. అట్టి ఈ కావ్యాదర్శమున కింకొక అనువాదము వచ్చుట హర్షింపదగిన విషయము. శ్రీ చర్ల నారాయణ శాస్త్రిగారి ఈ కావ్యాదర్శానువాదము ఆ విధముగా హర్షింపదగినదే. శ్రీ నారాయణ శాస్త్రిగారి కృషిని ఇప్పటికి ముప్పదియేండ్ల తరువాత వెలుగునకు తెచ్చిన వారిపుత్రులు శ్రీ గణపతిశాస్త్రిగారు అభినందనీయులు.

ఈ అనువాదమంతయు పద్యాత్మకము. ఈ విధముగా వ్రాయుట మన ప్రాచీన సంప్రదాయము. కాని పద్యములలో శాస్త్రవిషయముల నిముడించుట వలన శాస్త్రమున కుండవలసినంత విస్పష్టత ఉండ కుండపోవు ప్రమాదమున్నది. మన రచయితలందరును ఆ ప్రమాదమునెట్లో దాటగలమను నిబ్బరము కలవారే. ఎంత నిబ్బరమున్నను అది అంతగా ఆదరింపదగినదికాదు. మరియు ఈ యిరువదియవ శతాబ్దమున ఇంకను శాస్త్రగ్రంథములను ఛందస్సులలో బిగించుచు అనుసరించుట అది అంత శ్రేయోదాయకముగా అనిపించదు. తండ్రిగారు చేసిపెట్టి పోయిన దానికి కుమారుడు బాధ్యుడు కాదుకదా!

కావ్యాదర్శమున మూడు పరిచ్ఛేదములున్నవి. కావ్యనిర్వచనాదికము, రీతులు, గుణములు—అనుప్రాస, ప్రతిభా శ్రుత్యభ్యాసములు—ఈ మొదలైన వాటిని గూర్చినది ప్రథమ పరిచ్ఛేదము. రెండవ దానియందొక ముప్పదియైదర్థాలంకారములు నిరూపింపబడినవి. మూడవ పరిచ్ఛేదమంతయు యమక లక్షణముల నిరూపణముతోను, చిత్రబంధములయొక్కయు, ప్రహేళికలయొక్కయు, కావ్య దోషములు పదింటియొక్కయు పరిష్కారములతో నున్నది. భారతీయాలంకారికవిషయపరిశీలనావసరమున దండియు ఆయన కావ్యాదర్శమును అనివార్యముగా అధ్యయనము చేయబడవలయును. అంతటి అనివార్యమైన గ్రంథము నాంధ్రమున నిలుపుట మెచ్చదగియున్నది.

శ్రీ శాస్త్రిగారిది పద్యానువాదమైనను యతి ప్రాసములవలన అంతగా దెబ్బతినక సరసముగానే యున్నది. కాని కొన్నిపద్యముల రచన ముండవలసినట్లులేదు. ఉదాహరణమునకు ద్వితీయ పరిచ్ఛేదమున ఉత్ప్రేక్షను నిర్వచించు 210 యవ సంఖ్య గల పద్యమును చూడవచ్చును.

> 'చేతనముదియో లేక యచేతనముదో
> యన్యరీతిగనే యున్నయట్టి వృత్తి
> దాని కన్యథా యుత్ప్రేక్షితమగుచోట
> నయ్యదుత్ప్రేక్షయని యంద్రు ప్రాజ్ఞులిందు.'

మొదటి పాదము నింక కొంచెము జాగ్రత్తగా వ్రాసియుండవలసినది. ఇట్టి జాగ్రత్త యవసరమైన పద్యములు మరియు కొన్ని కలవు. అల్పములైన ఈ దోషములను సవరించుకొన్నచో మంచి సరళమైన కావ్యాదర్శ అనువాదము తెనుగులో వచ్చినట్లు. సాహిత్యవిద్యార్థు లీ తెనుగు కావ్యాదర్శమును జాగ్రత్తగా అధ్యయనము చేయదగును. మరియు శ్రీ శాస్త్రిగారి అనువాద విశేషములనుగూడ జాగ్రత్తగా పరిశీలింపవలయును.

> 'సంస్కృతం నామ దైవీ వా
> గన్వాఖ్యాతా మహర్షిభిః
> తద్భవ స్తత్సమో దేశీ త్యనేకః
> ప్రాకృత క్రమః'

ఇందుకు నారాయణీయ కావ్యాదర్శమున తెనుగు పద్యము—

'సంస్కృతమని చెప్పెడిది నిర్జరులభాష
యనువదించిరి దానిని మునులు పిదప
ప్రాకృతముపుట్టె సంస్కృత భాషనుండి
ద్వివిధమిది తత్సమంబని దేశ్య మనియు'
(పుట. 7).

ఇందు మూలానువాదములకుగల అన్యోన్య సంబంధము విచార్యముగా నున్నది. తద్భవము, తత్సమము, దేశి—అని ఈ విధముగా ప్రాకృత మనేక విధములుగా నుండునని మూలశ్లోకమున నుండగా శ్రీ శాస్త్రిగారు ప్రాకృతము తత్సమము దేశి అని రెండువిధములు మాత్రమేనని ఏల అనువదించిరో తెలియకున్నది. మూలగ్రంథమును లెస్సగా అవగాహన చేసికొన్న అనువాదమే యిది. ఇట్టి స్వల్పములయిన విభిన్నధోరణు లుండకుండుట అభిలషణీయము. శ్రీ శాస్త్రిగారి కృషి ప్రశంసనీయము. శ్రీ గణపతి శాస్త్రిగారు అచ్చటచ్చట తమ పితృపాదుల తెలుగు పద్యములకు వ్రాసిన వివరణములు పాఠకుల కుపకారక ములుగానే యున్నవి.

—క్షేమేంద్ర.

## మా న వ గీ త

(వచన కవితల సంకలనం)

(సంకలనం: నూతలపాటి; బత్సల. దీక్షప్రచు రణలు — చిత్తూరు—ప్రతులకు — సుమతికుమార్ హైరోడ్డు, చిత్తూరు; ఏ. పి.—పుటలు 7+48. వెల నూటయాభై పైసలు.)

అందంగా అచ్చుతప్పులు లేకుండా ముద్రింప బడ్డ ఈ సంకలనంలో 20 మంది కవిత లున్నాయి.

పాతపద్ధతిని నిరాకరించేవారిబలం ఎక్కువ తున్న సమయం యిది. వచన కవితను ఆసరగా తీసు కొని—ఈ విధంగా కొందరు 'రచయితలు'గా అవు తున్నారు. కొందరు కవులూ అవుతున్నారు. అయితే పాత—కొత్తలను సమానంగా ఆహ్వానించగలిగిన వ్యక్తి కవితలో ఒక పరిపూర్ణత సాధిస్తాడనడం నమ్మదగిన విషయం.

ఈ . కవితా సంకలనాలవల్ల పాఠకులకు ఒకటి రెండు ప్రయోజనాలు కలుగవచ్చు. ఏమంటే I. కొత్త రచయితలతో పరిచయం II. రచయితల విభిన్న దృక్పథాలు—వారి కవితలోని అందచందాలు తెలుసుకోవడం. అయితే ఈ సంకలనాలు మాత్రం మరీ మితిమీరి రావడంతో పాఠకుడుగూడాఎక్కువభాగం ఉబుసుపోకకే చదవడం సంభవిస్తుంది. ఈ విధమైన పద్ధతిని ఎంత తొందర్లో తగ్గించగలిగితే అంత మంచిది. సంకలనాలు—ప్రసిద్ధ రచయితలవి,ప్రసిద్ధి గాని రచయితలవి—ఈ ఉభయులవి—అని మూడు విధాలుగా భావిస్తే— 'చలిపందిరి'లోని 'ఈ సంపు టిలో ప్రసిద్ధులెవ్వరూ లేరు. ఉన్నా వారు మరొక శాఖలోకే చేరుతారు. వచన కవితాశాఖకందరూ కొత్త వారే—అనుకుంటే ఈ సంకలనం పైన చెప్పిన రెండవ తరగతికి చెందుతుంది......అంతేకాని ఏ విధం గాను మూడవ తరగతికి చెందిన సంకలన గ్రంథం కాదు—' అని మధురాంతకం రాజారాంగారు తెలుపు తున్నారు. కావచ్చు. 'కావ్యపఠనంలో వ్యక్తి కాలాన్ని పాదుపుచేసి కవిత్వాన్ని ప్రజలకు సన్నిహితం చేయ డానికి ఛందస్సులో వచ్చిన పరిణామమే వచనగేయం' అన్నారు దీంట్లో మధురాంతకంవారు. కాని ఈ వాక్యంతో ఏకీభవించగలిగినవారు ఎంతోమంది ఉండక పోవచ్చు. 'మానవగీత' శీర్షికలో 'సమాఖ్య' ఈవిధంగా అంటారు.

గతం ఫలితాలతో భావి అంచనాలతో
వర్తమాన వర్తకాన్ని నిపుణంగా నడిపించే
శక్తివంతమైన కొత్త గేయం పాడు'
..................... . ......

—'గాయం నయంచేసే గేయమే నీ ధ్యేయం—

జరిగిన (ప్రాచీన కవిత) ఫలితాలను అనుభవిస్తూ— భవిష్యత్ అంచనాలనువేస్తూ జరుగుతున్న (వచన

కవితలో వివిధప్రక్రియలని) వర్తకాన్ని—నడిపించగల గేయం కావాలంటారు,

అయినా—'ఇంకా ఆపాదబంధాలెందుకు నీకు?

ఓయీ! భావవిహంగమా!—' అంటూ ప్రశ్నిస్తారు—

మన నమ్మకాలను నిరంతరం కాకపోయినా అప్పుడప్పుడూ తల్లక్రిందులచేసేశక్తి కాలానికి ఉంది—అని నమ్మడం మంచిది.

'దేవునికో మనవి'లో చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మగారు—

కవులం మేమంతా
నీవెంత లంచ మిచ్చినా
నీవెంత మనసిచ్చినా
నీకు లొంగం—'

'కలియుగ పురాణం
వ్రాస్తాం—బ్రహ్మాండంగా—
మా పురాణంలో నీకు చోటులేదు—'

అని దేవుడికి మనవి చేస్తున్నట్టుగానే ప్రశ్నిస్తారు. ఉన్న పెద్దరచనలో ఈ 'దేవునికో మనవి' ఒకటి.

గుంటుమడుగు రామచంద్రరాజుగారి 'మా వీధి కావ్యంలో కొన్నిభావాలు—' చాలా చక్కని చిక్కని వ్యంగ్యరచనగా భాసిస్తుంది.

'గుండెలమీద గుండీలు విప్పి తిరగడమంటే సరదా
రోడ్‌సైడు రోమియోకి
వీపువెనుక గుం(డె)డీలు పగిలినా లెక్కచెయ్యడు
స్టైనో కదొక స్టైయిల్
నిజంగా గుండీలు తెగిననాడు ఆఫీసుకు
'లీ(ల)వ్‌లెటర్ నడిచివెడుతుంది
సెక్సుబుక్కుని దాచడానికోసం క్లాసుబుక్సుకూడా
విధిగా తీసుకెడుతున్నాడు కాలేజి కుర్రాడు'

'నేను కవిని—చిద్గగన రవిని
రాకు ప్రియా నా దరికి రాకు
బాకులాంటి చూపు గుండెలో గుచ్చకు'
(శ్రీ వల్లంపాటి వెంకటసుబ్బయ్య)

సంకలనం దాదాపు మంచికవితలతోటే కూడు కొని ఉందనవచ్చు—'దీక్షజాతకంలో మొదటిగీత ఈ నవగీత—మా గీతను సర్వమానవగీతకు ప్రతీక చేయాలని మా ప్రయత్నం'అని 'తుది గీత'లో తెల్పారు.

రాబోయే సంకలనాన్ని ఇంకా కొంత మంచిగాచేస్తే బాగుంటుంది. ఏదైనా పదికాలాలపాటు నిలువకలగాలి.

## నవనందిని

(గేయసంపుటి)

(రచన: కొటికలపూడి కూర్మనాథం, ఆంగ్లోప న్యాసకులు— మహారాజా కళాశాల, విజయనగరం. మూల్యము 5—00.)

ఈ గ్రంథము 128 శీర్షికలుగల వివిధ గేయముల కూర్పు—రచయిత మధ్యమధ్య, కృష్ణా పత్రిక, సాహితి, సారంగి, కథాంజలి, మురళి, ప్రజామత—మొదలైన వివిధ పత్రికలయందు వ్రాసిన గేయములను ఒక చోటచేర్చి 'నవనందిని' పేరుతో గ్రంథముగా ముద్రింపించినారు.

కొటికలపూడి వారిది కవితావంశము. ఆ ఛాయలు వీరికిని యబ్బినవి. అది పరంపరాగత ప్రతిభాలక్షణము. 'గేయసంపుటి' యని పేరున్నను కొన్ని పద్యములు గలవు. మధ్య మధ్య ఏవో నంద ర్భములయందు వ్రాసినవి గావున గేయములన్నియు ఒకే పద్ధతిలో లేవు. కొన్ని గేయములందు మాత్రము 'లయ' పాటింపబడినది.

'మధుర మాధవము' 'ప్రణయ ప్రభంజనము' 'అంతర్వాణి', 'క్రౌంచవనము' 'ప్రబోధ దీపిక' 'భక్త్యంజలి' 'ద్రుమమంజరి' 'మధువనము' 'నవోదయం' అను విభాగములలో (వర్గములుగా) గేయముల చేర్చినారు.

ఈ గేయములన్నియు పాఠకుని ఆకర్షించు నని చెప్పవీలులేదు. రచనా పటిమ, లయ, భావము—

మొదలగు పద్ధతులబట్టి కొన్నిమాత్రము ఆలో చనామృతములుగ నుండును. మొదటి వర్గములో 'వసంతుడు—తీవకన్నె' శీర్షికగల గేయము

తీవకన్నియ తీవకన్నియ
పసరు మొగ్గల బరువు నెక్కిన
చివురుటాకుల కోకవన్నెల
కమ్మతేనెల కన్నెపలపులు
చిందుచుంటివి—చిందుచుంటివి
పూలదొంతర పరిమళమ్ములు
ఘుమ్మ ఘుమ్మన చిమ్ముచుంటివి......'

ఈ గేయమొక మధురభావన కలిగించును. క్రింద గీత గీసిన భాగము—అట్టి భావనకు మేలుబంతి గాగలదు.

'ప్రణయ ప్రభంజనము'లో 'ప్రేక్షణ', 'ప్రేరణ' గేయములు బాగున్నవి.

భావపరిమళవీథి
బాపుటగ నెగిరి
హృదయాన నిదురించు రాగమున్ రగిలించు
నవనీతమై కరగి నన్ను నేమరచు
హేమాద్రిపై నిలిపి బ్రతుకుబాటలు దీర్చు
నవయౌవనానంద కాలమాధురి జూపు
మోహనాంగి! నీదు వీక్షణములో కలదు.
క్రొత్త స్వర్గాల సృష్టి—'

'ప్రవాసము' 'మజ్నూన్ విలాపము'—వీనియందు కరుణ గలదు.

ఈ నిశీధికాటుకల్ చీల్చి నా
కుటీరపుమొగిసాల నిల్చినెవరు.........
ఎవరు? ఎవరది చరణ మంజీర రవళి?
ఏమి? ఏమది కంకణ నిక్వణమ్ము?
వసనాంచలము దిద్దు నెవ్వరుబాలి!
..............................
భగ్నవీణకు మరల నిస్వనములేదు,
దగ్ధమొందిన బ్రహ్మోడు పల్లవింపదింక
ధరణి రంగస్థలిని నాదు జీవనము
శిశిరముగ నిలుచు కోటిపౌర్ణమిగా—'

(ప్రవాసము)

'ధరణి రంగస్థలిని...' అను రెండు చరణముల భావములందును, 'వేదుల'వారి - పద్ధతి గోచరించు కరుణ గలదు.

కారు చీకటులలో కలిసిపోదువా!
విధిసంద్రములో నన్ను త్రోతువా?
..............................

(మజ్నూన్ విలాపం)

వీనియందు కరుణ పరాకాష్ఠ నందినది. పాఠకుడు తన్మయుడగును. ఈ క్రింది గేయంలో అభ్యుదయ సూచన—దానిశక్తి తహతహ వ్యక్తమగును.

ప్రగతిలేని గతిని మనం
శోకాగ్నికి సమిధలం
కలిరథచక్రాల క్రింద
బలిగిన నలిగి బ్రతుకు జనం
శిథిలంలో పనం మనం—('చేదుపాట')

పంచశీల రథానికే
సిల లూడపీకువారు
మోసము సాధించువారు
మిత్రులు కాలేరు వారు—('ఎవరహో')

దీనిలోని పంచశీల రథానికున్న సిల లూడపీకు వారనే విశేషణం అంతమంచిగా భావింపబడదేమో!

ప్రణయ ప్రభంజనమను రెండవ సర్గమందు గేయములు శృంగార పూరితాలైనా—మితిమీరిన శృంగారం లేదు ఈ సంకలనంలో కొన్ని ఆంగ్ల కవుల రచనలు—'కృతజ్ఞతలతో' స్వీకరించినవి గలవు.

కొంతకాలముగా ప్రతిగ్రంథమును సాహిత్యము నందు చలామణియగుచున్నది. రచయిత ఆశయము, పాఠకుని ఆశయము, అర్థముగాని పద్ధతిలో గలవు. అట్టి గేయములు ఈ సంకలనమునందు కొన్నిగలవు.

రచయిత కృషి యభినందనీయమనవచ్చును.

## 'స్పందన'

(కవితా సంకలనం)

(నిర్వహణ : స్పందన సాహితి, హైదరాబాదు. ప్రతులకు : స్పందన సాహితి 1—8—17/2 చిక్కడపల్లి, హైదరాబాదు 20; మూల్యం 100 పైసలు. పుటలు 8+80)

నలభై ఏడుగురు రచయితల వచన కవితా సంకలనం ఈ గ్రంథం. దీంట్లో కొందరు సుప్రసిద్ధులున్నారు. మరికొందరు ప్రసిద్ధి పొందుతున్నవారు. ఇంకా కొందరు మిక్కిలి కొత్తవారు. సంకలనం పేరు ఉన్నట్టు ('స్పందన') అందులోఉన్న కవిత్వమంతా ఆ విధంగా—అంటే స్పందన కలిగించేటట్టు మాత్రం లేదు.

కొంతకాలంగా వచన కవిత్వంబాగా వ్యాప్తిలోకి వచ్చింది. దీనికి శ్రీ శ్రీ వంటివారు గురుస్థానంలో ఉన్నారు. మరికొందరు బుజాలుతట్టి ముందుకు పంపే వారున్నారు. ఏమైనా తనేం—అందరు కాకున్నా కొందరుమాత్రం ఈ పద్ధతిలో మంచి రచన చేస్తున్నారు. వచ్చిన బాధ ఎక్కడంటే 'ప్రథమ రచనతోనే పత్రికలకో రేడియోకో ఎక్కడానికి ప్రయత్నం జరుగుతున్నది. దీనివల్ల ఆధునిక కవితాభిమానం లేనివారు యివి యింత పేలవంగా వస్తున్నవే అని పెదవి విరిచే అవకాశంకలుగుతున్నది'— అనే కుందుర్తి మాటలు అక్షరాలా నిజం. అయితే వచన కవిత్వం అనే వరకు ప్రాచీన కవితను తిరస్కరించడం సరిగాదు. పూర్వ కవితా సంప్రదాయాలను చక్కగా గ్రహిస్తేనే వచన కవిత (ఆధునిక కవిత) రసవంతంగా చేస్తారు. ఈ 'స్పందన'లో అలాంటి కవులు కవితా స్పందన కన్పిస్తుంది.

> 'ఇన్నాళ్ళ అరగట్టుకున్న యీ పేగులు
> యిగురించే విప్లవ భావాలకు మాగాణులు
> ఇంగువకట్టిన వస్త్రాలు కావివి
> యింగలం దట్టించిన అస్త్రాలు'

అంటారు శ్రీ వరవరరావు. ఆకలితో అటమటించి అహర్నిశలూ ధ్వని చేస్తున్న పేగులు, విప్లవాన్ని ఊహించి ఆ భావానికి 'మాగాణం'గా మారుతాయి. అంతేకాకుండా నిప్పుతో కూడినట్టి అస్త్రాలుగా— వస్త్రాలు మార్తాయి. 'ఇంగువకట్టిన గుడ్డ' సామెత, ఆ గాగే 'ఇంగలం' (నిప్పు) జాతీయాలతో ఒకనూతన భావాన్ని వెలికితీసి పాఠకుడికి అందీయడం, ఈ 'వేగం' మళ్ళీ ఓ విధంగా కన్పిస్తుంది.

> 'యువ్వాలిటి కావ్యానికి ఛందస్సు—'ఉద్యమం'
> కవి సమయం—'తిరుగుబాటు'
> 'విప్లవం' యీనాటి కావ్యానికి స్పందన.'

అంటారు — దీంట్లో ఉద్యమం, తిరుగుబాటు, విప్లవం—శ్రీ శ్రీ కవితా అపోశనవల్ల ఏర్పడ్డభావంగా భావించే వీలుంది. ఈ కవితాఖండికలో 'స్పందన' ఉంది.

> గుండెకెలితేనేగాదు 'భక్తి'
> సిరిగా బతికితేనే 'రక్తి'
> చెమటోడ్చి శ్రమిస్తేనే 'భుక్తి'
> చెడు చేయకుంటేనే 'ముక్తి'
> (శ్రీ అంచల లక్ష్మీనారాయణ)

దీంట్లో భక్తి—రక్తి—ముక్తి—భుక్తి— లేకుంటే నిర్మాణం చెడుతుంది. ఈ చివరి రెండక్షరాలనల్ల ఖండికలో క్రొత్తదనం గన్పిస్తుంది. ఇట్లాంటిదే గాకున్నా ఈ పద్ధతిలోనే—రచయిత:

> 'మానవత్వమంటే ఏమిటి?
> మానవుడి తత్వం ఏమిటి?
> వరులంతా వాళ్ళని ఎంచు
> నలుగురికీ నీ ఆనందం పంచు'—అంటారు.

పై రెండు పాదాల్లో ఎదురుప్రశ్న ఉంది. చివరి రెండు చరణాల్లో లక్ష్యరగమకంగా అంత్యప్రాస వచ్చింది. ఇది ప్రతి దగ్గరా శోభిస్తుందని చెప్పలేం.

> 'నా కలాన్ని ఉరిగా మలిచి
> దానవుణ్ణి చేస్తాను
> నా పాళికి ప్రాణంపోసి
> ఇంటింటా సన్నాయి మ్రోగిస్తాను.'

అని 'శపథం'లో కె. శివారెడ్డిగారంటారు. మొదటి రెండు పాదాల్లో భావం ఉద్వేగంగా ఉంటుంది. పాళీకి ప్రాణంపోసి ఇంటింటా సన్నాయి మ్రోగించడం మాత్రం—ఆ భావంతో తులతూగదు.

'పాడుబడ్డ సామాజపు కొండపేటిబావిలోపలి
అట్టడుగు చీకటికోణాల్లో అలముకొన్న నీడలవెనుక
సన్నని రాగంతీస్తూ మనిషి కావాలం'టారు—

అద్దేపల్లి రామమోహనరావుగారు. దీనిలో అన్వేషణే గాకుండా నిజమైన వచన రచనా వైలక్షణ్యం ప్రస్ఫుటమవుతుంది.

ఈ సంకలనంలో ఆలోచన, ఆవేదన ప్రస్ఫుటమవుతాయి.. 'విభిన్న దృక్పథాలను ఒకే వేదిక మీదికి తీసుకరావడమే ఈ సంకలనం ముఖ్యోద్దేశం' అని 'స్పందనసాహితి' వారు వ్రాసుకొన్న మాటల్లో చాలావరకు నిజం ఉంది.

'శ్వేతకమలం'లో దౌలత్‌బేగం, 'బాపూజీ బ్రతికుంటే'లో డా॥ తంగిరాల—'సంస్కరణ'లో గంధం జోయెల్, 'క్రాంతి'లో సి. వి. కృష్ణరావుగారలు— చక్కని భావాలను నిరూపించ కల్గినారు. ఈవిధమైన ఖండికలు 'స్పందనం'గా ఉంటున్నాయి. అరిపిరాల విశ్వంగారి 'విశ్శబ్ద సంగీతం', నాయనికృష్ణ కుమారి గారి 'చంద్రసూక్తం' ఊహాలోకాల్లోకి పాఠకుడిని తీసుకవెడుతాయి.

నివాళగారి 'పాపంశమించుగాక' — చక్కని వ్యంగ్యం కన్పిస్తుంది.

"పెరుగుతున్న నా అప్పులు కబంధ హస్తాలై
ఎన్నో త్యాగాల ఫలితమైన స్వాతంత్ర్యాన్ని
కబళిస్తాయేమోనని కలుగుతుంది శంక
పాపము శమించుగాక! ఓ శశాంకా!' అంటారు.

'కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ—' అయిన మరియొక సంకలనం 'స్పందన సాహితి'నుండి ఆశిద్దాం—

—శ్రీరంగాచార్య.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.